# తారాస్ బుల్బా

[ కోసక్ వీరుల అమరగాథ ]




రచన:

గొగోల్





సర్వోదయ పబ్లిషర్సు,

విజయవాడ-2.

# తారాస్ బుల్బా

అనువాదం:

శ్రీనివాస చక్రవర్తి

# 1

"ఊఁ- యిలా వెనక్కి తిరగండి, చూద్దాం. దిష్టి బొమ్మల్లా తయారయారేం? ఫాదరీల్లాగా ఆ అంగీలేవిఁటి? మీ కాలేజీకుర్రాళ్ళంతా యిలాంటి వుడుపులే ధరిస్తారాయేం?"

ఇలాఅంటూ ముసలి బుల్బా, కీవ్ విద్యాలయంలో చదువు ముగించుకుని ఇంటికి తిరిగివచ్చిన కొడుకు లిద్దరికీ స్వాగత వచనాలు పలికాడు.

అతని కొడుకులు అపుడే గుర్రాలు దిగారు. ఇద్దరూ బొద్దుమనుషులు. యువజన విద్యార్థులందరిలాగానే బిడియస్తులు. వారి మోహాలలో ధైర్యస్థయిర్యాలు, ఆరోగ్యం, నూనూగుమీసాల నూత్నయవ్వనం తొణికిసలాడుతున్నాయి. తండ్రి ఇలా స్వాగతమిచ్చేసరికి కంగారుపడి నేలకేసి నిలకడగా చూస్తూ స్థబ్ధుగా నిల్చుండిపోయారు.

"కాస్త వుండండి. మిమ్మల్ని కళ్ళారాచూస్తాను" అంటూ బుల్బావారిని తనవైపుకు తిప్పుకున్నాడు. "యేవిఁటంత పొడుగ్గాటి కోట్లూమీరూ? బలే- బలేకోట్లూ! యింతవరకు ప్రపంచంలో యిలాంటి కోట్లుకన్నామా, విన్నామా? మీలో వకరు కాస్త అలా పరిగెత్తండి. కాళ్ళకి కోట్లుఅడ్డుపడి కిందపడతారో లేదో చూద్దాం."

"మమ్మల్ని చూసి నవ్వబోకు నాన్నా! నవ్వబోకు." అన్నాడు పెద్దకొడుకు.

"ఊఁ- అబ్బ! యెంతగర్వమో! యెందుకు నవ్వగూడ దేం?"

"యెందుకా? నువు నా కన్నతండ్రి వయినప్పటికీ నను చూసి నవ్వితేమాత్రం వూరుకోను. చితక తన్నేస్తాను."

"యేవిఁటీ? కన్నతండ్రినే చితకతంతావుగా? లంజ కొడకా!" అంటూ తారాస్ బుల్బా ఆశ్చర్యంతో నాలుగడు గులు వెనక్కి వేసాడు.

"కన్నతండ్రి వయితేనేం? నన్నవమానిస్తే వూరుకునేది లేదు."

"నాతో యెలా పోరాడాలని వుంది? చెప్పు. ముష్టి యుద్ధం చేదామా?"

"యెలాగయినా సరే."

"సరే. అలాగయితే ముష్టియుద్ధమే చేదాం. కానీ" అంటూ తారాస్ బుల్బా చొక్కాచేతులు పైకి మడిచాడు. "యేమాత్రం ముష్టియుద్ధం చేస్తావో చూస్తాగా!"

చాలా కాలం ఎడబాటు తరవాత కలుసుకున్న తండ్రీ కొడుకులు కులాసాగా మాట్లాడుకోవడానికి బదులు తుంటిమీద, ఎదుర్రొమ్ముమీద, పొట్టమీద ఒకరినొకరు పిడికిళ్ళతో పొడుచు కుంటూ వెనక్కి తగ్గుతూ ఒకరికేసి ఒకరు చూసుకుంటూ, మళ్ళీ ఒకరినొకరు తాకుతూ పోరాడసాగారు.

"బాబూ! చూడండి, చూడండి! ముసిలాయనకి పిచ్చెత్తి నట్టుంది! మతి శుభ్రంగా పోయింది." అంది ఆ యువకుల తల్లి

ద్వారంలో నిలబడి. ఆమె బక్క పల్చటి మనిషి. మొహంలో ఎక్కడా నెత్తురుచుక్క లేదు, పాపం! తన గారాబుబిడ్డలను కావలించుకోవడానికయినా ఆమెకి వ్యవధి చిక్కలేదు.

"పిల్లలు యింకా సరిగా యింటో కాలుపెట్టలేదు. చూసి సంవత్సరం దాటిపోయింది! అపుడే మించుకుపోయినట్టు పోట్లాట పెట్టాకో వాలని యీాయనికి తిక్క పుట్టింది!"

"అరే! బలేబాగా పోరాడతాడే!" అన్నాడు బుల్బాఆగి. "బలే బాగా పోరాడతాడు!" అన్నాడు. బట్టలు సవరించుకుని ఇంకాఅన్నాడు: "యింతబాగా పోరాడగలడని తెలిస్తే వీడితో పోరాడడానికి దిగేవాణ్ణే కానేమో! మాంచి కోసక్ గా తయారవుతాడు. సరే. నాయనా! రా, రా! యిక ముద్దియ్" తండ్రీ కొడుకులు ఒకరి నొకరు ముద్దిడుకోసాగారు. "సరే, నాయనా! నన్ను చిదకబాదినట్టే అందర్నీ చిదకబాదు. యెవర్నీ మన్నించకు. అయితేనేంగాని, నీ దుస్తులు మట్టుకు నవ్వు పుట్టిస్తాయ్! యిక్కడ వేలాడుతున్న తాడేవిఁటి?" అని చిన్న కొడుకుకేసి తిరిగి, "చేతులు వేలాడేసుకుని అలా సోమారిపోతులా నిలబడ్డావేమిరా అబ్బీ! ఊఁ వెధవనాగన్నా! నన్ను చావగొట్టాలని నీకు లేదాయేం?" అన్నాడు.

"మీకింకా పనిపాటా లేదా యేవిఁటి?"అంది తల్లి చిన్న కొడుకుని గట్టిగా కావలించుకుని "కొడుకులు తండ్రితో పోరాడడం యెక్కడయినా చూసామా, పెట్టామా! పసివాడు, యెంతో దూరాన్నుంచి వచ్చాడు. అలసిపోయాడు. యింకేం పనీపాటా లేదూ?..."ఆ పసివాడు ఇరవయి ఏళ్ళవాడు, ఆరడు

గుల మనిషి! "అలసట తీర్చుకుని యింత నోట్లువేసుకోవాలా అక్కర్లేదా? చిల్లికజ్జా పెట్టుకోమంటారూ?"

"ఊఁ-వెర్రిమొహమా!" అంటూ బుల్బా కొడుకు కేసి తిరిగాడు. "మీ అమ్మమాట వినకు నాయనా! ఆడది, దాని మొహం దానికేం తెలుసు? యెల్లకాలం అడ్డాలలో పెరగాలని నీకు వుందా యేం? యుద్ధభూమి—కత్తి! అదీ నీ జీవితం! యిదిగో, యీ కత్తికేసి చూడు. యిదే నీకు తల్లి! ఆ కాలేజీలో మీ బుర్రల్లోకి యెక్కించిన ఆ పుస్తకాలు. ఆ తత్త్వ శాస్త్రం, ఆ వెధవ విషయాలన్నీ పట్టి చెత్తనుకో!థూ!" అంతటితో ఆగక అచ్చువేయడానికి వీలులేని ఇంకో మాటకూడా అన్నాడు.

"మిమ్మల్ని వారంరోజుల్లోపల్నే జపరోజయోపంపిం చేస్తాను. మీకు కావలసిన విజ్ఞానమంతా అక్కడ లభిస్తుంది. అక్కడ బడివుంది. అక్కడొకచోటే మీ తెలివితేటలు పెంపొందు తాయి"

"గట్టిగా వక వారమయినా యింటిపట్టున వుండనీయరా యేం?" అని ఆ బక్కచిక్కిన ముసలది కన్నీళ్ళు పెట్టుకుని ఏడుస్తూ అడిగింది. "యింటికి వచ్చామని సంతోషంగా పది రోజులపాటు గడపడానికి వ్యవధి యివ్వరాయె. యింతకీ నా బిడ్డల్ని కళ్ళారా పదిరోజులపాటు చూసుకునే భాగ్యం నాకు లేదు."

"యిక నీ ఘోష కట్టిపెట్టు, ముసిలిముండా! కోసక్ మొగాళ్ళపని ఆడాళ్ళతో కాలక్షేపం చేస్తూ కూర్చోడంకాదు. కొడుకుల్ని వళ్లో పొదువుకొని కోడిపెట్టలా కూర్చుందా మను కున్నావేం? ఉహుం - అదేఁ సాగదు. యిక వెళ్ళి తిండిసంగతి

చూడు. నీ కయిమా వుండలు, తియ్యరొట్టెలు, మిఠాయి, పోస్తు అంబలి- అవేం పనికిరావు. మాకు వక గొర్రెని గొర్రెనే వండేసెయి. వక మేకా నలభయి యేళ్ళనాటిసర్బతు, యింకా మస్తుగా వోడ్కా, ద్రాక్షరసం, అదీయిదీ కలిపేవుసుమా! నిఖారసయిన వోడ్కా అందించు. యెట్లా వుండాలో తెలుసా? నురుగులు కక్కుతూ, తళతళా మెరిసిపోతూ, బుసబుసా పొంగి పోతూండాలి. తెలిసిందా!"

బుల్బా కొడుకి లిద్దరినీ ఇంటిలోకల్లా రమణీయమయిన గదిలోకి తీసుకువెళ్ళాడు. ఆ గది సర్దుతున్న చుక్కల్లాంటి దాసీ లిద్దరు వీరినిచూసి తొందర తొందరగా బయటికి పారిపోయారు. ఆ యువకులు నిర్మోహమాటస్తులు. అందుచేత వారి రాకకు భయపడో, లేకపోతే పురుషులు కంటబడితే స్త్రీలు హడావిడి చేస్తూ పరుగెత్తుకుపోయి, సిగ్గుతో విరిసే మొహాలు కప్పుకోవా లనే ఆచారం చొప్పునో ఆ దాసీలు పారిపోయి ఉంటారు. ఆ కాలపు అభిరుచులకు అనుగుణంగానే ఆ గదిని అలంకరించారు. ఆ కాలమూ, ఆనాటి అభిరుచులు పాటలలోను, జానపదగాథల లోను మాత్రమే నిలిచి ఉన్నాయి. గ్రీకు చర్చిల సమాఖ్యను ఎదిరించి యుక్రెయిన్ దేశస్తులు యుద్ధాలుచేసిన గడ్డుకాలంలో లాగా, గ్రామీణులు గుంపులు గుంపులుగా చుట్టూ పరివేష్టిం చగా తంబురా మీటుకుంటూ వృద్ధ అంధగాయకులు నేడు ఆ పాటలు, గాథలు పాడటంలేదు. ఆగదిగోడలు, లోకప్పు, నేల రంగుకలిపిన మట్టితో చక్కగా అలికారు. గోడలికి కత్తులు, కొరడాలు, వలలు, తుపాకులు, నగిషీ చెక్కిన మందు కొమ్ములు, బంగారపు కళ్ళెం ముక్కలు, వెండికట్టుల పగ్గాలు వేలాడు

తున్నాయి. కిటికీలు చిన్నవి. వాటికి గుండ్రటి మసక అద్దాలు అమర్చారు. అద్దం చట్రంపళ్ళంగా ఎత్తితేనే వాటిలోనుంచి చూడ గలుగుతాం. అలాంటి కిటికీలు నేడు చర్చిలలో మాత్రమే కని పిస్తాయి. కిటికీలచుట్టూ, ద్వారబంధాలచుట్టూ ఎర్రరంగు పూసారు. నాలుగుమూలలా అరమారాలున్నాయి. వాటిల్లో అనేక చేతులుమారి, అనేకవిధాల బుల్బాచేతికి చిక్కిన వస్తువులు- వెనీసు, టర్కీ, టుర్కేపియాలలో తయారయిన కూజాలు, ప్లాస్కులు, ఆకుపచ్చని గాజుపాత్రలు, ఊదారంగు గాజు పాత్రలు, నగిషీ చెక్కిన వెండి గిన్నెలు, బంగారపు పూతపూసిన రకరకాల కప్పులు ఉన్నాయి. నాలుగుగోడల వెంబడే తవిసె కర్రబెంచీలు, ముంగిటి మూల దేవతా విగ్రహాల దిగువున పెద్ద మేజాబల్లా ఉన్నాయి. రంగురంగు రాళ్ళతో కట్టిన పెద్ద నెగడు ఒకటి వంకర టింకరగా ఉంది. నెగడకూ గోడకూ మధ్య ఒక కట్ట ఉంది. ఇవన్నీ ప్రతి సంవత్సరమూ శెలవులకు ఇంటికి నడిచివచ్చే ఆ యువకులిద్దరికీ చిరపరిచితమయినవే. అవును, నడిచివచ్చేవారు. వారికి గుర్రాలులేవు. విద్యార్థులు గుర్రాలమీద స్వారీ చేయడం ఆనాటి సంప్రదాయం కాదు. పురుష చిహ్నంగా వారి నడినెత్తిన పొడుగాటి జుట్టుముడులున్నాయి, ఆయుధాలు ధరించే కోసక్‌లకు మాత్రమే ఆముడి తీయించు కునే హక్కు ఉంది. ఆ ఇద్దరు యువకుల చదువు పూర్తి అయిన మీదనే తండ్రి వారికి తన మందలోనుంచి జతగుర్రాలను పంపాడు.

కొడుకులు చదువు పూర్తిచేసురుని ఇంటికి తిరిగివచ్చిన సందర్భాన్ని పురస్కరించుకుని సోట్నిక్ * లను, ఇంటివద్దనే

* సోట్నిక్ అంటే వందమంది కోసక్‌లు ఉన్న దళానికి నాయకుడు.

ఉండిపోయిన తన పటాలంలోని అధికారులను బుల్బా పిలి పించాడు. చిరకాలమిత్రుడయిన కాప్టెన్ డిమిట్రోటోవకాచ్ ఇంకో ఇద్దరు అధికారులను వెంటబెట్టుకుని రాగానే వారికి తన కొడుకులను పరిచయంచేస్తూ, "చూడండి యెంత చక్కగా వున్నారో! త్వొందర్లోనే వీళ్ళని గడీకి సంపించేస్తాను." అన్నాడు బుల్బా. అతిధులు బుల్బాను, అతని కొడుకులను అభినందించి మంచిపనిచేస్తున్నావనీ యువకులకు గడీకంటె ప్రశస్తమయిన బడి వేరొకటి లేదనీ చెప్పారు.

"సరే సరే, యెక్కడ కూర్చోదలచిన వాళ్లు అక్కడే కూర్చోండి. యిక వోడ్కా తాగుదాం." అన్నాడు బుల్బా. "భగవంతుడు మనల్ని రక్షించుగాక! మీ క్షేమం కోరుతూ యిదిగో ఒప్లావ్, యిదిగో ఆంద్రీ! మీకు రణరంగంలో విజయం లభించుగాక! టర్కీవాళ్ళు, తాతార్లు, మన మతంజోలికి మళ్ళీ వస్తే పోలండువాళ్ళు మొదలయిన పాషండులను మీరు హాత మార్చెదరుగాక! ఊఁ-కానీండి వోడ్కా బావుండలేదా యేం? లాటిన్ భాషలో వోడ్కాని యేమంటారు? ఆఁ-అదీ! ఆ రోమనువాళ్ళున్నారే, వాళ్ళు వట్టి తెలివితక్కువ దద్దమ్మలను కోండి యీ భూప్రపంచంలో వోడ్కా అంటూ వక పదార్థం వుందని వాళ్ళకి తెలిసేడవదు. లాటిన్‌లో పద్యాలు రాసిన ఆకవి-అతని పేరేమిటి చెప్మా? నేనేమంత పండితుడిని గాను. అందుకని బల్లగుద్ది గట్టిగా చెప్పలేనుగాని అతనిపేరు హోరాసీ కాదూ?"

'మాటలు కూడా మనిషికీ తగినట్లె వున్నాయి' అనుకు న్నాడు పెద్దకొడుకు ఒస్టాప్. 'ముసలిపీనుక్కి అన్నీ తెలుసు. తెలిసే యేమీ తెలియనట్లు నటిస్తాడు.'

"అక్కడ కీవ్‌లో మీ గురువుగారు గుక్కెడు వోడ్కా- అన్నా తాగనిచ్చేవారు కాదనుకుంటా. రేగిచువ్వలు విరిచి మీ వీపులు బద్దలుకొట్టుంటారు. మీరు మరీ తెలివిమీరితే కొరడాతో చావగొట్టేవాడు గదూ? వక్క శనివారంనాడే గాదు, బుధ గురువారాల్లోకూడా కొట్టేవారనుకుంటా, చెప్పరేం?"

"జరిగిపోయిందాన్ని గురించి మాట్లాడి లాభమేమిటి నాన్నా! అయిందేమిటో అయిపోయింది." అని జవాబిచ్చాడు ఒస్టాప్.

"అలా నన్నుకొట్టాలని యెవర్నయినా యత్నించమను చూదాం!" అన్నాడు ఆండ్రీ. "నా వంటిమీద చెయ్యి వేయ మను! అందాకా యెందుకు, యే తాతారువాడయినా నాకంట పడితే వాడికి కోసక్ కత్తి తడాఖా రుచి చూపించనూ."

"బలే! బలేముక్కన్నావు నాన్నా! సరే. యింకెందుకు అందాకావస్తే నేనూ మీతోవస్తా. వొట్టు వస్తా. నేను యిక్కడ వుండి చేసేదేవుంది? నాగలి దున్నుకుంటూ, గొర్రెల్ని పందుల్ని కాచుకుంటూ, యింటిపనులు చూస్తూ ఆడముండ లాగా కూర్చోడమేగా! నేను కోసక్‌ని. అలాంటి పనులు నాకు గిట్టవు. యిపుడు యుద్ధం జరుగుతూండక పోతేనేం? మీతో పాటు జపరోజియే వచ్చి అక్కట ఖుషీగా కాలం గడుపుతా. వొట్టు" ఇలాఅంటూ ముసలి బుల్బా క్రమేపీ ఆవేశం తెచ్చు కుని లేచి ఠీవిగా నిలబడి నేల తన్నాడు. "రేపే వెళదాం.

ఆలస్యం యెందుకు? మనమీదికి శత్రువులువచ్చి పడుతున్నారు గనకనా? యీ వెధవ గుడిసెతో మనకి పనేవిఁటి? యీ చెత్తంతా యెందుకూ, తగలెట్టనా? యీ కుండ పెంకులు యేం వొరిగిస్తాయేం?" అంటూ బుల్బా గదిలో ఉన్న కూజాలు, ఫ్లాస్కులు నేలకేసి కొట్టి ముక్కలు ముక్కలు చేసేశాడు.

అతని కళాకళలు ఆ ముసలావిడికేం కొత్తగాదు. పాపం! దీనంగా భర్తని కనిపెట్టి చూస్తూ బల్లమీద కూర్చుంది. మాట్లాడడానికి ధైర్యం చాలలేదు. కాని ఆమెకెంతో భీతి గొలిపే ఆ నిర్ణయం విని కన్నీళ్ళు ఆపుకోలేకపోయింది. త్వర లోనే ఎడబాసిపోయే సంతానంవంక తేరిపార జూసింది. ఆమె నేత్రాలలో, వణుకుతూంటే అతికష్టంమీద బిగపట్టుకున్న పెదవు లలో తారాడే నిరాశ వర్ణనాతీతంగా ఉంది.

బుల్బా శతమొండి. పదిహేనవ శతాబ్దపు గడ్డు రోజుల్లో, ఇంకా స్థిరనివాసం ఏర్పరచుకోనని కోసక్ జాతిలో ఉద్భవించాడు బుల్బా. అనాగరిక దక్షిణ రష్యాను సంస్థానాధీశులు వదిలి వెళ్ళిపోయారు. మంగోలియన్ దోపిడి దొంగలను అరికట్టడం ఎవరికీ సాధ్యంకాలేదు. వాళ్ళు దేశాన్నంతటినీ నాశనం గావించి దగ్ధపటలం చేశారు. దగ్ధపటలమయిన ఆ గడ్డమీద అజేయు లయిన శత్రువుల మధ్య, ఎడతెగని అపాయాలమధ్య తిరిగి నివాస మేర్పరచుకుని భయమనేదే మరిచేపోయి శత్రువులను లక్ష్యపెట్టకుండా ప్రజ జీవించ సాగారు. శతాబ్దాల తరబడి ప్రశాంత జీవనం అనుభవిస్తున్న ఆ జాతిలో వీరావేశం ప్రజ్వ రిల్లి కోసక్ రాజ్యం ఏర్పడింది. రష్యన్ ప్రజాప్రకృతిలోనుంచి సర్వతంత్ర స్వతంత్రంగా అవతరించిన రాజ్య మిది. నదీ తీరా

లలో, రేవులపక్కన, ఎక్కడపడితే అక్కడ నేల ఈనినట్లు లెక్కలేనంతమంది కోసక్‌లతో ఆ నదీప్రాంతం నిండిపోయింది. సుల్తాను వారి సంఖ్య ఎంత అని అడిగినపుడు "యెవరికి తెలుసు? పచ్చిక మైదాన మంతటా మేమె. గుట్టగుట్టకీ కోసక్‌లే మీకు కనిపిస్తారు."అని ధైర్యోపేతులయిన కోసక్ వీరులు సమాధాన మిచ్చారు. ఉక్కుముక్కతో చెకుముకురాయిని కొడితే అగ్ని ఆవిర్భవించినట్టు ఆపదల రాపిడివల్ల ప్రజాహృదయాలలోనుంచి ఆవిర్భవించిన రష్యన్ శక్తి ఇలా బహిర్గతమయింది. వేటగాళ్ళు, దండాధికారులతో నిండిన నగరాలకు, చిన్న చిన్న పట్టణాలకు బదులు, తమలో తాము యుద్ధాలు చేసుకునే సంస్థానాలకు బదులు అభేద్యమయిన గ్రామాలు, యుద్ధ సన్నద్ధమయిన పల్లెలు వెలిశాయి. వారందరూ ఎదుర్కొనవలసిన ఒకే అపాయం, క్రైస్తవేతర దాడిమూకలంటే వారందరికీ కలగట్టుగా ఉన్న ఏహ్యాభావం వారిని ఒకటిగా చేశాయి. ఈ కోసక్‌ల నిరంతర పోరాటంవల్ల, వారి సాహసంవల్ల రాక్షసిమూకల పాలపడే ప్రమాదం ఐరోపాఖండానికి తప్పిపోయింది వీరిమీద సార్వభౌమాధికారం చిన్న చిన్న సంస్థానాధీశులనుంచి పోలండు రాజులకు సంక్రమించింది. ఈ రాజులు దూరాన ఉన్నా, దుర్బలులయినా కోసక్‌ల విలువను, వారి వీరత్వంవల్ల చేకూరే ప్రయోజనాలను గుర్తించారు. అలా గుర్తించి కోసక్‌లను పొగుడుతూ, వారి ధోరణిని ప్రోత్సహించ సాగారు. కోసక్ నాయకులు గ్రామాలను పల్లెలను పటాలాలకింద, సైనిక స్థావరాల కింద మార్చివేసారు. వారికి శాశ్వత సేన అంటూ లేదు. దానిజాడే కనిపించదు. కాని యుద్ధమే గనక తటస్థిస్తే ఒకవారం రోజులలో ఆపాదమస్తకం ఆయుధాలు

ధరించి అశ్వారూఢులయి, ఒక్క డకెట్ ఇస్తే చాలు, పోరాడడానికి ప్రత్యక్షమయేవారు. రెండువారాలలో కనీ వినీ ఎరగనంతటి సేన సమకూరేది. యుద్ధం సమాప్తం కాగానే ఆ యోధులు ఎవరిమానానవారు తమ తమ పొలాలకో, పచ్చిక బీడులకో, నీపర్ నదీ తీరాలకో మరలిపోయి చేపలు పట్టుకునో, వ్యాపారం చేసుకునో, సారాయి కాచుకునో స్వేచ్ఛగా జీవనం చేసేవారు. కోసక్లకు తెలియని విద్యంటూ లేదు. సారా కాయగలరు, బళ్ళు తయారు చేయగలరు, పిండి విసరగలరు, కుమ్మరం చేయగలరు, తాళాలు బాగుచేయగలరు. ఇంతేగాదు, తాగి తందనాలాడగలరు. పక్కా రష్యన్లాగా మస్తుగా తిని వేడుకలు చేసుకోగలరు. ఇంకెన్నెన్నో పనులు చేయగలరు. యుద్ధంలో పాల్గొనడానికి పేర్లు నమోదు చేయించుకునే వాళ్ళనేగాక, అత్యవసరమయితే స్వచ్ఛంద ఆశ్విక దళాలను ఇట్టే సమకూర్చవచ్చు. కోసక్ నాయకులు పల్లెలు, పట్టణాలు ఒకమాటు తిరిగి, అక్కడి బజారులలో, చౌకులలో నిలబడి గొంతెత్తి బిగ్గరగా,

"ఓహో! సారాకాచేవాళ్ళల్లారా! సారాబట్టీలు కట్టే యండి. నెగళ్ళపక్కన పడుకుని దోమల్ని తోలుకుంటూ కాలం వ్యర్థం చేయకండి. యుద్ధంలో పాల్గొని వీరోచితమయిన యశస్సు, గౌరవం ఆర్జించండి. రైతులారా! గొర్రెకాపరు ల్లారా! ప్రేమికుల్లారా! నాగళ్ళు విప్పండి. పొలాలల్లో తిరిగి మీ బూట్లు బురదచేసుకోవట మెందుకు? స్త్రీలవెంటబడడం చాలించండి. లెండి! పేరు ప్రతిష్టలు గణించుకునే తరుణం వచ్చింది." అని గనక కేకపెడితే చాలు ఎండుగడ్డిలో నిప్పురవ్వ

పడ్డట్టు! రైతులు నాగళ్ళను ముక్కలు ముక్కలు చేసేవారు. సారా కాచేవాళ్ళు తొట్లో పారేసి, పీపాలు చిందరవందర చేసేవారు. వృత్తి విద్యలవారు, వర్తకులు తమతమ వృత్తులను, దుకాణాలను కాలదన్ని ఇంటిలోని కుండలు బద్దలు కొట్టేసే వారు. ప్రతి కోసక్ గుర్రం ఎక్కేవాడు. క్లుప్తంగా చెప్పా లంటే, రష్యన్ ప్రకృతి ఇచ్చట మహోన్నత స్థాయిలో అభి వ్యక్తమవుతుంది.

తారాస్ బుల్బా సిసలయిన సేనాని. జన్మతఃవీరుడు. యుద్ధాలంటే కొట్టుకుపోయేవాడు. నిజాయితీపరుడనీ, పెడ సరి మనిషనీ పేరు పొందాడు. ఆ రోజులలో రష్యన్ జమీం దార్లమీద పోలిష్‌వారి ప్రభావం ఎక్కువగా పడసాగింది. చాలా మంది జమీందారులు పోలండు దేశపు ఆచారాలను అవలంబింప సాగారు. విలాసాలను, మహోన్నతమయిన రాజభవనాలను, పరివారాన్ని, డేగలను, వేటగాళ్ళను, విందులను, రాజదర్బారు లను ప్రవేశపెట్టారు. ఇవేవీ బుల్బాకి రుచించలేదు. కోసక్‌ల నిడారంబర జీవితమే అతనికి నచ్చింది. వార్సా జీవిత విధానం వైపు మొగ్గుచూపేవారితో తెగతెంపులు చేసుకుని వారిని పోలండు ప్రభువుల ముద్దుబిడ్డలని బుల్బా పిలిచేవాడు. బుల్బా అలసట అంటూ ఎరగడు. సనాతన ధర్మరక్షణ తన జన్మ హక్కని భావించేవాడు. భూస్వాముల దౌర్జన్యానికి గురి అయినామనో, కొత్తపన్నులు వచ్చిపడ్డాయనో మొరపెట్టుకున్న వారి గ్రామాలకు వెళ్ళి న్యాయం కలగజేస్తుండేవాడు. మూడు సమయాలలో మాత్రమే, ఒకటి: కోసక్ పెద్దలకు పోలిష్ సము ద్దారులు గౌరవం చూపకుండా టోపీలతో నిలబడినపుడు; రెండు సనాతన ధర్మానికి భంగపాటు కలిగినపుడు, సనాతనాచారాలు

పాటించనపుడు; మూడు: ముసల్మానులు, టర్కీవాళ్ళు కంట పడినపుడు మాత్రమే కత్తి దూయవచ్చని నియమం ఏర్పరచాడు. క్రైస్తవ ప్రపంచపు ఘనత నిలబెట్టేందుకు ఏ పరిస్థితులలో నయినాసరే కత్తి దూయడం సమర్థనీయమనే అతని మతం.

గడీకి కొడుకులను వెంటబెట్టుకుని వెళ్ళి "యెటువంటి వాళ్ళని తీసుకు వచ్చానో చూడండి!" అని కొడుకుల నెలా చూపించేదీ, యుద్ధాలలో ఆరితేరిన తన సహచరులకు వారినెలా పరిచయం చేసేదీ, యుద్ధ తంత్రంలో ప్రథమంగా కొడుకులు చూపే నేర్పును, తాగి ఆడే తందనాలను తానెలా తిలకించేదీ ముందుగానే ఊహించుకుని సంబరపడసాగాడు బుల్బా. మొదటయితే వారిని ఒంటరిగా పంపుదామనుకున్నాడుగాని, వారిలోని కొంగ్రొత్తదనం, ఒడ్డూ పొడుగూ, మగసిరీ చూసేసరికి అతనిలో వీరావేశం రగులుకొన్నది. ఇంకేం వారితోకూడా వెళ్ళాలనే నిర్ణయానికి వచ్చాడు. ఆజ్ఞలు జారీచేయడంలో, కొడుకులకు గుర్రాలు జీనులు మొదలయినవి ఏరడంలో, అశ్వశాలకు, గిడ్డంగికి తిరగడంలో, మరునాడుకూడా తీసుకు వెళ్ళడానికి సేవకులను నిర్ణయించడంలో బుల్బా నిమగ్నుడయినాడు. తన అధికారాన్ని కాప్టెన్ టోవకాచ్‌కి అప్పగించి, కబురు పెట్టిన తక్షణం సేనలను గడీకి నడపించవలసిందిగా గట్టి ఆదేశాలిచ్చాడు. కైపు బాగా నెత్తికి ఎక్కినా ఏ ఒక్క విషయం బుల్బా మరిచేపోలేదు. గుర్రాలకు నీళ్లుపెట్టి గాడిలో గోధుమలు పోయమనికూడా ఆజ్ఞాపించాడు. ఈ పనులన్నీ పూర్తి చేసుకుని తిరిగి వచ్చేసరికి బాగా అలసిపోయాడు. కొడుకుల నుద్దేశించి, "ఊం- యిక నిద్రపోదాం. రేపు భగవంతుని యిచ్ఛ

ననుసరించి నడుచుకుందాం. ముసిల్దానా! పక్కలు గిక్కలు అక్కర్లేదులే, ఆరుబయట పడుకుంటాం" అన్నాడు.

అప్పుడే చీకటిపడింది. పెందలాడే పడుకోవడం బుల్బాకి అలవాటు. రగ్గుమీద పడుకుని పొడుగాటి గొఱ్ఱెచర్మం కోటు కప్పుకున్నాడు, గాలి చెమ్మగా ఉంది. అదీగాక అతనికి ఇంటి దగ్గర వెచ్చగా పడుకోవడం మహా ఇష్టం. కొంచెం సేపటికి గురక మొదలుపెట్టాడు. పెరడులో పడుకున్నవారుకూడా గురక ఆరంభించారు. నలుమూలలనుంచి రకరకాల గురకలు విన వచ్చాయి. ఇంటి యజమాని కొడుకులరాక సందర్భంలో జరి గిన వేడుకలలో తప్పతాగిన కాపలా మనిషి అందరికంటె ముందు నిద్రపోయాడు.

పాపం! ఆ యువకుల తల్లికిమాత్రం నిద్రపట్టలేదు. ఒకిరి పక్కన ఒకరు పడుకున్న కొడుకుల తలలమీదికి వంగి చిక్కు పడ్డ వారిఉంగరాలజుట్టు సవరించింది ఆమె కన్నీటితో వారి జుట్టు తడిసిపోయింది· మనసునంతా కళ్ళల్లోకి తెచ్చుకుని, సకలేంద్రియాలతో, ఉహుం - శరీరమంతా వేయికళ్ళు చేసుకుని కొడుకులవంక తేరిపార జూసింది. కాని తనివితీరలేదు. వారికి పాలిచ్చి పెంచింది. పెద్దవాళ్ళను చేసింది. ఇంకెంతసేపు, ఒక్క క్షణమే తను వాళ్ళను చూడగలిగేది! 'మీగతి యేమవుతుందో! యేంరాసిపెట్టుందో!' అని మూలిగింది. ఆమె మొహంలోని ముడతలలో కన్నీళ్ళు కదలాడాయి. నిజం! ఆ రోజులలోని స్త్రీ లందరిలాగానే ఆమెకూడా నరకం అనుభవిస్తోంది. యవ్వనంలో, కొత్తగా కోరికలు చిగిరించే దశలో కొద్దికాలంపాటు మాత్రమే భర్త ప్రేమను చూరగొన్నది. తరవాత ఆ కఠిన హృదయుడు (బుల్బా) సావాసాలు, తాగుడు, యుద్ధాలలో పడి ఆమె

మొహం చూడడమే మానేసాడు. సంవత్సరానికి ఏ రెండు మూడు రోజులో ఆమెకు దర్శన మిచ్చేవాడు. ఒకొక్కపుడు సంవత్సరాలు గడిచినా అతని ఆచూకీ తెలిసేదిగాదు. ఖర్మం చాలక ఇంటికివచ్చి కలిసిఉన్న నాలుగురోజులూ ఎంతటి నరకం అనుభవించేదనీ! అవమానాలు, దెబ్బలు! ఎపుడయినా కాస్త ప్రేమ చూపాడంటే దయాధర్మ బిచ్చం! అక్కడ ఉన్న యోధులంతా అవివాహితులు. స్వతంత్ర జపోరొజియో వారి జీవితాలను భయంకరంగా మార్చివేసింది. అటువంటివారి మధ్య ఆమె విచిత్రమయిన జీవితం గడుపుతోంది. సుఖపడకుండానే యవ్వనం గడిచిపోయింది. నవనవలాడుతూ ఎంతో అందంగా ఆమె చెంపలు, వక్షస్థలం వికాసం కోలుపోయి, వాడిపోయాయి. అకాలంలోనే ముడతలుపడ్డాయి. ఆమె ప్రేమ, ఆమె భావాలు, ఒకటేమిటి స్త్రీలలో సహజంగా ఉండే సుకుమారమయిన,ఉద్రేక పూరితమయిన సర్వమూ కరుడుగట్టి ఒకేఒక భావంగా - మాతృప్రేమగా మారిపోయాయి. మైదానపు కాకిలాగా ఎంతో ఉద్రేకంతో, ఎంతో బాధతో సంతానాన్ని కాచుకుని కూర్చుంది. ఆమె కొడుకులు, ఆమె ముద్దుబిడ్డలు ఆమెనుంచి విడదీయబడుతున్నారు. తిరిగి చూసుకుంటుందో లేదో, ఎవరు చెప్పగలరు ? మొదటి యుద్ధంలోనే ఏ తాతారువాడో వాళ్ళ తలలు నరికివేస్తాడేమో ? శవాలనన్నా కంటితో చూసుకునే ప్రాప్తి ఉందో లేదో ? పక్షులు ఆ శవాలను పీక్కుతుంటా యేమో ? వారికోసం తన సర్వస్వమూ అర్పించడానికి సిద్ధంగా ఉంది. నిట్టూరుస్తూ వారి కళ్ళల్లోకి తేరిపార జూసింది. సర్వశక్తి సంపన్న అయిన నిద్రాదేవత వారి . నావహించింది. కనులు మూతలు పడ్డాయి. అలా తేరిపార జూసి అనుకుంది: "నిద్రమేలు

కున్న తరవాత బుల్బాయేగనక యింకో రెండురోజులపాటు ఆగి మరీ వెడదామంటే యెంత బావుండును! కైపు యెక్కువయి మర్నాడే బయలుదేరదామని నిశ్చయించుకున్నాడేమో!"

రాత్రి బాగా పొద్దుపోయింది. పెరడు పెరడుచుట్టూ ఉన్న కంచెను ముంచివేస్తున్న చెట్లగుంపు, పొడుగాటి కలుపు మొక్కలు వెన్నెలలో ప్రకాశిస్తున్నాయి. కొడుకులమీదనుంచి ఒక్క క్షణమయినా చూపు మరల్చకుండా, నిద్రపోవాలనే ధ్యాసయినా లేకుండా వారి తలలదగ్గర కూర్చుంది. తెల్లవారబోతోందని పసికట్టి గుర్రాలు నమలడం మానివేసి గడ్డిమీద పడుకున్నాయి. చెట్ల చిటారుకొమ్మలమీది ఆకులు గుసగుస ధ్వని చేయసాగాయి. క్రమేపీ ఆధ్వని కిందికొమ్మలకుకూడా పాకింది. ఆమె తెల్లవారేవరకూ అలానే కూర్చుంది. కాస్తయినా అలసిపోలేదు. తెల్లవారకుండా రాత్రిరాత్రిగానే ఉండిపోతే బాగుండునని కోరుకోసాగింది. మైదానంలోనుంచి రింగుమని గుర్రపుపిల్ల సకిలింపు వినిపించింది. ఆకాశంలో అరుణ రేఖలు తళుక్కుమన్నాయి.

బుల్బా హఠాత్తుగా మేలుకొని దిగ్గున లేచాడు. కిందటి రాత్రి తానిచ్చిన ఆజ్ఞలన్నీ అతనికి బాగా జ్ఞాపకం ఉన్నాయి. "కావలసినంత నిద్రపోయారు. యికలెండి. బయల్దేరే వేళయింది. గుర్రాలకు నీళ్లు పెట్టండి. ముసిలిది యెక్కడ చచ్చింది?" భార్యని ముసిలిది అనిఅనడం అతనికి అలవాటు. "ముసల్దానా! ఊఁ– తొందరతొందరగా యింత కూడుపెట్టు. చాలాదూరం వెళ్ళాల్సి వుంది."

పాపం! ఆ ముసలావిడకి ఆశాలేశంకూడా అంతరించిపోయింది. ఉసూరోమంటూ ఇంటిలోకి శరీరాన్ని జేరవేసింది. కన్నీళ్లు

పెట్టుకుంటూ ఆమె తిండి తయారు చేస్తూంటే బుల్బా అందరినీ ఆజ్ఞాపిస్తూ, అశ్వశాలలో హడావిడిగా తిరుగుతూ, కొడుకులకు మాంచి జీను మొదలయినవి స్వయంగా ఎంచి ఏర్పాటుచేసాడు. ఆ కాలేజీ కుర్రాళ్లు క్షణంలో ఎంతగానో మారిపోయారు. దుమ్ము కొట్టుకున్న ఎత్తుబూట్లకు బదులు మడమలచుట్టూ వెండి పూత పూసిన మొరాకోబూట్లు తొడిగారు. లాగూల బొందులు బంగారపవి. వేలకివేల ముడతలతో లాగూలు మహా వదులుగా ఉన్నాయి. బొందులనుంచి పైపుకట్టిన కుచ్చులతోలువారు వేలాడుతోంది. నడుముకు నిప్పురంగు కాసికోక బిగించి కట్టారు. నగిషీ చెక్కిన పిస్తోళ్ళు కాసికోకలో దోపారు. పటా కత్తులు వారి మడమలు కొట్టుకుని ఖణేలు మంటున్నాయి. ఇంకా ఎండ కన్నెరగని వారిమొహాలు ముద్దొస్తున్నాయి. నూత్న యవ్వనపు నల్ల మీసాలు వారి శరీరపు తెల్లదనాన్ని కొట్టవస్తున్నట్టున్నాయి. వారు ఆరోగ్యంగా, పుష్టిగా ఉన్నారు. శరీరాలు మిసమిసలాడు తున్నాయి. జలతారు కుట్టిన గొర్రెచర్మపు టోపీలు పెట్టుకుని చూడముచ్చటగా ఉన్నారు. పాపం! వారితల్లి, ఇలా అలంక రించుకున్న తనయులను చూసి నోరు మెదపలేకపోయింది. కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగాయి.

"అంతా సిద్ధమయింది. కాలం వృథాచేయకండి" అన్నాడు బుల్బాకొడుకుల నుద్దేశించి.

"మన ఆచారంప్రకారం యెక్కడికయినా బయల్దేరే ముందు అంతా కలిసి కూచోవాలి."

అంతాకూర్చున్నారు. సేవకులు మాత్రం మర్యాదకోసం ద్వారంలో నిలబడ్డారు.

"అబ్బాయిలని ఆశీర్వదించు" అన్నాడు బుల్బా భార్యతో. "వీళ్ళు ధైర్య స్థయిరాలతో పోరాడుతూ, గౌరవం నిలబెట్టు కుంటూ, క్రీస్తుమత రక్షణకు సర్వదా పూనుకునేటట్టు చేయ మని దేవుని ప్రార్థించు. అలా ఆచరించకపోతే నామరూపము లేకుండా నాశనమయిపోతారుగాక! మీ అమ్మ దగ్గిరికి వెళ్ళండి. తల్లి ఆశీర్వచనం సంతానాన్ని యెక్కడ వున్నా రక్షిస్తుంది."

అందరి తల్లులలాగానే ఆమె జాలిగుండెగల తల్లి. కొడు కులను కావలించుకుని నిట్టూరుస్తూ వారి మెడలలో చిన్న చిన్న దేవతా విగ్రహాలు కట్టింది.

"మాత...రక్షించుగాక!...మీ అమ్మని మర్చిపోకండి... మీ క్షేమసమాచారాలు తెలియజేస్తూండండేం." ఆపైన మాట పెగలలేదు.

"సరే. ఊఁ- యిక బయలుదేరుదాం" అన్నాడు బుల్బా.

ద్వారంలో గుర్రాలు తయారుగా నుంచున్నాయి. తారాస్ స్థూలకాయుడు. ఎగిరి గుర్రంమీద కూర్చునేసరికి ఆ బరువుకు అది అదిరిపోయి పక్కకు తూలింది.

కొడుకులుకూడా గుర్రాలు ఎక్కగానే తల్లి చిన్న కొడుకు దగ్గరకు పరుగెత్తుకు వెళ్ళి రికాబు గట్టిగా పట్టుకుని, జీనును వాటేసుకుని వదలలేదు. నిరాశ ఆమె నేత్రా లలో కానవచ్చింది. ఇద్దరు బలిష్టులయిన కోసక్‌లు ఆమెను మెల్లగా లేవదేసి ఇంటిలోకి తీసుకుపోయారు. కాని గుర్రాలు గేటు దాటగానే ముసలిదయినా అడవి మేకలా రివ్వున వాటి వెనకాలే పరుగెత్తుకుంటూ వెళ్ళి దెయ్యపుబలంతో గుర్రాన్ని ఆపి, ఆపుకోలేని పిచ్చి ఉద్రేకంలో కొడుకును కావలించుకుంది.

తిరిగీ ఆమెను ఇంటిలోకి తీసుకువెళ్ళారు. ఆ కోసక్ యువకులు తండ్రిభయంతో కన్నీళ్ళు గుడ్లల్లో కుక్కుకుంటూ బరువెక్కిన మనసులతో సాగిపోయారు. తండ్రి మనసుకూడా కరిగింది. కాని బయటికిమాత్రం పొక్కనీయలేదు. చలి అమితంగా ఉంది. ఆ మైదానపుపచ్చిక తళతళా మెరిసిపోతోంది. పక్షులు విభిన్న శృతులలో కూస్తున్నాయి. ఆ యువకులు వెనకకు తిరిగి చూసారు. వారి గుడిసె భూమిలోకి దిగబడిపోయినట్లు కనిపించింది. ఇంటి పొగగొట్టాలు, చిన్నతనంలో ఉడతలలాగా వారెక్కిన చెట్ల తలలుతప్పితే నేలమీద వారికేమీ గోచరించలేదు. దూరాన పొలం మాత్రం కనిపించింది. ఆ పొలం కంటబడేసరికి వెనకటి జీవితమంతా వారికి జ్ఞాపకం వచ్చింది. ఆ పొలంలో మంచుతో నిండిన గడ్డిమీద చిన్నతనంలో దొర్లారు. ప్రియురాలికోసం నిరీక్షించారు. ఇపుడు అక్కడ నూతిమీది గిలక దుంగ ఆకాశంలో అచ్చుగుద్దినట్టుగా ఉంది. ఏదీ కంటబడకుండా అడ్డగించే కొండలా వారి వెనక మైదానం!

బాల్యమా శెలవు! ఆటలపాటలకి శెలవు! అన్నిటికీ, అందరికీ శెలవు!

## 2

ఆ ముగ్గురు రౌతులూ మాట్లాడకుండా సాగిపోసాగారు. ముసలి తారాస్ ఎన్నడో గడిచిపోయిన రోజులను గురించి ఆలోచించ నారంభించాడు. అతని యవ్వనకాలం కనులముందు తారాడజొచ్చింది. ప్రతి కోసక్ తన యవ్వనాన్ని తలుచుకుని విలపిస్తూంటాడు. జీవితమంతా యవ్వనమయం కావాలని కాంక్షిస్తాడు. తనతో కలిసి యుద్ధాలలో పాల్గొన్న పాత స్నేహితులు గడీలో ఎవరెవరు కనిపిస్తారో అని అబ్బుర పడసాగాడు. వారిలో ఎవరెవరు చనిపోయారో, ఎవరెవరు ఇంకా బ్రతికి ఉన్నారో ఊహించసాగాడు. ఒక కన్నీటిచుక్క అతని చూపును అడ్డగించింది. నెరసిన తల దీనంగా కిందకు వంగింది.

అతని కొడుకులు ఇంకేవేవో విషయాలు ఆలోచిస్తున్నారు. ముందుగా వారినిగురించి కొంత తెలుసుకుందాం. పన్నెండవ ఏట చదువు నిమిత్తంవారిని కీవ్ విద్యాలయానికి పంపారు. ఆ రోజులలో పెద్ద కుటుంబాలవారు కొడుకులను విద్యావంతులను చేయడం తమవిధిగా భావించుకునేవారు. చదివినది తరవాత మరిచిపోయినా సరేఅని తలచేవారు. ఆ అన్నదమ్ములిద్దరూ అరాచకంగా పెరగడంవల్ల అందరు విద్యార్థుల లాగానే అల్లరి చిల్లరగా ప్రవర్తించారు. కాని కీవ్‌లో చదువుతూ ఒకవిధమయిన 'టీకు' అలవర్చుకున్నారు. వారిలో పెద్ద

వాడిపేరు ఒస్టాప్. మొదటి పడాదిలోనే కీవ్‌నుంచి పారిపోవడా నికి బోణీ చేసాడు. కాని తిరిగి లాక్కొచ్చి కొరడాతో నిర్దాక్షి ణ్యంగా చావగొట్టి మళ్ళీ చదువులోకి దింపారు. నాలుగుసారులు పుస్తకాలు భూమిలో పాతిపెట్టాడు. నాలుగుసార్లూ చితకదన్ని పుస్తకాలు మళ్ళీ కొనిపెట్టారు. అయిదవసారికూడా పుస్తకాలు పాతిపెట్టేవాడేగాని తండ్రి సకల శాస్త్రాలు పూర్తిచేయకపోతే సన్యాసుల మఠంలో ఇరవయి సంవత్సరాలపాటు అట్టేపెట్టేస్తా ననీ, ఇక జవరోజీయేలో అడుగు పెట్టడానికి వీలులేదనీ బెదిరిం చడం మూలంగా ఆగిపోయాడు. అలా బెదిరించిన బుల్బాయే నేడు కాలేజీ విద్యను తిట్టిపోసి, దానిసంగతే పట్టించుకోవద్దని కొడుకులకు హితబోధ చేయడం వింతగానే ఉంటుంది! ఆనాటి నుంచీ ఒస్టాప్ అతి శ్రద్ధగా చదివి తోటివిద్యార్థులను అందు కున్నాడు.

ఆ రోజులలో చదువుకీ, నిత్యజీవితానికీ ఎక్కడా సంబంధం ఉండేదికాదు. పాండిత్యం, వ్యాకరణం, ఛందస్సు, తర్కం చదివించేవారు. కాని అవి ఆ కాలానికి సరిపోయిన విద్యలూగావు, నిత్యజీవితంలో ఉపయోగించేవీ గావు. విద్యా ర్థులు తామార్జించిన విజ్ఞానం, పాండిత్యం దేనికీ వినియోగించ లేకపోయేవారు. అధ్యాపకులూ అంతే. ఆచరణకీ వారికీ సగ మెరుక! వారివల్ల ఏ ప్రయోజనమూ ఈడేరేది కాదు. అయినా ఆ విద్యాలయ ప్రజాస్వామ్య వ్యవస్థ, హుషారయిన విద్యార్థి సమూహం వారు విద్యాలయం బయట ఎంతో కార్యకలాపం జరపడానికి దారితీసింది. నిరాదరణ, తరుచు శిక్షగా కడుపు మాడ్చడం మాంచి బలిష్టులయిన బాలురలో రేగే ఉద్రేకం - ఇవన్నీ కలిసి వారిలో సాహసాన్ని మొలకెత్తించాయి. ఈ సాహ

సమే జపరోజియేలో పెంపొందింది. కీవ్ వీధులలో ఆహారం కోసరం సంచరించే విద్యార్థులు పౌరులకు ఒక పీడగా పరిణమిం చారు. ఎవరయినా విద్యార్థి దోవన పోతూంటే బజారు వర్త కులు రాబందు పిల్లలను దగ్గరగా పొదివికొన్నట్లు తాము అమ్మే బజ్జీలు, జీడిపప్పు మొదలయిన సరుకులు చేతులతో మూసి పెట్టే వారు. విద్యార్థులను కనిపెట్టి చూడవలసిన 'మానేటరు' లాగూ జేబులు దుకాణంలోఉన్న సరుకంతా పట్టేటంత పెద్దవిగా ఉండేవి! ఇక చేసేదేముంది ?

కాలేజీ విద్యార్థులది అదొక వేరే ప్రపంచం. రష్యన్ పోలిష్ జమీందారులతో గూడిన ఘరానాలోకంలోకి వారికి ప్రవేశం లభ్యమయ్యేదిగాదు. కీవ్ విద్యాలయ పోషకులలో ఒకరయిన ఆడంకిసెల్ వీరిని నలుగు?లో తిరగనీయకుండా కట్టుదిట్టంగా ఉంచమని ఆదేశించాడు. నిజానికి ఈ ఆదేశం అవసరమయిందే. ఆ విద్యాలయ ప్రధానాధ్యాపకుడు, అధ్యాప కులు బెత్తాలతో, కొరడాలతో వీరిపని పట్టిస్తూనే ఉండేవారు. అధ్యాపకుల ఆదేశం ప్రకారం బంట్రోతులు వీరిని కొరడాలతో విపరీతంగా కొట్టేవారు. వారాలు గడిచినా విద్యార్థులకు ఆ దెబ్బలు మరుపుకు వచ్చేవికావు. కాని అందులో చాలామంది ఈ దెబ్బలను లక్ష్యపెట్టేవారేకాదు. ఘాటయిన వోడ్కా తాగి నట్టుండేది. తక్కినవాళ్ళు దెబ్బలు తినీ తినీ విసిగెత్తిపోయి, దారిలో పట్టుబడకపోతే, జపరోజియేకి పారిపోయేవారు.

ఒస్టాప్ బుల్బా అతిశ్రద్ధగా తర్కశాస్త్రం, మతవిజ్ఞాన శాస్త్రం అభ్యసించినా కొరడాదెబ్బల రాతమాత్రం తప్పలేదు. అందువల్ల సహజంగానే అతనిశీలం రాటుతేరింది. మొండితనం అలవడింది. ఈ మొండితనమే కోసక్ల విశిష్టత. ఒస్టాప్ మంచి

మిత్రుడని పేరు పొందాడు. తోటలు మొదలయినవాటిమీద దాడికి అతను సకుర్తుగా నాయకత్వం వహించేవాడు. కాని మిత్రుల సాహసకృత్యాలలో పాల్గొనడానికి మాత్రం ఎన్నడూ వెనుదీసేవాడుగాదు. మిత్రులకు ఎన్నడూ ద్రోహం తలపెట్టి ఎరగడు. బెత్తాలు, కొరడాలు అతనిచేత మిత్రద్రోహం చేయించ లేకపోయాయి. పోరాటం, తాగి తందనాలాడడం మినహా ఇంకే ప్రలోభమన్నా మొహం చిట్లించుకునేవాడు. మరే విషయంగురించి ఆలోచించేవాడుగాదు. సమానులతో కల్లా కపటం లేకుండా మెలిగేవాడు. దయాపరుడు. తల్లి కంటతడి బెట్టుకుంటేచాలు కరిగిపోయేవాడు. అందుకనే ఇపుడు విచారంలో మునిగి, తలవంచుకుని ఆలోచిస్తున్నాడు.

ఇక అతని తమ్ముడు ఆంద్రీ భావాలు కొంతవరకు రసవత్తరమయినవి, పరిపక్వమయినవి. మనస్ఫూర్తిగా, మొండిఘటాలకులాగా పెద్ద ప్రయత్నం అక్కరలేకుండానే విద్య అభ్యసించాడు. అన్నకంటె ఎక్కువ కల్పనాశక్తి గలవాడు. అపాయకరమయిన సాహసకృత్యాలకు తరచు నాయకత్వం వహించేవాడు. చమత్కారంగా మాట్లాడి బడితపూజ తప్పించుకునేవాడు. కాని అతని అన్న ఒస్టాప్‌కు యుక్తిగా తప్పించుకోవడమంటే అసహ్యం. దయతలచమని వేడుకుందామనే ఆలోచనే లేకుండా కోటువిప్పి, 'ఊఁ- కొట్టుకో' అన్నట్లు నేలమీద పడుకునేవాడు. ఆంద్రీకూడా సాహసకృత్యాలు చేయాలని తహతహలాడిపోయేవాడు. కాని అతని హృదయంలో ఇతర భావాలు కూడా మెసలుతూండేవి. పద్ధెనిమిదో ఏడు దాటిందోలేదో అతనిలో ప్రేమాగ్ని రగులుకుంది. స్వప్నాలలో స్త్రీమూర్తి గోచరించసాగింది. తత్త్వశాస్త్ర చర్చలు వింటున్నా ఆ స్త్రీ

మూర్తే, మాంచి యవ్వనంలో ఉన్న ఆ స్త్రీమూర్తే, నీలాల కళ్ళ ఆ సౌమ్యమూర్తే ప్రత్యక్షమయేది. దోబూచులాడే ఆమె వక్షోజాలు, రమణీయమయిన హస్తాలు అతని కళ్ళముందు తారాడేవి. ఆకన్య అవయవాలను అంటిపెట్టుకున్న గౌను సహితం స్వప్నాలలో చెప్పరానంత కామోద్రేకం కలిగించేది. యుద్ధాలలో పాల్గొనకపూర్వం యువతులను గురించీ, ప్రేమను గురించీ ఆలోచించడం సిగ్గుచేటనీ, అగౌరవమనీ కోసక్ యువకులు భావించేవారు. అందువల్ల ఆంద్రీ తన హృదయంలో మరిగే ఈ భావాలను స్నేహితులు పసిగట్టకుండా జాగ్రతగా మరుగు పరిచాడు. కీవ్ విద్యాలయంలో చదువు పూర్తిగాకముందు కొన్ని సంవత్సరాలపాటు ఆంద్రీ ఎన్నడోగాని సాహసకృత్యాలకు నాయకత్వం వహించలేదు. కీవ్ పట్టణంలోని మారుమూల పేటలలో తరుచు ఒంటరిగా తిరుగుతూండేవాడు. అక్కడ రేగి తోటలలో కిందుగా ఉండేఇళ్ళు వీధిలోకి కనిపించీ కనిపించకుండా ఆకర్షణీయంగా ఉండేవి. పాత కీవ్ పట్టణంలో కులీనులు నివసిస్తుండేవారు. వారిఇళ్ళు ఇంకా ఎక్కువ మనోహరంగా ఉండేవి. ఆ పేటలో కూడా ధైర్యంచేసి ఆంద్రీ తిరగజొచ్చాడు.

ఒకమాటు, ఆ పేటలో నిలబడి నివ్వెరబోయి చూస్తుండగా ఒక జమీందారు బగ్గీ ఆంద్రీమీదుగా పోయేదయింది. బగ్గీతోలే బొర్రమీసాల మనిషి కొరడాతో ఆంద్రీ మొహంమీద ఒకటి పుచ్చుకున్నాడు. మన కాలేజీ కుర్రవాడికి వెర్రికోపం వచ్చింది. ముందూవెనకా ఆలోచించకుండా తెగించి బగ్గీ వెనక చక్రం గట్టిగా ఒడిసి పట్టుకుని ఆపేసాడు. ఆంద్రీ పగతీర్చుకుంటాడని భయపడి బగ్గీవాడు కొరడాతో గుర్రాలను అదిలిం

చాడు. అవి స్వారీ లంకించుకున్నాయి. ఆంద్రీ సమయానికి చేయి వెనకకు తీసుకున్నా బోర్లా బొక్కలా పడిపోయాడు. పైనుంచి కిలకిలమని నవ్వు మృదుమధురంగా వినిపించింది. తల పైకెత్తి చూసాడు. కిటికీదగ్గర అతను అంతకుపూర్వం ఎన్నడూ చూడనంత అందగత్తె నిలబడిఉంది. నీలాల కళ్ళు. అరుణోదయ కాలంలోని మంచులాంటి శరీర చ్ఛాయ. కడుపుబ్బా నవ్వు తోంది.ఆనవ్వు ఆమె సౌందర్యాన్ని ఇనుమడింప జేసింది. నిర్ఘాంత పోయి నిలబడ్డాడు...మొహంమీద బురద తుడుచుకున్నాడు. తుడుచుకున్న కొద్దీ మొహం మరింత వికారమయింది. కంగారు పడి ఆమెవంక తేరిపార జూసాడు. ఎవరా అందాలరాశి? గేటులో ఎవడో తంబూరా వాయిస్తున్నాడు. అతనిచుట్టూ ఆ ఇంటి సేవకులు మూగారు. వారిదగ్గరనుంచి ఆ యువతి ఆనుపా నులు లాగాలని ఆంద్రీ యత్నించాడు. అతని మురికి మొహం చూసి వాళ్ళునవ్వి సమాధాన మీయకుండా ఊరుకున్నారు. ఎలాగయితేనేం ఆమె కోవ్నో పట్టణాధికారి (వేవోడ్) కూతు రని తెలుసుకున్నాడు.

ఆనాటి రాత్రి,సాహసించి కోరడిలోనుంచిదూరి తోటలోనికి చేరుకున్నాడు ఆతోటలోని ఒకచెట్టు కొమ్మలు ఇంటిపై కప్పు మీదికి వ్యాపించి ఉన్నాయి. ఆ చెట్టు ఎక్కి కొమ్మలమీదుగా ఇంటి పైకప్పుమీదకు దిగాడు. పొగగొట్టంలోనుంచి ఆ అందాల రాశి పడకగదిలోకి దూకాడు. సరిగ్గా ఆ సమయానికి ఆమె కొవ్వువత్తి దీపంముందు కూర్చుని అతి విలువయిన చెవికమ్మలు తీసివేసుకుంటోంది. హఠాత్తుగా అపరిచిత వ్యక్తి కనిపించేసరికి భయపడిపోయింది. మాట పెగలలేదు. ఆంద్రీ తలవంచుకుని గంగిగోవులాగ నిలబడ్డాడు. పైగా అందగాడు. అతనివల్ల

హానేమీ సంభవించదని ఆమె గ్రహించింది. ఇంతలో అతను తన కళ్ళముందు వీధిబురదలో పడ్డ యువకుడని గుర్తుకువచ్చి మళ్ళీ పిచ్చిగా నవ్వసాగింది. అంతేగాదు, ఆంద్రీ వాలకంచూస్తే భయ పడవలసిన అగత్యం కనిపించలేదు. అందుకని కడుపుబ్బా నవ్వుతూ చాలాసేపు ఆనందించింది. ఆనాటి పోలిష్ యువతు లందరిలాగానే ఆమెకూడా గయ్యాళి. కాని ఆమె నేత్రాలు దివ్యమయినవి, నిర్మలమయినవి. చురుక్కున గుచ్చుకునే చూపులో ఎక్కడా చాంచల్యం గోచరించదు. ఆ విద్యార్థి కొయ్యబొమ్మలా నిలబడ్డాడు. ఆమె చప్పున అతనిదగ్గరకుచేరి తళతళ లాడే మకుటం తలమీద పెట్టింది. చెవిపోగులు అతని పెదవులకు వేలాడగట్టింది. బంగారపు జాలరు కట్టిన సన్నటి మల్లుగౌను తొడిగింది. ఈ విధంగా అలంకరించి చిన్నపిల్లలాగా కొంటె చేష్టలు చేస్తూ అతనిని అనేకవిధాల వేళాకోళం పట్టించింది, దీంతో ఆంద్రీ మరీ కంగారుపడిపోయాడు. తళతళా మెరిసే ఆమె కళ్ళల్లోకి। నోరు తెరచుకుని చూసాడు. అతని విగ్రహం హాస్యాస్పదంగా తయారయింది. ఇంతలో ఎవరో తలుపు కొట్టారు. ఆమె ఉలికిపడి అతనిని మంచంకింద దాచివేసింది. అంతా చక్క బడ్డతరవాత దాసీని పిలిచి అతనిని మెల్లగా తోటలోకి తీసుకు వెళ్ళి కోరడిని దాటించమని ఆజ్ఞాపించింది. దురదృష్టం! కోరడి దాటుతూంటే కాపలామనిషి మేలుకొని కాళ్ళమీద చాచి ఒక్కటి కొట్టాడు. తక్కిన సేవకులు పరుగెత్తుకుంటూ వచ్చి చావమోదారు. ఎలాగయితేనేం పిక్కబలం చూపి పట్టుబడకుండా తప్పించుకున్నాడు. ఆ నాటినుంచీ ఆ ఇంటిముందుగా వెళ్ళడం ప్రమాదకరంగా పరిణమించింది. ఒకమాటు ఆమె రోమన్ కాథలిక్ చర్చిలో కనిపించి చిరకాల పరిచయస్తుని చూసినవ్వి

నట్టే అతనికేసి చూసి చిరునవ్వు నవ్వింది. ఆ చిరునవ్వు ఎంత ఆకర్షణీయంగా ఉందనీ! ఇంకొకమాటు ఆమెఅతనిముందు మెరుపులా మెరిసి మాయమయింది. అంతే. తరవాత కోవ్నో పట్టణాధికారి అక్కడనుంచి వెళ్ళిపోయాడు. ఆ అందగత్తె బదులు ఆ కిటికీ దగ్గర బోండాంలాంటి ఇంకో వికారరూపం కనిపించసాగింది.

ఈ విషయాలే ఆంద్రీ ఇపుడు తలవంచుకుని, గుర్రపు జీనుమీద దృష్టి నిలిపి ఆలోచిస్తున్నాడు.

ఇంతలో వారు ఆ పచ్చని మైదానం లోతట్టుకు చొచ్చుకుపోయారు. ఎత్తుగా ఎదిగిన గడ్డి వారిని చుట్టుముట్టి కంటికి కనపడకుండా కప్పేసింది. వారి నల్లటి కోసక్ టోపీలు మాత్రం గడ్డిపైనుంచి కనిపిస్తున్నాయి.

"హే! యేవిఁటి? మందకొడిగా వుందేం వ్యవహారం?" అంటూ తన ఆలోచనలోనుంచి మేలుకొని బుల్బా హెచ్చరించాడు. "బైరాగుల్లాగా అలా వుసూరుమంటున్నారేం? ఆలోచనలన్నిటినీ తెగలేసి పైపులు వెలిగించండి. గుర్రాలను అదిలించి ఆఘాల మీఘాలమీద పోదాం."

ఆ కోసక్‌లు గుర్రాలుమీదికి వంగి పచ్చికలో అదృశ్యమయారు. వారి నల్లటి టోపీలుకూడా కనిపించడంలేదు. గుర్రాల కాళ్ళకిందపడి నలిగిపోయిన గడ్డిచారమాత్రం వారు వేగంగా స్వారీ చేస్తున్నారని సూచిస్తోంది.

నిర్మలాకాశంలో సూర్యుడు అపుడే పైకెక్కి ఆ పచ్చిక మైదానంమీద వెచ్చడి వెలుగును ప్రసరించాడు. ఆ కోసక్‌ల హృదయాలలో మసక మసకగా, కలలు కలలుగా తారాడు

తున్న ఆలోచనలన్నీ మటుమాయమయాయి. వారి గుండెలు పక్షులలాగా రెపరెపలాడ సాగాయి.

పోయినకొద్దీ మైదానం మరింత రమణీయంగా ఉంది. ఆనాడు నల్లసముద్రమువరకు దక్షిణ ప్రాంతమంతా, ఇపుడు నొవొరోసియా అని పిలవబడేదంతా, ఒకటే మైదానం! హద్దూ పద్దూలేకుండా పిచ్చిగా పెరిగిన ఆ మైదానం ఎన్నడూ నాగలి మొహం ఎరగదు.

ఎత్తుగా ఎదిగిన గడ్డిని నేలమట్టంచేసి గుర్రాలు మాత్రం మాయమవుతూండేవి. ప్రకృతిలో ఇంతకన్న రమణీయమయినది ఎక్కడా కనిపించదు. భూమండలం లక్షోపలక్షుల పుష్పాలను విరజిమ్ముతున్న ఆకుపచ్చని సముద్రంలాగా ఉంది. సన్నగా ఎత్తుగా పెరిగిన గడ్డిదంటుల మధ్యనుంచి రంగురంగుల గడ్డిపూలు తొంగిచూస్తున్నాయి. పసుపుపచ్చని తంగేడు రెమ్మలు ఎంతో ఎత్తుకు దూసుకుపోయాయి. ఛత్రాకారపు తెల్లదవనంగుత్తులు దోవవెంట చుక్కలు చుక్కలుగా బారులు తీరాయి. ఎక్కడ నుంచి వచ్చిపడిందో గోధుమకంకె పొదలో పంటకు సిద్ధంగా ఉంది. సన్నటి దంటులమధ్యలో కౌజుపిట్టలు మెడలు సాచి ముక్కులతో నేలను పొడుస్తూ తిరుగుతున్నాయి. వేలకువేల పక్షుల కూజితాలతో నింగినిండిపోయింది. ఆకాశంలో డేగలు రెక్కలు విప్పుకుని నేలమీది గడ్డికేసే దృష్టి సారిస్తూ వేలాడు తున్నాయి. ఎక్కడో దూరాన ఏదో సరస్సుమీది అడవి బాతుల గుంపు చేసే రొద మారుమోగుతోంది. గడ్డిలోనుంచి ఒక కాకి టపీమని లేచి నీలివాయు తరంగాలలో విలాసంగా స్నాన మాడింది. అదిగో, ఎగిరిఎగిరి ఆకాశంలో మాయమయి చిన్ని చుక్కలా గోచరిస్తోంది. ఒక్కక్షణం పక్కకు తిరిగి ఎండలో

ధగధగ మంటుంది, ఓ పచ్చిక మైదానమా! ఎంత రమణీయంగా ఉన్నావు!

మన ప్రయాణీకులు మధ్యాహ్న భోజనాల నిమిత్తం కొద్ది నిమిషాలు మాత్రమే ఆగారు. వారిని అనుసరించి వచ్చిన కోసక్‌లు పదిమందీ గుర్రాలుదిగి, వోడ్కా గొట్టాలు, ఆనప బుర్రలు కిందికి దించారు. వారు రొట్టె, గోధుమ బిస్కత్తులు తిని తలోకప్పుడు వోడ్కామాత్రం తాగారు. తారాస్ బుల్బా ప్రయాణం మధ్యలో ఎవరినీ తప్ప తాగనిచ్చేవాడు గాదు. సాయంకాలంవరకూ ప్రయాణం సాగించారు. సాయంత్రం కాగానే మైదానంలో పెద్దమార్పు వచ్చింది. రంగురంగులుగా విస్తరించుకున్న మైదానంమీద సూర్యాస్తమయ కాంతులు ప్రతిఫలించ సాగాయి. క్రమక్రమంగా సందె చీకట్లు మైదానాన్ని కప్పివేసి ముదురు ఆకుపచ్చరంగును పులుముతున్నట్టున్నాయి. గాలి బరువెక్కింది. ప్రతిపూవూ, ప్రతివేరూ సువాసనలు వెలువరించసాగాయి. మైదానం మైదానమంతా సువాసనలు నిశ్వసిస్తున్నట్టుంది. నీలిఆకాశంలో పెద్ద కుంచెతో పూసినట్టు వెడల్పాటి గులాబి - సువర్ణ వర్ణపు చారలు విస్తరించుకున్నాయి. అక్కడక్కడా దూదిపింజల్లాంటి మేఘమాలికలు ధవళ కాంతితో ప్రకాశిస్తున్నాయి. మలయ మారుతం వీచింది. పచ్చిక పైభాగం సముద్ర తరంగాలలాగా ఊగజొచ్చింది. ఆ చల్లగాలి మొహాలకు తగిలి ఎంతో హాయి గొలుపుతోంది. పగలంతా పిక్కటిల్లిన సంగీతం క్రమేపీ సమసిపోయింది. ఇంకోరకమయిన సంగీతం వినవచ్చింది. మచ్చలమచ్చల జాతులు బొరియలలోనుంచి బయటికివచ్చి వెనక కాళ్ళమీద కూర్చుని ఈలలు వేయసాగాయి. ఈలలు మైదానమంతా ప్రతిధ్వనిం

చాయి. మిడతల కిచకిచలు తారాస్థాయికి చేరుకున్నాయి. మధ్యమధ్య ఎక్కడో ఒక సరస్సునుంచి హంసధ్వనులు నలుగడలా వ్యాపించాయి.

మన ప్రయాణీకులు ఆగి రాత్రి మకాం వేయడానికి స్థలం చూసుకుని నిప్పుచేసి, అండా పడేసి వంట చేసుకున్నారు. రాత్రి భోజనానంతరం గుర్రాలకు బందాలు వేసి మైదానం మీదకు వదిలారు దుస్తులు విప్పకుండానే కాళ్ళు చాచుకుని పడుకున్నారు. నక్షత్రాలు మినుకు మినుకు మంటున్నాయి. పచ్చిక నిండాఉన్న కీటకాల అరుపులూ, ఈలలు, కిచకిచలు వారికి జోల పాడుతున్నట్టున్నాయి. నిద్ర మెలుకువవచ్చి లేచి చూస్తే మైదానం నలుమూలలా విస్తరించుకున్న మిణుగురుల తళుకు కనిపిస్తుంది. మైదానంలో, నదీ తీరాలలో తగలబడుతున్న ఎండు కట్టెల మంటలు అక్కడక్కడా ఆకాశాన్ని ప్రకాశింప జేస్తున్నాయి. ఉత్తరాదికి ఎగిరిపోతున్న అంచ బారులమీద గులాబి రంగు పడి నీలాకాశంలో ఎర్రటి జెబురుమాళ్లు ఎగురుతున్నట్టనిపించింది.

ఆ రౌతులు ఏ సాహస కృత్యానికీ తలపడకుండానే ప్రయాణం సాగించారు, మచ్చుకు ఒక్క చెట్టయినా వారికంట పడలేదు. ఎంతదూరం వెళ్ళినా అదే మైదానం! అదే రమణీయత ! నీపర్ నదీ తీరంలో ఎక్కడో ఉన్న అడవి మధ్యమధ్య కానవచ్చింది. ఒకమాటుమాత్రం ఎంతో దూరాన ఒక పొలంలోని నల్లటి మచ్చను చూపిస్తూ బుల్బా, "అటు చూడండి, ఎవడో తాతారువాడు గుర్రంమీద పరుగెత్తుతున్నట్టున్నాడు" అన్నాడు. ఆ మీసాల తాతారు చికిలి కళ్ళతో వారినిచూసి,

పదముగ్గురు కోసక్‌లు కనిపించేసరికి వేటకుక్కలాగా పసికట్టి, లేడిలాగా చప్పున మాయమయాడు.

"హో హో! ఆ తాతారువాడిని తరిమి పట్టుకుంటారా? ఉహుఁ-వద్దు. వాడిగుర్రం నా 'దెయ్యం' (బుల్బా గుర్రంపేరు) కంటె చాలా వడిగా పరుగెత్తుతోంది" అన్నాడు బుల్బా కొడుకులను ఉద్దేశించి, అలాఅని ఊరుకున్నాడా, ఆ తాతార్ హఠాత్తుగా వచ్చి మీద పడతాడేమోనని శంకించి, ఒక ఉపాయం చేశాడు. నీపర్ నదిలోకి ప్రవహించే తాతార్కా అనే చిన్న నదిదగ్గరకు గుర్రాలను ఉరికించాడు. వాటితోసహా నీటిలోకి దూకి ఆచూకీ కప్పిపుచ్చడానికి చాలాదూరం నదిలో ఈదుకుంటూ పోయిపోయి ఎక్కడో అవతలి ఒడ్డు ఎక్కాడు. తిరిగి మొదటి మార్గానికే చేరుకుని యథాప్రకారం ప్రయాణం సాగించాడు.

మూడురోజులకు వారు గమ్యస్థానం చేరుకున్నారు. హఠాత్తుగా గాలి చల్లబడింది. నీపర్ నది సమీపంలోనే ఉన్నట్టు అనిపించింది. ఆ నదిదూరాన ధగధగలాడుతోంది. దిఙ్మండలం నుంచి నల్లటి చార దానిని వేరుచేస్తోంది. చల్లటి కెరటాలు పైకిలేస్తూ సగం నేలను ఆక్రమించుకున్నాయి. ఇక్కడ నీపర్ నది ఉరకలు పెట్టుకుంటూ, సముద్రంలాగా ఘోషిస్తూ నలు దిక్కులా ప్రవహిస్తోంది. మధ్య మధ్య లంకలు ఉండడం మూలంగా నది గట్లమీదనుంచి పొరలిపోతోంది. ఎత్తుపల్లాలు, కొండలు అడ్డంలేకపోవడంవల్ల తరంగాలు స్వేచ్ఛగా నేలను ముంచెత్తేస్తున్నాయి. మన కోసక్‌లు గుర్రాలు దిగి దోనె ఎక్కి మూడుగంటలు ప్రయాణం చేసి ఖోర్టిట్సా దీవి ఒడ్డుకు చేరుకున్నారు. అక్కడ ఉంది గడీ.

ఆ ఒడ్డున జనం గుంపుగా చేరి దోనెవాడితో కొట్లాడు తున్నారు. మన కోసక్‌లు గుఁరపుజీను టంగువారులను బిగించారు. బుల్బా ఠీవిగా నడుంపటకా బిగించి గర్వంగా మీసాలు మెలివేసాడు. ఇత అతని కొడుకులు నఖశిఖపర్వతం ఏదో అస్పష్ట ఆందోళనతో, ఆపేక్షతో నిండిఉన్నట్టు కనిపించారు. తరవాత అంతా గడీకి అరవెర్స్టు దూరంలోని ఒక శివారుకు బయలుదేరి వెళ్లారు. ఆ శివారులో ప్రవేశించగానే కమ్మరి కొలిమిలో సుత్తి దెబ్బలు హోరున వినిపించాయి. దృఢకాయు లయిన చర్మకారులు ముందువసారాలో గొంతుకకూచుని ఆవ లిస్తూ ఎద్దు చర్మాలను మర్దిస్తున్నారు. వర్తకులు గుడారాలలో కూచుని చెకుముకిరాళ్ళు, ఉక్కు ముక్కలు, తుపాకి మందు గొట్టాలు రాసులుగా పోసుకుని అమ్మజూపుతున్నారు. ఒక ఆర్మీనియను విలువయిన రుమాళ్ళు దుకాణంలో వేలాడ గట్టాడు. ఇంకోచోట ఒక తాతారు మాంసపుముక్కలు పిండిలో కలిపి వేగిస్తున్నాడు. ఒకయూదు మెడముందుకు సాచి పీపాలో నుంచి వోడ్కా తోడుతున్నాడు. మనకోసక్‌లు ముందుగా జపరోజియేనివాసి ఒకనిని కలుసుకున్నారు. వాడు రోడ్డు మధ్యన పంగజాచుకుని పడుకున్నాడు. తారాస్ బుల్బా ఆగి వాడిని మెచ్చుకోకుండా ఉండలేకపోయాడు.

"ఓ యెటువంటి దృశ్యం, యెటువంటి దృశ్యం!" అన్నాడు బుల్బా కళ్లెం లాగిపట్టి "మగాడంటే వీడే మగాడు!"

నిజం. ఆదృశ్యం బలే భేషుగ్గా ఉంది. ఆ కోసక్ రోడ్డు మీద బారజాచి సింహంలాగ పడుకున్నాడు. జుట్టు నేలమీద అడుగుఆక్రమించుకుంది. వదులు వదులు లాగుకు తారు పులుము

కుని ఆ సిందూరవర్ణపులాగుగుడ్డ మీద తన ఏహ్యాభావం వెళ్ల
డిస్తున్నట్లున్నాడు.

తారాస్ బుల్బా తనివితీరా వాడిని మెచ్చుకుని ఒక ఇరుకువీధి వెంట పోసాగాడు. ఆ వీధిఅంతాచేతివృత్తులవారితోను, వివిధజాతులవారితోను కిక్కిరిసిపోయి ఉంది. గడీలో నివసించే వారికి తుపాకి కాల్చడం, తాగి తందనాలాడడం తప్ప ఇంకేమీ చేతగాదు. ఈ శివారు సంతలాగావారికి కూడూ గుడ్డా చేకూరుస్తుంది.

ఆ శివారుదాటి అక్కడక్కడా చెదురువాటుగా ఉన్న కోసక్ ఇళ్ళను వారు చూసారు. వాటిలో కొన్ని పూరిళ్ళు, కొన్నిటికి పూరికిబదులు తాతారు పద్ధతిలో పైకప్పుకా కంబళ్ళు పరిచారు. కొన్నిటిచుట్టూ ఫిరంగులు ఉన్నాయి. ఒక్క ఇంటికీ కోరడిలేదు. కిందుగా ఉన్న ఇళ్ళులేవు. రక్షణ బురుజువద్ద ఎవరూ కాపలా లేరు. ఇది అక్కడివారి అజాగ్రతను సూచిస్తోంది. కొద్ది మంది కోసక్‌లు నోట్లో పైపులు పెట్టుకుని రోడ్డుమధ్య పచార్లు చేస్తూ మన ప్రయాణీకులకేసి తేరిపారజూసి ముఖావం వహించారేగాని అక్కడనుంచి కదలలేదు. తారాస్, అతని కొడుకులు వారిమధ్యగా దోవచేసుకుని ముందుకుసాగిపోతూ వారికి నమస్కరించారు. ఆ జపరోజియేవాసులు ప్రతి నమస్కారం చేసి మిన్నకున్నారు. ఆ ప్రదేశంలో ఎక్కడచూసినా జనం గుంపులు గుంపులుగా చేరిఉన్నారు. వారి మొహాలు చూస్తే వారు యుద్ధాలలో కాకలు తేరినవారనీ, అనేక అగ్నిపరీక్షలకు తట్టుకున్నవారనీ బోధపడుతుంది. ఇదీ గడీ! ఇది సింహ పరాక్రమం గల కోసక్‌ల గుహ! ఇక్కడనుంచే యుక్రెయిన్ అంతటికీ స్వేచ్ఛ, కోసక్ రాజ్యం ఆవిర్భవిస్తోంది.

మన ప్రయాణీకులు పెద్దచౌకు చేరుకున్నారు. ఇక్కడే 'రాడా'-కోసక్ల సర్వసభ్య సమావేశం - జరుగుతూంటుంది. ఒకడు బోర్లించిన పీపామీద కూర్చుని చొక్కా తీసివేసి చినుగులు మెల్లగా కుట్టుతున్నాడు. మనవారిదారికి ఒక సంగీతపు జట్టు తారసిల్లింది. వారిమధ్యన ఒక యువకుడు బొరలుచాస్తూ టోపీ ఇష్టంవచ్చినట్టు ఆడిస్తూ నృత్యం చేస్తున్నాడు. అతను బిగ్గరగా, "ఊఁ-యింకా జోరుగా పాడండి. ఫోమా! యీ క్రైస్తవులకు వోడ్కా యెగగొట్టకేం!" అని అరుస్తున్నాడు. ఇక ఫోమా, అడిగినవాడికల్లా ముంతెడు ముంతెడు వోడ్కా అందిస్తున్నాడు. ఆ యువకుని చుట్టూ నలుగురు వృద్ధులు గిర్రున తిరుగుతూ, మధ్యమధ్య సుడిగాలిలాగా పాటకులమీదికి ఎగురుతూ, మళ్ళీ హఠాత్తుగా నేలమీద మడమలతో తాళం వేస్తూ హుషారుగా నృత్యం చేస్తున్నారు. నేలనేలంతా ఝుంఅంటోంది. నాడాలు కొట్టిన బూట్ల తాళాలకు ఆ ప్రదేశమంతా ప్రతిధ్వనిస్తోంది. కాని ఒకడుమాత్రం అందరికంటె ఎక్కువగా అరుస్తూ, గంతులు వేస్తున్నాడు. జుట్టుముడి గాలిలో ఎగురుతోంది. ఎదురొమ్ముకేమీ ఆచ్ఛాదనలేదు. వెచ్చటి గొర్రెతోలు చలికోటు మాత్రం వేసుకున్నాడు. చెమట కడవలు కడవులుగా కారుతోంది.

"ఆకోటు తీసిపారెయి, చెమట్లు కారిపోతున్నాయి" అన్నాడు బుల్బా.

"ఉహుఁ-" అని వాడుతిరిగి అరిచాడు.

"యెందుకనేం ?"

"ఉహుఁ-మనతత్వమే అంత. పూడదీసిందల్లా వోడ్కాకిందే ఖర్చు!"

నిజం! ఆ యువకుడికి టోపీలేదు. కాసికోక లేదు. లేసు రుమాలు లేదు. అన్నీ మామూలు ప్రకారం సారా దుకాణానికి చేరుకున్నాయి.

అంతకంతకు గుంపు పెరిగిపోతోంది. ఇంకా అనేకులు నాట్యంలో పాల్గొంటున్నారు. ప్రపంచంలో కనీ వినీ ఎరగని మహోద్రేక పూరితమయిన ఈనృత్యం చూస్తూంటే చాలు శరీరం పులకరిస్తుంది.

'గుర్రంమీద లేకపోతే యెంత బావుండును! నేనూ యీ నృత్యంలో పాల్గొనేవాడినే!" అన్నాడు తారాస్ బుల్బా.

ఆ గుంపులో తల నెరిసిన వృద్ధులుకూడా పొడగట్టారు. వీరంతా సాహస కృత్యాలకు పేరుమోగినవారే. అనేకసార్లు తండా పెద్దలగా ఎన్నికయినారు.

తారాస్‌కు చిరపరిచితమయిన మొహాలు అనేకం కనిపించాయి. "ఆఁ-నువ్వా ?"

"యెపుడొచ్చావు తారాస్ !" "అరే! యిక్కడికెందుకొచ్చావు, డొలొటో ?" "హల్లో ! మళ్ళీ నిను చూస్తాననుకోలేదుసుమా !" అనేమాటలు తప్పితే ఒస్టాప్ ఆంద్రీలకు మరేం వినిపించలేదు. తక్షణమే ఈ యోధులను ముద్దిడుకుని తారాస్ ప్రశ్నలవర్షం కురిపించాడు. "కాస్యాన్ యేమయినట్టు ? బొరొడొవా యెక్కడున్నాడు ? కొలోప్యార్ సంగతేమిటి ? పిడిసిషోక్ బావున్నాడా ?" బొరొడావ్కాను టొలొపార్‌లో ఉరితీసారనీ, కొలొప్యార్‌ను చర్మం ఒలిచేసారనీ, పిడిసిషోక్ తల ఉప్పులో ఊరవేసి జాడీలోపెట్టి కాంస్టాన్‌టినోపులుపంపించారనీ

వారు జవాబిచ్చారు. ముసలి బుల్బా తల వంచుకుని, "యేమై యితేనేం, వారంతా మహా మంచి కోసక్‌లు!" అని గొణుక్కున్నాడు.

## 3

తారాస్ బుల్బా, అతని కొడుకులు గడీలో అప్పుడే వారంరోజులు గడిపారు. ఒస్టాప్, ఆంద్రీ సైనికశిక్షణకు ఎక్కువ కాలం,వినియోగించలేదు. గడీలో వారు సైనిక వ్యాయామం, దానికి కొంతకాలం వెచ్చించడం ఇచ్ఛగించేవారు కాదు. అచ్చటి యువకులు యుద్ధజ్వాలలో అనుభవంద్వారా సాధనచేసి ఆరితేరిన యోధులు, అందువలననే వారు తరుచు యుద్ధాలలో పాల్గొనేవారు. యుద్ధానికీ యుద్ధానికీ మధ్యకాలంలో యుద్ధ తంత్రం అధ్యయనం చేయడం వృథాప్రయాస అని తలపోసేవారు. గురిచూసి తుపాకి కాల్చడం, మైదానాలలో గుర్రపు పందాలు వేయడం, అడవి మృగాలను వేటాడడం మాత్రం సాగించేవారు. తక్కిన కాలమంతా వేడుకలతో గడిపేవారు. ఇది ఏ బంధనాలూలేని వారి హృదయ వైశాల్యతను చాటుతుంది.

గడీఅంతా ఒక అసాధారణ దృశ్యంలాగా ఉంది. అంతూ పొంతూలేని వేడుకలు, తందనాలు! కొంతమంది తమతమ వృత్తులలో నిమగ్నులయి ఉన్నారు. మరికొందరు దుకాణాలు పెట్టి వ్యాపారం సాగిస్తున్నారు. కాని అక్కడివారిలో అధిక సంఖ్యాకులు, జేబులో నాలుగు డబ్బులు గలగలలాడుతూ దోపిడీ ధనం వ్యాపారస్తుల చేతిలోనో సారా దుకాణాదారు చేతిలోనో పడ

నంతవరకు, పొద్దస్తమానం తాగి తందనా లాడతారు. ఈ వేడు
కలలో ఏదో ఆనందం ఉంది. దుఃఖాన్ని మరిచేపోవడానికి తాగు
తున్న తాగుమోతులు గుమిగూడడం కాదిది. వేడుకల కోలా
హాలం! అక్కడికి వెళ్ళిన ప్రతివ్యక్తీ కష్టాలను మరిచేపోతాడు.
గత జీవితాన్నంతా కాలదన్ని అక్కడివారితో కలిసి స్వేచ్ఛా
జీవనం గడపడానికి వెనకా ముందూ ఆలోచించకుండా దూకు
తాడు. అక్కడివారికి కొంపా గోడూ అంటూ లేదు. వారికి ఉన్న
దల్లా పైన ఆకాశం, ఎడతెగని ఆనందం! ఇంకేవిధంగానూ
ఉత్పన్నంకాని ఆనందాన్ని గడీ పెంచి పోషించుతోంది. సోమా
రిగా నేలమీద పడుకుని చెప్పుకునే కట్టుకథలలోని హాస్యానికి,
చొల్లు కబుర్లలోని హాస్యానికి నవ్వకుండా మీసం కాసంతయినా
కదిలించకుండా, తొణకకుండా ఉండడం బ్రహ్మప్రళయమయేది.
అయితే ఇలా తొణకకుండా గంభీరంగా ఉండగల ఈ లక్షణమే
దక్షిణ రష్యన్ల ప్రత్యేకత! ఇదంతా తాగుడు! కోలాహలం,
ఆనందం! అంతేగాని కల్లుదుకాణంలోని కృత్రిమానందంకాదు.
వీరంతా ఒకబడిలో చదివినవారే. ఆత్మీయులు, కాని ఒకటే
భేదం. ఉపాధ్యాయులు చెప్పే గుడ్డిపాఠాలు వినేబదులు
గుర్రాలు ఎక్కి దాడి వెళ్ళతారు. ఆటస్థలాలలో బంతి ఆడు
కునే బదులు ఏ రక్షణాలేని సరిహద్దులలో నివసిస్తున్నారు. ఆ
సరిహద్దులలో తాతారువాళ్లూ, ఆకుపచ్చ తలపాగాల టర్కీ
వాళ్లూ వీరిమీద పడుతూంటారు. బడిలో బలవంతంమీద చదువు
కునే బదులు వారంతటవారే ఇళ్ళను, తలిదండ్రులను వదిలిపెట్టి
ఇక్కడికి పారిపోయి వచ్చారు. ఇక్కడ వారి మెడకి ఉరితాడు
బిగుసుకుంటోంది. బడిలో సజీవ సమాధికి బదులు ఇక్కడ జీవి
తాన్ని, జీవిత కోలాహలాన్ని రుచి చూస్తున్నారు. జేబులో

చిల్లిగవ్వయినా అట్టే పెట్టెకోగూడదనేదే వారి సంప్రదాయం. ఒక్క డకెట్ ని మహాభాగ్యంగా ఎంచుకునేవారు. యూదుల ధర్మమా అంటూ వారిజేబులు ఎపుడూ ఖాళీగానే ఉండేవి. బెత్తం దెబ్బలకు తట్టుకోలేక పారిపోయివచ్చిన కాలేజీ విద్యార్థులే వీరంతా. చదువు గుంటకట్టి గంట వాయించారు. వీరికే కాదు, ఇక్కడివారిలో కొంతమందికి హోరాసి సంగతి, సిసెరో రోమన్ ప్రజాస్వామ్యాల సంగతి తెలుసు. పోలండు రాజుల జెండా కింద పోరాడిన సైనికాధికారులు ఇక్కడ చాలామంది ఉన్నారు. మరికొంతమంది యోధులుకూడా ఇక్కడ ఉన్నారు. వీరందరికీ యుద్ధమే ప్రధానం. ఎక్కడ యుద్ధం చేయడం అనే ప్రశ్నే లేదు. వీరి ఉద్దేశంలో యుద్ధం చేయకుండా గోళ్లు గిల్లుకుంటూ కూర్చోడం నామర్దా. "మేం గడీవాళ్ళం. యుద్ధాలలో ఆరితేరాం" అని చెప్పుకోవడానికి వచ్చినవారూ కొందరు ఉన్నారు. కాని ఇక్కడ లేం దెవరు? ఈ విచిత్రమయిన సర్వతంత్రదేశం ఆ యుగానికి ప్రతిబింబం. యుద్ధప్రియులకు ఇక్కడ చేతినిండా పని దొరుకుతుంది. బంగారు గిన్నెలకు, జలతారుకు, డకెట్లకు ఇక్కడ గిరాకీ ఎక్కువ. ఆడవారిని ఆరాధించదలచిన వారికిమాత్రం ఈ గడీలో స్థానంలేదు. గడీ శివార్లలోకి అడుగు పెట్టడానికి స్త్రీలు సాహసించరు.

ఒస్టాప్, ఆంద్రీలతోపాటు అనేకమంది గడీలో ప్రవేశించారు. కాని ఒకడూ వారిని పలకరించి ఆనుపానులు అడగక పోవడం వారికి ఆశ్చర్యం గొలిపింది. ఆ వచ్చినవారంతా ఏగంటక్రితమో ఇల్లువెడలి తిరిగి వస్తున్నవారిలాగా కనిపించారు.

కొత్తగా వచ్చినవారు ముందుగాకొచెవాయ్ ఆటామాన్ *దగ్గరకు వెళ్ళడం మామూలు. ఆటామాన్ "స్వాగతం! స్వాగతం! మీకు ఏసుక్రీస్తులో నమ్మకం వుందా?" అని ప్రశ్నిస్తాడు.

"ఆఁ-వుంది" అని కొత్తవారి జవాబు.

"మీకు త్రిమూర్తులలో నమ్మకం వుందా?"

"ఆఁ-వుంది."

"చర్చికి వెళుతూంటారా?"

"ఆఁ-"

"యేదీ శిలువ ఆకారం వేయండి."

కొత్తగా వచ్చిన వ్యక్తులు శిలువ ఆకారం వేస్తారు.

"సరే మంచిది. మీయిష్టం వచ్చిన తండాలోచేరండి."

అంతే! అంతటితో మర్యాదలు పూర్తి అవుతాయి.

గడీలోనివారంతా ఒక చర్చితోనే ప్రార్థనలు చేస్తారు. ఉపవాసాలు, మద్యనిషేధం చెవిని పెట్టకపోయినా ఆ చర్చి రక్షణార్థం రక్తం ధారపోయడానికి సర్వదా సిద్ధంగా ఉంటారు. జపరోజీయే వారు ఎన్నడూ బేరమాడుతూ కూర్చోరు. జేబులో ఉన్నదంతా గుమ్మరించేయడమే. అందుకని యూదు, ఆర్మీనియన్, తాతారు అత్యాశాపరులు మాత్రమే ఇక్కడఉండి వ్యాపారం చేయడానికి సాహసిస్తున్నారు. కాని వారి జీవితం కూడా బహునికృష్టంగా ఉండేది. వారిపని వెసూవియస్ అగ్ని పర్వత పాదతలంలో ఉన్నట్లుండేది. ఆ జపరోజీయేవారు జేబులో ఉన్నదంతా తగలేసుకుని దుకాణాలు పగలగొట్టి దోచుకునేవారు.

---

* తండాపెద్ద, నాయకుడు

ఈగడీలో అరవయి తండా పీటలు ఉన్నాయి. ఇందులో ప్రతి ఒకటీ ఒక ప్రజాతంత్ర దేశాన్ని పోలి ఉంటుంది. తిండిపెట్టిచదువు చెప్పే గురుకులంలాగా ఉంటుందంటే ఉపమానం సరిపోతుంది. ఆస్తిపాస్తులు సంపాదించుకోవాలనే కాంక్ష ఎవరికీ ఉండేదికాదు. అంతా ఆటామాన్ చేతికింద ఉంటుంది. అందుకనే వారు ఆటామాన్‌ను 'నాన్నా' అని సంబోధిస్తారు. డబ్బూ దస్కం, బట్టలూ, ఆహార పదార్థాలు, చివరికి వంట చెరుకుకూడా అతని అధీనంలోనే ఉంటుంది. అక్కడివారంతా డబ్బు దాయమని ఆయన చేతిలో పెడతారు. తరుచుగా వీరు పోట్లాడుకునేవారు. మాటలు పోట్లలోకిదిగేవి. చాకులో చేరి శవాలు కంటబడేదాకా కొట్లాడుకుని మళ్ళీ కలిసికట్టుగా తాగి తందనాలాడేవారు. ఇదీ గడీ అంటే! అందుకే యువకులకు గడీ అంటే అంత ఆకర్షణ!

ఒస్టాప్ ఆండ్రీలు ఇల్లూ వాకిలీ, చదువు సంధ్యలూ, పూర్వాలోచనలూ అన్నీ మరిచేబోయి యవ్వనోత్సాహంతో ఈ కోలాహల సముద్రంలోకిదూకి నూతన జీవితంలో తల మునకలు వేయసాగారు. గడీలోనివారి ఆచారాలు, నిరాడంబర పాలన, చట్టాలు, ఒకటేమిటి ప్రతీదీ వారికి ఎంతో ఆసక్తి గొలిపింది. కాని ఈ స్వతంత్ర రాజ్యంలో కొన్నిచట్టాలు మాత్రం మహాక్రూరంగా ఉండేవి. కోసక్ దొంగతనంచేస్తే, ఆ దొంగతనం ఎంతచిన్నదయినాసరే, అతనిని స్తంభానికి కట్టివేసి పక్కన ఒక బడితె పెట్టేవారు. దారినబోయే వారంతా ఆ బడితెతో చచ్చేవరకూ తలో దెబ్బా వేసేవారు. అప్పుతీర్చని వారిని ఫిరంగికి కట్టేసేవారు. ఏ స్నేహితుడో అప్పుతీర్చి వది లించేవరకూ అతను అలాపడి ఉండవలసిందే. ఖూనీచేసినవాడికి

విధించే శిక్ష అన్నిటికంటే ఎక్కువగా ఆంద్రీ హృదయాన్ని పట్టేసింది. ఆ హంతకుని కళ్ళముందే గొయ్యి తవ్వి, బతికి ఉండగానే అందులో పడవేసి, మీద శవపేటిక పెట్టి సమాధిచేసేవారు. ఈవిధంగా సజీవ సమాధి చేసే దృశ్యం ఆంద్రీ స్మృతిలో వెన్నాడజొచ్చింది.

ఆ యువకు లిద్దరూ అక్కడి కోసక్‌లతో కలిసి మెలిసి పోయారు. తమ తండా చెందినవారితోను, పొరుగుతండా వారితోనూ కలిసి గుర్రాలమీద మైదానానికి వెళ్ళి పిట్టలను, జింకలను, మేకలను వేటాడేవారు. తమ తండా లాటరీలో ప్రత్యేకించిన చెరువులకు, నదులకు, పాయలకు వెళ్ళి చేపలుపట్టి ఆహార నిల్వలను పెంపొందించేవారు. కోసక్‌గా పరిగణించడానికి ఇది పరీక్ష గాకపోయినా ఆ యువకులు సాహసం మూలంగా అదృష్టంకొద్దీ పేరుప్రతిష్టలు తెచ్చుకున్నారు. మంచి ధైర్యస్తులు, గురి తప్పకుండా తుపాకి పేల్చగలరు. నీపర్‌నదీ ప్రవాహానికి ఎదు రీదగలరు. ఇలా సాహసించి ఈది విజయం పొందిన వారిని కోసక్ సంఘంలో చేర్చుకునేవారు.

కాని ముసలిబుల్బా సంకల్పం వేరువిధంగా ఉంది. కొడుకులు సోమారి జీవితం గడపడం అతనికి రుచించలేదు. వాస్తవిక కార్యకలాపంకోసం అతని మనసు తహతహలాడిపోతోంది. శౌర్యపరాక్రమాలు ప్రదర్శించవలసిన సాహస కృత్యాలకు గడీవారిని పురిగొల్పడం ఎలాఅని ఆలోచించ సాగాడు. ఒకరోజున కొచెవాయ్ దగ్గరకువెళ్ళి సూటిగా; "మనం యిక యుద్ధానికి దిగితే బావుంటుందేమో?" అన్నాడు. "యెవరిమీద?" అని కొచెవాయ్ నోటిలోనుంచి చిన్నపైపుతీసి ఉమ్మివేసి జవాబిచ్చాడు.

"యెవరిమీదా ? తాతార్లమీదో, టర్కీవాళ్ళమీదో చేదాం."

"టర్కీవాళ్ళమీదికి వెళ్ళడానికీ వీల్లేదు, తాతార్లమీదికి వెళడానికీ వీల్లేదు." అన్నాడు కొొచెవాయ్ ప్రశాంతంగా, పైపు నోట్లో పెట్టుకుంటూ,

"యెందుకనేం ?"

"యుద్ధానికి దిగమని సులతానుకు మాట యిచ్చాం."

"కాని ఆ సులతాను పాషండుడు. పాషండు లందరినీ శిక్షించవలసిందని భగవంతుని ఆజ్ఞ. పవిత్ర గ్రంథంకూడా అదే ఆదేశిస్తోంది."

"మనకా హక్కులేదు, మనం మతంమీద ప్రమాణంచేసి మాట యివ్వకుండా వున్నట్లయితే సాధ్యమయేదేమో ! మరి యిపుడుమాత్రం...ఉహుఁ-"

"యెందుకనేం ? మనకి హక్కు లేదనడంలో నీ వుద్దేశ మేమిఁటి ? యిదిగో, నేను నా.కొొడుకులతో యిక్కడికి వచ్చాను. వాళ్లు యువకులు, యుద్ధంమొహం యెరగరు. యిక నువు... నువు మాకు హక్కులేదంటావా? జపరోజియే వాళ్లు యుద్ధానికి దిగగూడదంటావా ?"

"అఁ-అంతే."

"అంతే అయితే యీ కోసక్ శక్తిఅంతా మట్టిపాలు కావలసిందేనా ? యేదయినా మహత్కార్యం చేయకుండా, దేశానికీ, క్రైస్తవ ప్రపంచానికీ సేవ చేయకుండా కుక్కచావు చావవలసిందేనా ? యిక మనం బతకడ మెందుకో చెప్పు ? నువు మాంచి తెలివిగలవాడివి. నిన్ను కొొచెవాయ్‌గా యెన్ను కున్న దెందుకు ? మనం బతికి వుండడం దేనికి? చెప్పు."

కొచెవాయ్ ఈ ప్రశ్నలకు సమాధాన మీయలేదు. అతనూ మొండిఘటమే. కొంచెంసేపు మౌనంవహించి అన్నాడు:

"యేమయినా యుద్ధం జరగడానికి వీల్లేదు.

"వీల్లేదూ ?"

"వీల్లేదు."

"యుద్ధాన్ని గురించి ఆలోచించి ప్రయోజనం లేదంటావా ?"

"ప్రయోజనం లేదు."

"సరే, కాచుకో, లంజ కొడకా!" అనుకున్నాడు బుల్బా తనలో "నా తడాఖా యేమిటో చూపెడతాను." కొచెవాయ్ మీద పగ తీర్చుకోవాలని బుల్బా తక్షణం నిశ్చయించుకున్నాడు.

బుల్బా చాలామంది మిత్రులతో మాట్లాడాడు. తప్ప తాగించాడు. పైకెప్పు నెత్తికెక్కగానే ఆ కోసక్‌లు జట్టుగా చౌకులోకి వెళ్ళారు. అక్కడ రాడాని సమావేశ పరచడానికి వాయించే నగారా ఒక స్తంభానికి కట్టిఉంది. చిరతలు నగారా వాడిదగ్గర ఉన్నాయి. అందుకని ఆ కోసక్‌లు తలో కొయ్య ముక్క తీసుకుని నగారా మోగించారు. ఆ మోతవిని నగారా వాడు అందరికంటె ముందు ప్రత్యక్షమయాడు. అతను పొడుగాటివాడు. ఒకటే కన్ను, వట్టి నిద్రమత్తు మొహం.

"యెవరా వాయించేది ?" అని కేకపెట్టాడు.

"నోరుముయ్. చిరతలు తీసుకుని మేము వాయించమన్నపుడు నగారా వాయించు." అని పైకెక్కిన కోసక్ పెద్దలు జవా బిచ్చారు.

ఇటువంటి సంఘటనలు ఎలా అంతమవుతాయో బాగా తెలిసినవాడు గనక నగారావాడు వెంటనే చిరతలు పైకి తీసాడు. నగారా ఢాంఢాం అని మోగింది. తక్షణమే జపరోజియే వాసులు తేనెటీగలలాగా నగారాచుట్టూ ముసురుకుని వలయాకారంగా సమావేశ మయారు. మూడో పిలుపుకు పెద్దలందరూ చక్కా వచ్చారు. అధికార దండం పట్టుకుని కొచెవాయ్, సైనిక ముద్రతో న్యాయాధిపతి, కలం సిరాబుడ్డితో లేఖకుడు, సిబ్బందితో సేనాని అరుగుదెంచారు. కొచెవాయ్, తదితర పెద్దలు టోపీలు తీసివేసుకుని, సగర్వంగా నడుములకు చేతులానించి నిలబడ్డ కోసక్ లందరికీ నమస్కరించారు.

"యెందుకీ సమావేశం? మీ కోరిక యేమిటి?" అని ప్రశ్నించాడు కొచెవాయ్.

అరుపులు, పెడబొబ్బలు చెలరేగాయి, కొచెవాయ్ నోరెత్తడానికే వీలు లేకపోయింది.

"ఆ దండం యిట్లా పారెయ్. ఊం- వెంటనే పారెయ్ వెధవముండా కొడక! యిక దయచెయ్!" అని గుంపులో నుంచి కోసక్‌లు గద్దించారు. మైకంలోలేని కొందరుమాత్రం ఇందుకు అంగీకరించలేదు. చేతులు కలుపుకునేవరకూ వచ్చింది వ్యవహారం. అరుపులు పెడబొబ్బలు పెచ్చుపెరిగాయి

కొచెవాయ్ మొదట మాట్లాడాలని తలపోసాడు గాని ఆ తరవాత మానుకున్నాడు. కోపంతో మండిపోతున్న ఆకోసక్‌లు తనను చంపడానికి వెనుదీయరని అతనికి బాగా తెలుసు. అందుకని వంగి నమస్కరించి, అధికార దండం నేలమీదపెట్టి జనంలో కలిసి అదృశ్యమయిపోయాడు.

"మా మా అధికార చిహ్నాలను కూడా కింద పెట్టేయమంటారా ?" అని అడిగారు న్యాయాధిపతి, లేఖకుడు, సేనాని.

"ఉహుం-వద్దు. మీదగ్గిరే వుంచుకోండి. మేం కొచెవాయ్‌ని తొలగించాలనుకున్నాం, అంతే. వాడు వట్టి అడంగి వెధవ! మగసిరి గలవాడు కొచెవాయ్ కావాలి." అని జనం అరిచారు.

"కొచెవాయ్‌గా మీరు యెవర్ని యెన్నుకోదలిచారు?"

"కుకుబెంకోని యెన్నుకుందాం" అని ఒక పక్షంవారు అరిచారు.

"మాకు కుకుబెంకో అక్కర్లేదు. కుర్రకుంక! యింకా ముక్కుపచ్చ లార్లేదు." అని ఇంకోపక్షంవారు కేకపెట్టారు.

"షిలోని యెన్నుకుందాం" అని కొందరు అరిచారు.

"షిలోవట్టి చాద స్తపు ముండాకొడుకు. తాతార్లలాగా పచ్చిదొంగ! వాడేంకోసక్! పైగా తాగుమోతు!"

"బొరొడాటీ! బొరొడాటీని కొచెవాయ్‌ని చేదాం."

"బొరొడాటీ మా కక్కర్లేదు వాడిపిండం పెట్ట!"

"కిర్డియాగాని యెన్నుకుందామని కేకపెట్టు" అని బుల్బా ఒక కోసక్ చెవిలో ఊదాడు.

"కిర్డియాగా! కిర్డియాగా!" అని జనం అరిచారు.

"బొరొడాటీ! బొరొడాటీ!"

"కిర్డియాగా! కిర్డియాగా!"

"షిలో!"

"వాడిని తగలెయ్యా?"

"కిర్డియాగా!"

ఈ అభ్యర్థులంతా ఎన్నికలమీద తమ ప్రభావం పడ కుండా ఉండేందుకు జనంలోనుంచి తప్పుకుని వెళ్ళిపోయారు.

'కిర్డియాగా! కిర్డియాగా!' అనే కేకలు ఇంకా బిగ్గరగా వినపడసాగాయి.

"బోరోడాటీ!"

ఈ ఎన్నికల తగాదా పరిష్కరించుకోవడానికి జనం ముష్టియుద్ధానికి దిగారు. చివరికి కిర్డియాగాకు విజయం లభిం చింది.

"వెళ్ళి కిర్డియాగాని తీసుకురండి."

తప్పతాగిన కోసక్‌లు డజనుమంది తూలుతూ ఎన్నిక లలో విజయం లభించిందని తెలియజేయడానికి కిర్డియాగా దగ్గరకు వెళ్ళారు.

కిర్డియాగా ముసలివాడయినా మంచి తెలివితేటలు గల వాడు. అక్కడేం జరుగుతున్నదీ తనకేమీ పట్టనట్టు చాలా సేపటినుంచీ ఇంట్లోనే కూర్చున్నాడు.

"యేం కావాలి?" అని ప్రశ్నించాడు.

"నిన్ను కొచెవాయ్‌గా యెన్నుకున్నాం. పోదాంపద."

"దయదల్చండి బాబూ! అంత గౌరవానికి నేను అర్హుణ్ణి కాను. కొచవాయ్‌గా నేనేంచేసి యేడవగలను? అటువంటి పద విలో వుండడానికి కావలసిన తెలివితేటలు నాకు లేవు. యింత సేనలో నేనుతప్ప యింకెవరూ సమర్థులు దొరకలా?"

"మేం చెపుతున్నాంగా. రా," అని కోసక్‌లు అరిచారు.

ఆ కోసక్‌లలో ఇద్దరు కిర్డియాగాను చెరోరెక్క పట్టు కుని, ఎంత మొత్తుకున్నా వినకుండా కొడుతూ తిడుతూ

తన్నుతూ, "వెనక్కిదీయకురా. లంజకొడకా! అందలం యెక్క మన్నపుడు యెక్కాలిరా కుక్కా!" అంటూ కిర్డియాగాను కోసక్‌ల మధ్యకి లాగుకుని వచ్చారు.

"కొచెవాయ్‌గా యీ కోసక్‌ని యెన్నుకోడానికి మీరంతా యిష్టపడేగా!" అని కిర్డియాగాను తీసుకువచ్చినవారిలో ఒకడు అరిచాడు.

"వప్పుకున్నాం" అని జనం కేక పెట్టారు. ఆ కేక మైదానమంతా ప్రతిధ్వనించింది.

పెద్దలలో ఒకరు అధికార దండం తీసుకునికొత్తగా ఎన్నికయిన కొచెవాయ్‌కి సమర్పించాడు. కాని ఆచారం ప్రకారం కిర్డియాగా దానిని నిరాకరించాడు. పెద్దమళ్ళీ సమర్పించాడు. కిర్డియాగా మళ్ళీ తిరస్కరించాడు. మూడో తడవ సమర్పించగా కిర్డియాగా అధికారదండం స్వీకరించాడు. జనం హర్షధ్వానాలు చేసారు. మైదానమంతా హర్షధ్వానాలతో మారుమోగిపోయింది. తరవాతతలనెరిసినవృద్ధులునలుగురు జనంలోనుంచి తోసుకునివచ్చి తలో పిడికెడు మట్టి కిర్డియాగా తలమీద పోసారు. అంతకుపూర్వం వర్షం కురిసిందేమో, మట్టి బాడిబాడిగా ఉంది. బురద కిర్డియాగా తలమీదనుంచి మీసాల మీదకు చెంపలమీదకు జారి మొహమంతా అలుముకుంది. కాని కిర్డియాగా తొణకకుండా నిలబడి తనకు చేసిన గౌరవానికీ కోసక్‌లకు అభివందనాలు సమర్పించాడు.

ఈ విధంగా ఎన్నికల కోలాహలం ముగిసింది, ఈ ఎన్నికల ఫలితానికి బుల్బా అంతగా ఎవరూ సంతోషించలేదేమో! పాత కొచెవాయ్‌మీద పగ తీర్చుకున్నాడు. ఇంతేగాదు. ఈ కొత్తకొచవాయ్ అతనికి మిత్రుడు. ఇద్దరూ కలిసి అనేక

ఈ అభ్యర్థులంతా ఎన్నికలమీద తమ ప్రభావం పడకుండా ఉండేందుకు జనంలోనుంచి తప్పుకుని వెళ్ళిపోయారు.

'కిర్డియాగా! కిర్డియాగా!' అనే కేకలు ఇంకా బిగ్గరగా వినపడసాగాయి.

"బోరొడాటీ!"

ఈ ఎన్నికల తగాదా పరిష్కరించుకోవడానికి జనం ముష్టియుద్ధానికి దిగారు. చివరికి కిర్డియాగాకు విజయం లభించింది.

"వెళ్ళి కిర్డియాగాని తీసుకురండి."

తప్పతాగిన కోసక్‌లు డజనుమంది తూలుతూ ఎన్నికలలో విజయం లభించిందని తెలియజేయడానికి కిర్డియాగా దగ్గరకు వెళ్ళారు.

కిర్డియాగా ముసలివాడయినా మంచి తెలివితేటలు గలవాడు. అక్కడేం జరుగుతున్నదీ తనకేమీ పట్టనట్టు చాలా సేపటినుంచీ ఇంట్లోనే కూర్చున్నాడు.

"యేం కావాలి?" అని ప్రశ్నించాడు.

"నిన్ను కొచెవాయ్‌గా యెన్నుకున్నాం. పోదాంపద."

"దయదల్చండి బాబూ! అంత గౌరవానికి నేను అర్హుణ్ణి కాను. కొచవాయ్‌గా నేనేంచేసి యేడవగలను? అటువంటి పదవిలో వుండడానికి కావలసిన తెలివితేటలు నాకు లేవు. యింత సేనలో నేనుతప్ప యింకెవరూ సమర్థులు దొరకలా?"

"మేం చెపుతున్నాంగా. రా," అని కోసక్‌లు అరిచారు.

ఆ కోసక్‌లలో ఇద్దరు కిర్డియాగాను చెరోరెక్క పట్టుకుని, ఎంత మొత్తుకున్నా వినకుండా కొడుతూ తిడుతూ

తన్నుతూ, "వెనక్కి దీయకురా. లంజకొడకా! అందలం యెక్క మన్నపుడు యెక్కాలిరా కుక్కా!" అంటూ కిర్డియాగాను కోసక్‌ల మధ్యకి లాగుకుని వచ్చారు.

"కొచెవాయ్‌గా యీ కోసక్‌ని యెన్నుకోడానికి మీరంతా యిష్టపడేగా!" అని కిర్డియాగాను తీసుకువచ్చినవారిలో ఒకడు అరిచాడు.

"వప్పుకున్నాం" అని జనం కేకపెట్టారు. ఆ కేక మైదానమంతా ప్రతిధ్వనించింది.

పెద్దలలో ఒకరు అధికార దండం తీసుకునికొత్తగా ఎన్నికయిన కొచెవాయ్‌కి సమర్పించాడు. కాని ఆచారం ప్రకారం కిర్డియాగా దానిని నిరాకరించాడు. పెద్దమళ్ళీ సమర్పించాడు. కిర్డియాగా మళ్లీ తిరస్కరించాడు. మూడో తడవ సమర్పించగా కిర్డియాగా అధికారదండం స్వీకరించాడు. జనం హర్షధ్వానాలు చేసారు. మైదానమంతా హర్షధ్వానాలతో మారుమోగిపోయింది. తరవాతతలనెరిసినవృద్ధులునలుగురు జనంలోనుంచి తోసుకునివచ్చి తలో పిడికెడు మట్టి కిర్డియాగా తలమీద పోసారు. అంతకుపూర్వం వర్షం కురిసిందేమో, మట్టి బాడి బాడిగా ఉంది. బురద కిర్డియాగా తలమీదనుంచి మీసాల మీదకు చెంపలమీదకు జారి మొహమంతా అలుముకుంది. కాని కిర్డియాగా తొణకకుండా నిలబడి తనకు చేసిన గౌరవానికి కోసక్‌లకు అభివందనాలు సమర్పించాడు.

ఈ విధంగా ఎన్నికల కోలాహలం ముగిసింది, ఈ ఎన్నికల ఫలితానికి బుల్కా అంతగా ఎవరూ సంతోషించలేదేమో! పాత కొచెవాయ్‌మీద పగ తీర్చుకున్నాడు. ఇంతేగాదు. ఈ కొత్తకొచవాయ్ అతనికి మిత్రుడు. ఇద్దరూ కలిసి అనేక

యుద్ధాలలో పాల్గొన్నారు. ఇద్దరూ కలిసి కష్టమయ సైనిక జీవితం అనుభవించారు. ఎన్నికలు ముగిసాయిగదూ, ఇంకేం వేడుకలు చేసుకోవడానికి జనంచిందరవందరయినారు. ఒస్టాప్, ఆంద్రీలు ఎన్నడూ చూడనంతటి కోలాహలం ప్రారంభ మయింది. సారాదుకాణాలను దోచుకున్నారు. డబ్బు చెల్లించ కుండా వోడ్కా, బీరు, షర్బతు తీసుకు చక్కాబోయారు. దుకాణాదారులు ప్రాణాలు దక్కినాయి., అంతే చాలునని సంతోషించారు. సైనిక గీతాలు పాడుతూ ఆ రాత్రి అంతా ఒకటే గందరగోళం చేశారు. వాయించుకుంటూ పాడుకుని వీధులవెంట తిరిగారు. సారామత్తు తలకెక్కింది. అలసి పోయారు. ఇంకేం ఒక్కొక్కరు నేలమీదకు ఒరగ జొచ్చారు. ఒకచోట ఒక కోసక్ స్నేహితుణ్ణి కౌగలించుకుని తాగిన మత్తులో కన్నీళ్ళు పెట్టుకుంటూ ఏడవసాగాడు ఇద్దరూ కలిసికిందపడ్డారు. ఇంకోచోట ఒకకోసక్ కుప్పగాపడిపోయాడు. మరోచోట ఒక కోసక్ నిద్రపోవడానికి అనువయిన చోటుకోసం వెదకి చివరికి ఒక కొట్టులో కాళ్ళు చాచుకుని పడుకున్నాడు. కోసక్‌లలోకల్లా మొండిఘటాలు ఏదో గొణుక్కున్నారు. చివ రికి వారుకూడా సారామత్తుకు లొంగిపోయి కింద పడ్డారు. గడిగడీ అంతా నిద్రిస్తోంది.

# 4

ఆ మరునాడు జపరోజియే వాసులను కార్యరంగంలోకి దించడం ఎలానాఅని బుల్బా కొత్త కొచెవాయ్‌తో సమాలోచనలు నెరపసాగాడు. కొత్త కొచెవాయ్ మంచి తెలివిగలవాడు, జిత్తులమారి. జపరోజియేవాసుల మనస్తత్వం బాగా తెలిసినవాడు. "యేమయినా సరే, మాట తప్పకూడదు"అన్నాడు. కొంచెంసేపు తాళి మళ్ళీ అన్నాడు: "కాని వకమార్గం వుంది మాట తప్పకుండానే మనం యింకోపని చేదాం. నేను ఆదేశించానని చెప్పకుండా, వాళ్ళంతట వాళ్ళే సమావేశ మయేటట్టు చేయి. యెలా నిర్వహించాలో నీకు తెలిసిందేగా! అపుడు నేనూ, గ్రామపెద్దలూ యేమీ యెరగనట్టు అక్కడికి తయారవుతాం."

ఈ సంభాషణ జరిగిన అరగంటలోపునే నగారా మోగింది. తప్పతాగిఉన్న కోసక్‌లు నగారామోత వినీ వినగానే చౌకులో చేరారు. ఓ పదిలక్షల టోపీలు కదలాడసాగాయి. గొణుగుడు ప్రారంభమయింది. "యెవరు?" "యెందుకు?" ఎవరూ సమాధాన మీయలేదు. అక్కడక్కడ "కోసక్‌ల శక్తి వ్యర్థమయిపోతోంది. యుద్ధాల్లేవు. పెద్దలకు సోమరితనం బలిసింది. కళ్ళు నెత్తికెక్కాయి. యీ ప్రపంచంలో న్యాయం మట్టిగొట్టుకు పోయింది." అని అసంతృప్తిబరులు అరవసాగారు.

తక్కినవారు మొదట విని ఊరుకున్నారు. తరవాత వారూ గొడవ మొదలుపెట్టారు. "నిజం ! యీ ప్రపంచంలో న్యాయం యెక్కడేడిసింది ?" ఈ మాటలకు పెద్దలు ఆశ్చర్యం వెలిబుచ్చారు. కొచెవాయ్ ముందుకువచ్చి, "నను మాట్లాడనీయండీ" అన్నాడు.

"ఊఁ—సరే కానీ."

"నా వుపన్యాస సారాంశం యేవిఁటంటే... నాకంటె మీకే యెక్కువ తెలుసు... మనవాళ్లు యూదుల కల్లుదుకాణాల్లోనూ, స్నేహితుల దగ్గరా యిదివరకే చాలా అప్పుచేసారు. యిక అప్పు దొరికేటట్టు లేదు. అంతే గాకుండా, నే చెప్పే దాని సారాంశం యేవిఁటంటే, యిక్కడ యుద్ధం మొహంమే యెరగని యువయోధులు అనేకమంది వున్నారు. యుద్ధాల్లేకుండా యువకులు జీవించే దెట్టా ? వక పాపండుడి నయినా చావగొట్టనివాడు కోసక్ యెలా అవుతాడు ?"

"బలే భేషుగ్గా మాట్లాడుతున్నాడే!" అని అనుకున్నాడు బుల్బా.

"అయితే శాంతిసంధిని భగ్నం చేదామనే వుద్దేశంతో యిలా మాట్లాడుతున్నా ననుకునేరు. యథార్థం చెపుతా వినండి. మన దేవుడిగుడి చూడండి. యేంగుడి అది ? సిగ్గుచేటు! భగవంతుని దయవల్ల గడీ తరతరాలనించీ యిలాగే నిలిచివుంది. కాని యివాళ మనచర్చి బయట సరేసరి, లోపల విగ్రహాలకి అలంకారాలేవీ ? వాటికి వెండిచట్రం కట్టిద్దామనే ఆలోచన యెవరికీ తట్టలేదు. కొంతమంది కోసక్‌లు వీలునామాలో రాసి యిచ్చింధి తప్ప చర్చికీ వేరే ఆదాయంలేదు. అదయినా బహు కొద్ది. వారికి వున్నదంతా బతికివుండగానే తాగుడికి తగలేసారు.

నే చెప్పేదాని సారాంశం పాషండులమీద యుద్ధం చేయాలని కాదు. మనం యుద్ధానికి దియమని సులతానుకి మాటయిచ్చాం. మతంమీద వొట్టేసుకున్నాం. ఆడితప్పితే పాపం చుట్టు కుంటుంది."

"యేవిఁటీ చెత్తంతా?" అని ఆశ్చర్యపోయాడు బుల్కా.

"అందువల్ల మనంతటమనం యుద్ధానికి దిగకూడదు. అది మన గౌరవానికే భంగం. కాని మన యువకుల్ని పడవల్లో పంపుదాం. అనటోలియా తీరాలని తుడిచిపెట్టేస్తారు. నాబుద్ధికి తోచిన మార్గం యిదే. యేవంటారు?"

"అయితే యింకేం, మేమందరం బయల్దేరతాం. ముందుండి నడిపించు. ఊఁ- నడిపించు" అని నలుదిక్కులనుంచి జనం గట్టిగా అరిచారు. "మనమతంకోసం ప్రాణాలు వొడ్డడానికి సిద్ధంగా వున్నాం." కొచెవాయ్ భయపడిపోయాడు. జపరోజియే వారందరినీ బయలుదేర దీయాలని అతను అనుకోలేదు. ఆ సమయంలో శాంతిసంధిని భగ్నం చేయడం న్యాయంకాదని భావించాడు.

"యింకోసారి నను మాట్లాడనీండి."

"చాల్లెద్దూ, మొదట మాట్లాడింది పాడుచేయొద్దు."

"మీరెట్లాఅంటే అట్లాగే. నేను మీ దాసిసను. ప్రజావాణీ దైవవాణి. మీకు తెలిసిందేగా, మన పవిత్ర మతగ్రంథం కూడా ఆముక్కే చెపుతోంది. ప్రజాసంఘం సలహాకంటె వుత్తమమయింది లేదు. కాని వకటి ఆలోచిస్తున్నా! మన యువకుల సాహస కృత్యాలకి సులతాను శిక్షించకుండా వూరుకోడు. యీలోపున మనం సర్వసన్నాహాలూ చేసుకోవాలి. మనసేన

తాజాగా వుంటుంది. యెవరికీ భయపడాల్సిన అవసరం వుండదు. అంతేకాదు. మనం లేనపుడు తాతారువాళ్లు గడీమీద వచ్చి పడొచ్చు. తాతారు కుక్కలు మగాళ్ళు వుండగావచ్చి చావరు. మనం లేకుండాచూసి వచ్చిపడి క్రూరంగా బాధిస్తారు. నిజం చెప్పాలంటే మనకి కావలసినన్ని పడవలులేవు. అందరికీ సరిపోయే తుపాకి మందులేదు. నా మట్టుకు నేను అన్నిటికీ సిద్ధమే. నేను మీ బానిసని.''

ఇలా ప్రసంగించి ఆ జిత్తులమారి ఆటామాన్ ఊరుకున్నాడు. జనం గుంపులుగుంపులుగా చీలిపోయి చర్చించసాగారు. గ్రామపెద్దలు కలిసికట్టుగా ఆలోచించారు. అదృష్టవశాత్తూ కొద్దిమందే కైపుమీద ఉన్నారు. అందువల్ల కొచెవాయ్ ఇచ్చిన సలహా పాటించడానికి నిశ్చయించారు

కొంతమందిని నీపర్ నది ఆవలి ఒడ్డుకు పంపించారు. అక్కడ సైన్యానికి చెందిన డబ్బా దస్కం, శత్రువుల దగ్గర నుంచి లాగుకున్న ఆయుధ సామగ్రిలో కొంతభాగం నీటిలోనూ రెల్లుదుబ్బులలోనూ దాచిఉంచారు. తక్కినవారంతా దండయాత్రకు పడవలను సిద్ధం చేయడానికి వెళ్ళారు. రెప్పపాటు కాలంలో నదీ తీరమంతా జనంతో కిక్కిరిసిపోయింది. బాడితలు పుచ్చుకుని వడ్రంగులు వచ్చారు. కొంతమంది వృద్ధులు పంట్లాములు పైకి దోపుకుని మోకాలులోతు నీళ్ళలో నిలబడి తాళ్ళు పట్టుకుని పడవలను నీటిలోకి లాగుతున్నారు. అందరూ ఎండకు కమిలిపోయారు. మంచి విశాలమయిన ఎదుర్రొమ్ములు, ఇనప కాళ్ళు నెరిసిన మీసాలు! మరికొంతమంది ఎండిన కొయ్యలను, కొత్తగా పడగొట్టిన చెట్లనూ లాగుతున్నారు. ఒకచోట పడవలకు చెక్కలు బిగిస్తున్నారు. ఇంకోచోట పడవలను తలకిందులు

చేసి తారు పూస్తున్నారు. మరోచోగట సముద్రం కెరటాలకు పడవలు కొట్టుకుని పోకుండా రెల్లుకట్టలు కడుతున్నారు. ఒడ్డు పొడుగునా మంటలువేసి ఇత్తడి బానలతో తారు ఉడకబెడుతున్నారు. అనుభవజ్ఞులు, వృద్ధులు యువకులకు నేర్పుతున్నారు. నలువేపులా పనిచేస్తున్నవారి కేకలు, గల్లంతు మిన్నుముట్టాయి. ఆ తీరంతీరం సంచలనంతో, జీవకళతో ఉట్టిపడుతోంది.

సరిగ్గా ఆ సమయానికి ఒకదోనె ఒడ్డుకు చేరుకుంటోంది, అందులో ఉన్నజనం దూరంనుంచే చేతులు ఊపసాగారు. వారంతా కోసక్‌లే. కొందరు చిరిగి మాసిన దుస్తులు ధరించారు. కొంతమందికి చొక్కాలు తప్ప మరి ఒంటిమీదేంలేవు. నోట్లో పైపులు పెట్టుకున్నారు. వారి వాలకంచూస్తే ఏదో ఆపత్తుకు లోనయి అపుడే తప్పించుకుని బయటపడిన వారి లాగానూ ఒంటిమీది దంతా పెట్టి తాగేసినవారి లాగానూ ఉన్నారు. వారి మధ్యనుంచి యాభైఏళ్ళ కోసక్ ఒకడు ముందుకు వచ్చాడు. అతను పొట్టిగా బలిష్టంగాఉన్నాడు. అందరికంటె బిగ్గరగా కేకలువేస్తూ చేయి జోరుగా ఊపాడు. కాని అతని మాటలు పనివారి కేకలు గల్లంతులలో మాటు మణిగిపోయాయి.

దోనె తొందర తొందరగా ఒడ్డుకు చేరుకోగానే, "యేవిఁటి సంగతులు ?" అని కొచెవాయ్ ప్రశ్నించాడు. బాడి తలు ఉలులు పైకెత్తిన పనివారు పైకెత్తినట్టుగానే ఉండి ఆదుర్దాతో చూడసాగారు.

"చెడువార్తలు !" అని అరిచాడు దోనెలోని బలిష్టుడు.

"యేవిఁటా చెడువార్తలు ?"

"నను చెప్పమంటారా ?"

"ఊం-చెప్పు."

"లేకపోతే రాడాని సమావేశ పర్చాలా ?"

"అక్కర్లేదు. అంతా యిక్కడే వున్నాం. చెప్పు" అని జనం గుంపుగా చేరారు.

"పోలండులో జరుగుతున్న గొడవలు మీరు వినలా ?"

"అక్కడేం జరుగుతుందో చెప్పు" అని ఒక గ్రామపెద్ద అడిగాడు.

"యేవిఁటి ? తాతారువాళ్లు మీ చెవులు మూసేసా రన్నమాట !"

"సరేలే, అక్కడేం జరుగుతుందో చెపుదూ."

"మనిషి మాత్రుడు, అందులోనూ యే క్రైస్తవుడూ కనీవినీ యెరగని గొడవలు జరుగుతున్నాయి."

"అరే కుక్కల కొడకా ! అసలు సంగతేవిఁటో చెప్పేడు యీ సోదంతా యెందుకు ?" తాలిమి గోల్పోయిన ఒక కోసక్ కేక పెట్టాడు.

"మనచర్చిలే మనవి కాకుండాపోయే రోజులు వచ్చాయి."

"మనవి కాకుండా యెలా పోతాయి ?"

"వాటిని యూదులకుయిజారా యిచ్చేసారు. ముందుగా అద్దె యూదులకు చెల్లించకపోతే మనం ప్రార్థనలు చేసుకోవడానికి కూడా వీల్లేదు."

"నీ కేమయినా మతిపోయిందా ?"

"ఆ వెధవ యూదుగాళ్ళు మన పవిత్ర యూస్కరు రొట్టె మీద ముద్ర వేయకపోతే భగవంతుడికి అర్పించడానికి వీల్లేదు."

"అబద్ధం! పచ్చి అబద్ధం! అపవిత్రులయిన యూదులు పవిత్రమయిన రొట్టెమీద ముద్ర వేయడమేమిటి? ఛీ!"

"అంతేకాదు. యింకావుంది వినండి. రోమన్ ఫాదరీలు యుక్రెయిన్ అంతటా జట్కాబళ్ళల్లో తిరుగుతున్నారు. వున్నచిక్కు జట్కాల్లోలేదు. గుర్రాలకి బదులు సనాతన క్రైస్తవులచేత జట్కాలు లాగిస్తున్నారు. అంతేకాదు యింకావుంది వినండి. మన ఫాదరీల అంగీలతో యూదుస్త్రీలు గాగరాలు కుట్టించుకుంటున్నారు. యిదే యిపుడు యుక్రెయిన్‌లో జరుగుతూన్న గొడవ! మీరిక్కడ హాయిగా కూర్చుని తాగి తందనా లాడుతున్నారు. తాతారువాళ్లు మిమ్మల్ని యెంత హడలుగొట్టారంటే, మీకు కళ్లు కనిపించకుండా పోయాయి, చెవులు వినిపించకుండా పోయాయి, బయటి ప్రపంచంలో యేం జరుగుతుంతో మీకు తెలియడం లేదు."

"ఆగు, ఆగు!" అని అడ్డంకొట్టాడు కొచెవాయ్. అంత వరకు అందరితోపాటు అతనూ నేలమీదనే దృష్టి నిలిపి నిలుచు న్నాడు. క్లిష్టపరిస్థితులలో కోసక్‌లు ప్రథమావేశానికి లోను గారు. ఆలోచించి ఆలోచించి క్రమక్రమంగా కృద్ధులయిపో తారు. "ఆగు. యీముక్క చెప్పు. మీరేం జేస్తున్నారు? మీ దగ్గిర కత్తులూ కటార్లూ లేవూ? యిటువంటి అన్యాయాలని యెలా సాగనిచ్చారు?"

"యెలానా? వాళ్లు యాభై వేలమంది వున్నారు. యెవళ్ళంమట్టుకు యేంజేయగలరు? మా పాపాలు దాచి ప్రయోజనం లేదు. మన వెధవాయలే కొంతమంది వాళ్ళమతం పుచ్చుకున్నారు."

"మీ కాప్టెన్, సేనానులూ యేమయారు ?"
"వాళ్ళగతే మాకు పట్టలేదు. సంతోషిద్దాం."
"అదేవిఁటి ?"

"మా కాప్టెన్‌ని వార్సాలో యిత్తడి బానలోవేసి కయిమా వండారు. మా సేనానుల తలలు, చేతులు నరికి అందరూ చూడడానికీ సంతసంతకీ బళ్ళల్లో తిప్పుతున్నారు. యిదీ వారి గతి !"

జనం తెప్పరిల్లారు. తుపాను ముందులాగా ఎక్కడా సర్దులేదు. తరవాత హఠాత్తుగా అందరూ ఒకసారే మాట్లాడ సాగారు. ఆ తీరమంతా మాటలు కక్కుతోంది.

"యేవిఁటీ ? యూదులు చర్చిలు యిజారాకి పుచ్చుకున్నారూ ? రోమన్ ఫాదరీలు సనాతన క్రైస్తవులచేత జట్కాలు లాగిస్తున్నారూ ? యేవిఁటీ ? రష్యా గడ్డమీద యిటువంటి దురంతాలు సాగనివ్వడవేఁనా ! మన కాప్టెన్‌ని సేనానులని అలా చేయనీయడవేఁనా ? ఉహుఁ-వీల్లేదు, వీల్లేదు." జనంలో ఎక్కడ విన్నా ఇవే మాటలు.

జపరోజియేవారు క్రుద్ధమూర్తు లయిపోయారు. వారి శక్తి వారికి తెలిసివచ్చింది. ఇది ఉల్లాస పురుషుల ఉద్రేకంకాదు. ఇది దృఢమనస్కుల కోపాగ్ని, ఈ కోపాగ్నిని రగిలించడం కష్టంగాని, రగిలితే చాలా కాలం ఆరకుండా మండుతుంది.

"యూదులందర్నీ వురితీసేయండి" అని జనంలోనుంచి కేక వెలువడింది.

"మన ఫాదరీల అంగీలతో యూదుస్త్రీలు గాగరాలు కుట్టించుకోకుండా బుద్ధిచెప్పండి. మన యీస్టరు రొట్టెమీద వాళ్ళముద్ర వేయకుండా బుద్ధిచెప్పండి. పాపండులందర్నీ నీపర్ నదిలోకి తోసేయండి!"

జనంలోనుంచి ఎవరోఅన్న ఈమాటలు మెరుపులాగా అందరి మనసులలోనూ తళుక్కుమన్నాయి. యూదులందరినీ హతమార్చాలనే ఉద్దేశంతో జనం శివారులోకి బయలుదేరారు.

పాపం! యూదులకు ఉన్న కాస్త ధైర్యమూ నశించి పోయింది. ఖాళీవోడ్కా పీపాలలో, గంగాళాలలో, స్త్రీల గాగరాలలో దాగుకొన సాగారు. కాని కొసక్‌లు వాళ్ళు ఎక్కడ దాగుకున్నా పట్టి బయటికి ఈడ్చుకొనివచ్చారు."

"బాబూ! బాబూ!" అంటూ సన్నగా పొడుగుగా గడకర్రలాఉన్న ఒక యూదు ఏడుపు మొదలుపెట్టాడు. భయంతో వణికిపోయాడు. మొహం విచారంతో మునిగి పోయింది "బాబూ! వక్కమాట చెప్పనీయండి. వక్కమాట! మీరెన్నడూ విననిమాట! యెంత ముఖ్యమయిందో చెప్పడానికి కూడా వీల్లేనిమాట!"

"సరే చెప్పనీయండి" అన్నాడు బుల్బా.

ముద్దాయి చెప్పదలచింది బుల్బా వినకపోవడమంటూ ఎన్నడూ లేదు.

"బాబూ! మీవంటి పెద్దమనుషులు యింతవరకు పుట్ట లేదు. మీయంత మంచివారు, దయాపరులు, ధైర్యస్థులు, యీ ప్రపంచంలో లేరంటే నమ్మండి." భయంతో అతని స్వరం కంపించింది. మాటలు తడబడసాగాయి. "మేం మీవిషయంలో

8

దుర్మార్గానికి వడిగట్టాలని ఆలోచించడమే! యుక్రెయిన్‌లోని యిజారాదార్లు మావాళ్ళుగారు. ప్రమాణపూర్తిగా మావాళ్ళు గారు. వాళ్లు అసలు యూదులేగాదు. వాళ్లెవళ్లో యెవళ్లకి తెలుసు? వాళ్ల మొహాలమీద ఖాండ్రించి వుమ్మేసి చంపినా పాపంలేదు. యిక్కడవున్న వారంతా యీమాటే అంటారు. అవునా, షోల్మా! అంతేనా షూమన్?"

"ప్రమాణపూర్తిగా నిజం, నిజం!" అని జనంలోనుంచి షోల్మా, షూమన్ జవాబిచ్చారు, వారిద్దరి టోపీలు చినిగి ఉన్నాయి. ఇద్దరి మోహాలలోనూ నెత్తురుచుక్కంటూ లేదు.

"మీ శత్రువుకి మే మెన్నడూ అమ్ముడుపోలేదే!" అని మొదలుపెట్టాడు గడకర్రలాంటి యూదు. "యిక కాథ లిక్కులంటారా? వాళ్ళ మొహాలే మే మెన్నడూ చూసిన పాపాన పోలేదు. వాళ్ళ శ్రాద్ధం పెట్ట! మీరూ మేమూ అన్న దమ్ముల్లాంటివాళ్ళం."

"యేమిఁటీ? మీరూ మేమూ అన్నదమ్ముల్లాంటి వాళ్ళమా?" అని అరిచాడు జనంలోనుంచి ఒకడు, "ఉహుఁ- యెన్నటికీ కాం, వెధవల్లారా! వీళ్ళందర్నీ నీపర్ నదిలోకి తోసేయండి, తోసేయండి!"

ఈ మాటలు సంజ్ఞగా పనిచేశాయి. యూదుల్ని పట్టుకుని నీపర్ నదిలోకి తోసివేయసాగారు, నలువైపులనుంచీ హాహాకారాలు వినవచ్చాయి. యూదుల కాళ్ళ మేజోళ్లు, బూట్లు, సర్వమూ గాలిలో ఎగురుతోంటే కొసక్‌లు చూసి నవ్వసాగారు. అంతకు ముందు ప్రసంగించిన యూదు కోటు పట్టుకుని లాగుతూంటే విదిలించుకుని వెళ్లి బుల్బా కాళ్లు రెండూ పట్టుకుని ఏడుస్తూ మొత్తుకుంటూ, "దొరా! మీ అన్న

డొరోష్‌ని బాగా యెరుగుదును. ఆయనగారు వీరాధివీరుడు. వకమాటు టర్కీవాళ్ల చేతుల్లోంచి ఆయనగార్ని వదిలించడానికి యెనిమిదివంద లిచ్చాను" అన్నాడు.

"మా అన్నగార్ని యెరుగున్నావన్నమాట ?" అని అడిగాడు బుల్బా.

"ఆఁ - యెరక్కేం ? యెరుగున్నా. ఆయనగారు మహా వుదార పురుషుడు !"

"నీ పేరేవిఁటి ?"

"యాంకెల్."

"సరే, మంచిది" అన్నాడు బుల్బా, కొన్ని నిమషాల సేపు ఆలోచించి, కోసక్కులకేసి తిరిగి. "మనం యెపుడు తలుచుకుంటే అపుడువీడినివురితీయచ్చు. ప్రస్తుతానికినాతోవుండనీండి."

ఇలాచెప్పితారాస్ బుల్బా ఆయూదుని వెంటబెట్టుకుని వెళ్ళాడు."యిదుగోయీశకటం కిందికిదూరిపడుకో. కదలమాకు" అనియూదుకుచెప్పి, శకటాలప్రక్కనఉన్నతన కోసక్‌లతో "వీడు యిక్కడేపడి వుండేటట్టు చూడండి" అని అన్నాడు.

తరవాత చౌకులోకి వెళ్లాడు.జనం అక్కడ ఎప్పటినుంచో గుంపులు,గుంపులుగాచేరి ఉన్నారు. ఇక ఇపుడు సముద్రం మీదుగా దండ యాత్రచేయడమనే ప్రశ్నే లేదు. భూమిమీదుగా దండయాత్ర! ఇపుడు వారికి కావలసినని నావలు, పడవలుకావు, గుర్రాలుశకటాలు.అందుకనిఅందరూ నీపర్ నదిఒడ్డునుంచి వచ్చివేసారు. ముసలీ ముతకా అందరూఈదండయాత్రలో పాల్గొనాలని

ఉవ్విళ్లూరుతున్నారు.వృద్ధులూ, తండా పెద్దలు, కొచవాయ్ ఒకచే
నిశ్చయానికి వచ్చారు. సరాసరి పోలెండులోకి సేనలను నడిపించ
డం, వారి మతానికీ కోసక్ గౌరవానికీ కలిగిన అవమానానికి
హానికి ప్రతీకారం తీర్చుకోవడం, గ్రామాలకు పొలాలకు
నిప్పంటించడం, తమ పేరు ప్రఖ్యాతులు మైదానం నాలుగు
చెరుగులా వ్యాపింపచేయడం- ఇదీ వారిసంకల్పం! తక్షణం
సర్వ్వులూ కాసికోకలు బిగించిఆయుధాలు ధరించారు. కొచె
వాయ్ అమాంతం తాటిచెట్టంత ఎదిగినట్టు కనిపించాడు.
కయ్యాలమూకలు చెప్పినట్టుల్లా చేసేలొచ్చుమనిషి కాదిపుడు.
వారిపెత్తనం చెలాయించే రాజు! నిరంకుశుడు! ఆజ్ఞాపకుడు!
ఉల్లాసపురుషులూ దృఢమనస్కులు అంతాబారులుతీరి తలవంచు
కుని నిలబడ్డారు. తలఎత్తి చూడడానికి ఎవరికీ ధైర్యం కలగలేదు.
అపుడు కొచెవాయ్ నింపాదిగా తాపీగా హడావిడి లేకుండా
ప్రతిమాటా తూచితూచి పలుకుతూ ఆజ్ఞాలుజారీచేసాడు. అతను
అనేక యుద్ధాలలో కాకలు తేరినవృద్ధు. అనేక వ్యూహాలు
సమర్ధంగా పన్నినవాడు.

"ప్రతిదీబాగా పరీక్షగా చూడండి, శకటాలు,తారుగుడ్డల
విషయం జాగ్రత్తపడండి. అయుధాలుపరీక్షించండి. దుస్తులు
ఎక్కువతీసుకురావద్దు.వకొక్కడూవక చొక్కా, రెండుపంట్లాములు,
కుండెడుఅంబలి,యింకో కుండెడుజొన్నపిండిమించికూడాపట్టుకు
రావటానికి వీల్లేదు. శకటాల్లో బోలెడంత సామానువుంటుంది.
ఒకొక్క కోసక్కి రెండేసి గుర్రాలువుండాలి. నదులు చిత్తడి
నేలలు దాటడానికి రెండువందల జతల యెద్దులుకావాలి. అన్నిం
టికీ మించి క్రమశిక్షణ పాటించండి. కొల్లగొట్టడంలో దేవుడి
దయవల్ల పట్టుబట్టలు, మొఖమలు దొరికితే మీలో కొందరు

కాళ్ళకి చుట్టుకోవడానికి పీలికలుగా చించేస్తున్నారు. ఆ వెధవ అలవాటు మానేయండి. దుస్తులు వదిలేసి మంచివయితే ఆయుధాలు తీసుకోండి. వెండీ బంగారం దొరికితే వదిలి వేయకండి, ముందుగానే చెపుతున్నా, దోవలో యెవరన్నా సరే తాగితే మాత్రం వాళ్ళ అంతంచూస్తా. యెంతటి యోధుడయినాసరే, తాగితేమాత్రం రెక్కలువిరిచి శకటానికి కట్టిస్తా. కుక్కని కాల్చేసినట్టు కాల్చేయిస్తా. శవాన్ని కాకులకి గద్దలికి వేయిస్తా. అటువంటివాడికి సమాధిపొందే అర్హతలేదు. మీరు యువకులు, అన్ని విషయాల్లోనూ పెద్దలమాట వినాలి. తుపాకిదెబ్బ తగిలినా, కత్తి గీరుకుపోయినా దానిసంగతే ఆలోచించకండి. వకప్పుడు వోడ్కాలో యింత తుపాకిమందు కలిపి ఒకగుక్కలో తాగేయండి. బాగయిపోతుంది? జ్వరం గిరం రాదు. మరీపెద్ద గాయం కాకపోతే యింతమన్ను వుమ్మిలోకలిపి పట్టించండి. గాయం మానిపోతుంది. సరే, యిక అసలు వ్యవహారానికివద్దాం. అనవసరంగా హడావిడి పడకండి. ప్రతీదీ సవ్యంగా చేయండి."

ఇలా కొచెవాయ్ చెప్పిచెప్పడంతో కోసక్‌లు ఎవరి పనిలో వాళ్ళు నిమగ్నులయినారు. ఎక్కడా తాగుడు కనిపించలేదు. అందరికీ కైపు దిగినట్టయింది. అసలు కోసక్‌లు ఎన్నడూ తాగరేమో ననిపించింది.

కొంతమంది శకటాల చక్రాలు బాగుచేసి ఇరుసులు మార్చారు. కొందరు శకటాల మీద ఆహార సామగ్రి, ఆయుధాలు ఎక్కించారు. మరికొందరు ఎద్దులను, గుర్రాలను తోలుకుని వచ్చారు. గుర్రాల గిట్టల టక టకలతో, తుపాకి పరీక్ష మోతలతో, కత్తులరాపిడి ధ్వనితో, ఎద్దుల అరుపులతో, రోడ్డు మీదికి వెళ్ళే శకటాల కిరకిరలతో, కోసక్‌ల కేకలతో, శకట

చోదకుల అరుపులతో నలుదిక్కులూ పిక్కటిల్లాయి. కోసక్ ఆశ్వికదళం మైదానంమీద విస్తరించుకుంది. ఆ మూలనుంచి ఈ మూలకు పరుగెత్తాలంటే చావుదగ్గరకు వస్తుంది.

చిన్న కొయ్యచర్చిలో గురువుపీడోక్కలు ప్రార్థనలు చేసి అందరిమీద మంత్రోదకం జల్లాడు. అందరూ శిలువను ముద్దిడు కున్నారు. సేన బయలుదేరి గడీదాటిపోతోంది. జపరోజియే వాసులంతా వెనకకు తిరిగి చూసారు.

"తల్లీ, శెలవు!" అన్నారు ఒక గుక్కలో. "సకల ఆప దలనించీ దేవుడు నిను రక్షించుగాక!"

శివారులోనుంచి వెళుతూండగా తారాస్‌కు ఆ యూదు మళ్లీ కనిపించాడు. యాంకెల్ అప్పటికే దుకాణం పెట్టి చెకుముకిరాళ్ళు, తుపాకిమందు, బర్మాలు, ఒకటేమిటి దోవలో సైనికులకు కావలసినవన్నీ రొట్టెలతోసహా అమ్ముతున్నాడు. "వీడిధైర్యం మండ!" అనుకున్నాడు తారాస్. ఆ యూదు దగ్గరకు గుర్రాన్ని నడిపించుకుని వెళ్లి, "నీకేం మతి పోయిందా? యిక్కడ కూర్చున్నావేం? కాల్చిపారేస్తే యేం చేస్తావ్?" అని అడిగాడు.

దానిమీద ఆ యూదు తారాస్ దగ్గరకు వెళ్లి ఏదో రహస్యం వెల్లడిస్తున్నవాడిలాగా రెండుచేతులతోనూ సంజ్ఞచేసి అన్నాడు: "దొరా! యెవరితోనూ చెప్పకండి. మాటాడకుండా వూరుకోండి. కోసక్ శకటాల్లో నాశకటంకూడావుంది.కోసక్‌లకు కావలసిన ప్రతివస్తువా తెస్తున్నా. యింతవరకుయే యూదూ అమ్మనంత చవక ధరకు రోడ్డుమీద అమ్ముతా. దేవుడి సాక్షి!"

తారాస్ బుల్బా బుజాలు ఎగరవేసి యూదు వ్యాపార సరళికి అబ్బురపడుతూ ఆశ్వికదళాన్ని చేరుకున్నాడు.

# 5

నైరుతిపోలండు త్వరలోనే భయోత్పాతానికి ఎరఅయి పోయింది. ఎక్కడపడితే అక్కడ 'జపరోజియన్లు! అరుగో జప రోజియన్లు వచ్చిపడుతున్నారు!' అనే పుకారు వ్యాపించింది. పారిపోయి తలదాచుకోగలిగిన వారంతా పారిపోయారు. క్రమశిక్షణా రాహిత్యానికీ, నిర్లక్ష్యజీవితానికీ ఆకాలం పెట్టింది పేరు. కోటలులేవు, దుర్గాలులేవు. మడతగుడిసెలు ఉండేవి. 'యెంతోడబ్బు ఖర్చుపెట్టి, యెంతో కాయకష్టం చేసి మంచి మంచి యిళ్ళు కట్టుకుని ప్రయోజనమేమిటి? తాతారు వాళ్లు వచ్చి నేలమట్టం చేస్తారాయె!' అని ఆనాడు భావించేవారు. అందరూ పలాయనం చిత్తగిస్తున్నారు. నాగలి, ఎద్దు ఇచ్చి గుర్రాన్ని, తుపాకి తీసుకుని కొందరు సేనలో చేరిపోతున్నారు. పశువులను మైదానంమీదకు తోలివేసి మోయగలిగినంత సామగ్రి తీసుకుని కొందరు పారిపోయి దాక్కుంటున్నారు. మరికొందరు ఆయుధాలు తీసుకుని తిరగబడుతున్నారు. కాని అధికసంఖ్యాకులు పారిపోయారు. యుద్ధం మూర్తీభవించి నట్లుండే జపరోజియే సేన మహాభయంకరమయింది. పైకి చూడ డానికి వారిలో క్రమశిక్షణ కనిపించక పోయినా యుద్ధతంత్రా నికి తగిపోయిన క్రమశిక్షణ వారిలో గుంభితమయి ఉంది. అటు వంటి సేనను ఎదిరించి బతకడం అసంభవమని అందరికీ తెలుసు. కోసక్ రైతులు గుర్రాలమీద ఎక్కువ బరువు వేయకుండా,

వాటిని ఎక్కువ శ్రమ పెట్టకుండా జాగ్రత్తపడ్డారు. తక్కినవారు శకటాలవెనక నడిచి వెళుతున్నారు. సేనయావత్తూ రాత్రిపూట మాత్రమే ప్రయాణంచేస్తూ పగలు ఆ ప్రాంతంలో అమితంగా ఉన్న అడవులలో గడుపుతున్నారు. శత్రుజాడలను కనిపెట్ట డానికి ముందు గూఢచారులు, వేగులవారు వెళ్ళారు. జపరోజియే సేన తరుచు తలవనితలంపుగా వచ్చి మీదపడి హత్యా కాండ జరిపేది. గ్రామాలను దగ్ధపటలంచేసి, గుర్రాలను, పశువులను తోలుకువెళ్ళడమో అక్కడికక్కడ చంపేయడమోచేసేది. దీనిని దండయాత్ర అనడంకంటె 'మారణహోమం' అనడం మెరుగు. జపరోజియే వారు అడుగుపెట్టినచోట వారుచేసిన ఘోరకృత్యాలు చూస్తే తలవెంట్రుకలు నిక్కబొడుచు కుంటాయి. పసిపిల్లలను హత్యచేసారు. స్త్రీల వక్షోజాలు కోసి పారవేసారు. కాళ్ళచర్మాలు ఒలిచివేసారు. ఆ అనాగరిక యుగంలో ఇటువంటి దృశ్యాలు సర్వసామాన్యం! కోసక్‌లు పూర్తిగా పగ సాధించుకుంటున్నారు.

ఒకానొక మాతాధికారి కోసక్‌లు వస్తున్నారని వారి దగ్గరకు ఇద్దరు సన్యాసులను పంపించాడు. సరిగా ప్రవర్తించడం లేదనీ, శాంతిసంధిని పాటించకుండా రాజద్రోహం, చట్టాతిక్రమణా తలపెట్టారని చెప్పమని ఆ సన్యాసులకు ఆదేశించాడు.

"ఏమీ భయపడ నవసరంలేదని నేనూ మా జపరోజియేవారూ చెప్పినట్లు చెప్పు. కోసక్‌లు పైపు వెలిగించుకోవడానికి నిప్పు చేసుకుంటున్నారు, అంతే." అని కొచవాయ్ సమాధాన మిచ్చాడు.

తరవాత తొందరలోనే ఆ మఠం దవానలానికి స్వాహా అయిపోయింది. ఆకసమంటే జ్వాలాతోరణాలలో నుంచి ఆ మఠం కిటికీలు మహా భయంకరంగా గోచరించాయి.

కాందిశీకులు, సన్యాసులు, యూదులు, స్త్రీలు - గుంపులు గుంపులుగా చేరి పట్టణాలకు దారిపట్టారు. అక్కడ ప్రభుత్వసేన రక్షణ కల్పిస్తుందేమోనని వారి ఆశ. మధ్య మధ్య ప్రభుత్వం ఆలస్యంగానయినా కొద్దిపాటి సేనను వారి సహాయార్థం పంపేది. కాని జపరోజియే సేన వీరికంట పడేది కాదు. అథవా కంటపడితే ప్రథమ పోరాటంలోనే ప్రభుత్వ సేన తోకముడిచి గుర్రాలు ఎక్కి దౌడుతీసేది. పూర్వం అనేక యుద్ధాలలో విజయం సాధించిన కొందరు ప్రభుత్వ సేనానులు తమ తమ సేనలను ఏకంచేసి జపరోజియేవారిని గట్టిగా ఎదిరించాలని సంకల్పించారు.

అటువంటపుడు కోసక్ యువకులు దోపిడీలు, హత్యలు దుర్బలులయిన శత్రుసైనికులకు వదలివేసి పెద్దలకు తమశక్తి సామర్థ్యాలు చూపెట్టడానికి పోలండు సైనికులతో ద్వంద్వ యుద్ధానికి తలపడేవారు. పోలండు సైనికులు అతి సాహసికులు, డాంబికులు, గుర్రాలమీద ఠీవిగాకూర్చుని పోరాడేవారు. అలా పోరాడుతూంటే వదులువదులు అంగీచేతులు గాలిలో కదలాడేవి. కోసక్ యువకులకుయుద్ధం పసిపిల్లలఆట! అప్పటికే వారు చాలా అశ్వాలంకారాలు, విలువగల కత్తులు, తుపాకులు గెలుచుకున్నారు. ఒకనెల రోజులు గడిచేటప్పటికి ఈ పసి గుడ్డులకు రెక్కలువచ్చాయి. పురుష పుంగవులయినారు. అంత వరకు సున్నితంగా ఉన్నవారి ఆకారాలు దృఢంగా భయంకరంగా తయారయాయి. అగ్రశ్రేణిలో నిలబడిన కొడుకులను

జూచి తారాస్ బుల్బా ఎంతో సంబరపడ్డాడు: ఒస్టాప్ యుద్ధ తంత్రంలో తారాస్థాయి అందుకోవడం కోసం జన్మించాడా అనిపించేటట్టు ఉన్నాడు. ఏపరిస్థితిలోనూ తడబడకుండా, వెనకంజ వేయకుండా, ఇరవయిరెండేళ్ల యువకునిలో అసహజమనిపించే స్థయిర్యంతో, అప్పటి కప్పుడు ఆపదలను పసికట్టి తప్పించుకునే మార్గం ఆలోచించి చివరకు విజయం చేపట్టేవాడు. అతని ప్రతిచేతలో అనుభవం ద్వారా రాగలిగిన ఆత్మవిశ్వాసం గోచరించేది. ప్రతిక్రియలోనూ భవిష్యత్ నాయకుని లక్షణాలు పొడగట్టేవి. శరీరం శక్తి సామర్థ్యాలను వెడలగక్కేది. యోధ లక్షణాలు మహావీర లక్షణాలుగా పరిణమించాయి.

"బలే! మాంచి దిట్టమయిన సేనానిగా తయారవుతాడు. తండ్రినే మించిపోతాడు" అనేవాడు ముసలి బుల్బా.

కత్తుల రవళి, తుపాకీగుళ్ళ మోత ఆంద్రీని ముగ్ధుడిని చేసాయి. తన బలాన్ని అంచనా వేసుకోవడమంటూ అతనికి తెలియదు. యుద్ధంవల్ల జనించే తన్మయత్వం, మహదానందం అతనిని అంధుణ్ణి చేసాయి. ఉద్రేకంతో ఉడికిపోతూంటే, కళ్ళ ముందు ప్రతీదీ గిర్రున తిరుగుతూంటే, తలలు ఎగిరిపోతూంటే, గుర్రాలు పడిపోతూంటే, తాగినవాడిలాగా తుపాకి గుళ్ళ టప టప ధ్వనుల మధ్యగా, కత్తులతళుకుల మధ్యగా గుర్రం మీద దౌడుతీస్తూ, మీదపడే దెబ్బలను లక్ష్యపెట్టకుండా ఇరువైపులా నరుకుకుని పోతూంటే అతనికి అపరమితానందం కలిగేది. యుద్ధంమీది వ్యామోహంతో, బుర్ర ఉన్నవాడెవడూ ఎదుర్కొనని ఆపదలోకి రివ్వున పరుగెత్తి రక్తపిపాసతో యుద్ధాలలో తల నెరిసిన వారిని సహితం దిగ్భ్రాంతులను చేసే అద్భుతకృత్యాలను ఆంద్రీచేయడం చూసి

అనేక పర్యాయాలు బుల్బా ఆశ్చర్యచకితుడయాడు. ముసలి బుల్బా అలా నివ్వెరపోయి, 'వీడూ మాంచి భేషయిన సైనికుడే! దేవుడు రక్షించుగాక! ఒస్టాప్ అంతటివాడు కాకపోయినా గొప్ప సైనికుడే!' అనేవాడు.

సరాసరి డుబ్నో పట్టణంమీద దాడిచేయాలని నిశ్చయించారు. అక్కడ బాగా ధనం, ధనికులు ఉన్నారనే వదంతి ప్రబలింది. రోజున్నర ప్రయాణంచేసి జపరోజియేవారు ఆ పట్టణం చేరుకున్నారు. ఆపట్టణవాసులు శత్రువును ఇళ్ళలోనికి చొరనీయకుండా ఆఖరిక్షణంవరకు చౌకులలో, వీధులలో ద్వారాలలో ప్రాణాలొడ్డి పోరాడాలని నిశ్చయించుకున్నారు. ఆ పట్టణం చుట్టూ ఎత్తయిన మట్టిబురుజులు. బురుజులు ఎత్తుగా లేనిచోట్ల రాతిగోడో రక్షణమందిరమో సిందూరమానుకొరడో ముందుకు పొడుచుకువస్తుంది. నగర రక్షణసేన బలీయమయినదే. తమ కర్తవ్య ప్రాముఖ్యం వారికి బాగాతెలుసు. బురుజులమీద దాడి చేయాలని జపరోజియేవారు యత్నించారు గాని తుపాకిగుళ్లు ఎదురయాయి. ఆ పట్టణపౌరులు సోమారులలాగా కూర్చో లేదు. వచ్చి బురుజులమీద నిలబడ్డారు. వారి నేత్రాలలో ప్రతిఘటన దీపించింది. స్త్రీలుకూడా నగర రక్షణలో పాల్గొనాలని నిశ్చయించుకుని కోసక్ల మీద రాళ్లూ రప్పలూ, సీసాలు, కుండలు, వేడి వేడి ఇసుకసంచులు విసిరివేసారు. ఆ ఇసుక కోసక్ల కళ్ళల్లోపడి వారిని అంధప్రాయులను చేసింది.

కొచెవాయ్ సేనను వెనకకు మళ్ళమని ఆదేశిస్తూ ఇలా అన్నాడు. "మనం వెనక్కి మళ్ళుదాం. ఫరవాలేదు. యీ పట్టణంలోనుంచి బయటికి వకపురుగునయినా వెళ్ళనిస్తే నేను

క్రైస్తవుడినే కాను. యీ కుక్కలకొడుకుల్ని ఆకలితో మల మల మాడ్చి చంపేద్దాం."

కోసక్ సేన వెనకకుమళ్ళి పట్టణాన్ని చుట్టుముట్టింది. చేసేదేమీలేక చుట్టుపట్లంతా నాశనం చేయసాగారు. గ్రామాలను గోధుమ పొలాలను దగ్ధంచేసారు. ఆ సంవత్సరం పొలాలు విపరీతంగా ఫలించాయి. యింకా కోతలు కోయలేదు. గోధుమ కంకులు వేళాకోళం చేసున్నట్టు ఊగుతున్నాయి. సస్యశ్యామలంగా ఉన్న పొలాలలో మేయడానికి గుర్రపు మందలను కోసక్‌లు తోలారు. తమ జీవనాధారం ఇలా ధ్వంసమయి పోతూంటే చూసి ఆ పట్టణవాసులు తల్లడిల్లిపోయారు. పట్టణం చుట్టూ వలయాకారంలో శకటాలను నిలిపి జపరోజియేవారు గడీలోలాగానే కాలం వెళ్ళబుచ్చసాగారు. పైపులు తాగుతూ, పోరాటంలో గెలుచుకున్న ఆయుధాలను ఒకరి వొకరు బహూకరించుకుంటూ, కప్పగంతులు మొదలయిన ఆటలు ఆడుతూ, చచ్చేటంత శాంతంతో పట్టణం వైపు తేరి పార జూడసాగారు. రాత్రిళ్ళు నెగళ్లు వెలిగించేవారు. ప్రతి తండా వంటలవాళ్లు పెద్దపెద్ద ఇత్తడిబానలతో అంబలి కాయసాగారు. రాత్రంతా వెలిగే నెగళ్ళపక్క కాపలావాళ్ళు నిలబడ్డారు.

యుద్ధం జరగడంలేదు. తప్పతాగడానికి వీలులేదు. పనీ పాటాలేదు. ఇంకేం అందరికీ ప్రాణం విసుగెత్తిపోయింది. పోరాటం, సాహసకృత్యాలు లేని సమయంలో సారాకోటా రెట్టింపుచేయడం సైన్యంలో మామూలు. అలాగే కొచెవాయ్ కూడా సారాకోటా రెట్టింపుచేసాడు. అయితేనేం ఇలాంటి మందకొడి జీవితం కోసక్ యువకులకు ముఖ్యంగా తారాస్

బుల్బా కొడుకులు ఒస్టాప్ ఆంద్రీలకు బొత్తుగా నచ్చలేదు. ఆంద్రీకి పూర్తిగా విసుగెత్తిపోయింది.

"దుందుకుడు వెధవా!" బుల్బా కొడుకుతో అన్నాడు. "వోర్చుకో. నువ్వు యెప్పటికయినా ఆటామాన్‌వి అవుతావులే. భయంకర పోరాటంలో బేజారుకానివాడే గాదు, పనీపాటా లేనపుడుకూడా నిలదొక్కుకుని అన్నిటినీ వోర్చుకుని యెన్ని చిక్కుల్లోనయినా తన యిష్టాన్నే చెలాయించేవాడు కూడా గొప్పయోధుడే!"

కాని ఉడుకురక్తం యువకులకు, ముసలివారికీ ఎన్నటికీ సరిపడదు. ఇద్దరివీ వేరువేరు ప్రకృతులు. ఒకేవిషయాన్ని విభిన్న దృక్పథాలలో చూస్తారు.

ఈలోగా బుల్బా స్వంతపటాలం టోవకాచా నాయకత్వాన బయలుదేరి వచ్చి కోసక్ సేనను కలుసుకుంది. ఆ పటాలంలో ఇంకా ఇద్దరు సేనానులు, ఒక లేఖకుడు, పటాలాధికారులు, నాలుగువేలమంది కోసక్‌లు ఉన్నారు. యుద్ధం ప్రారంభమయిందని వినగానే ఐచ్ఛికంగా ఆశ్వికులుకూడా చాలామంది వచ్చి చేరారు.

ఆ సేనానులు బుల్బాకొడుకు లిద్దరికీ వారితల్లి పంపిన కొయ్యదేవతా విగ్రహాలను, దీవనలను అందజేసారు. ఆ సోదరు లిద్దరూ ఆ విగ్రహాలను మెడలలో కట్టుకుని తల్లిని తలుచుకుని విచారపడ్డారు. ఆమె దీవనలకు అర్థమేమిటి? దేనిని సూచిస్తాయి? శత్రువులను జయించి దోచుకున్న ధనంతో యశస్సుతో సుఖంగా మాతృభూమికి తిరిగివెళ్ళి వీధిగాయకులచేత కూడా కీర్తింపబడాలనేనా దీవన? లేక...? కాని భవిష్యత్తు ఎవరికీ తెలియదు.

చి త్తడినేలమీద లేచే శరత్కాలపు పొగమంచులాగా భవిష్యత్తు మానవుని కళ్ళముందు మసకమసక లాడుతుంది. ఆ పొగ మంచులో పక్షులు రెక్కలు కొట్టుకుంటూ ఒకదానినొకటి కానకుండా-డేగ పావురాయిని పావురాయి డేగను కానకుండా- గుడ్డిగా పైకీ కిందకూ ఎగురుతూ మృత్యువు ఎంత దగ్గరలో ఉందో తెలుసుకోలేవు...

ఒస్టాప్ తిరిగివచ్చి తన తండా చేరుకున్నాడు. కాని అంద్రీ హృదయం మాత్రం గడ్డకట్టుకుపోయి మహాభారంగా ఉంది. కారణం అతనికే తెలియదు. కోసక్‌లు భోజనం ముగిం చారు. సాయంకాలం ఎంతసేపటి క్రితమో గడిచిపోయింది. రాత్రి రమణీయంగా ఉంది. ఆ రమణీయ దృశ్యానికి ముగ్ధు డయి అంద్రీ కదలలేదు, పడుకుని నిద్రపోలేదు. ఆ ప్రాంతం నలుమూలలా శత్రువులనుంచి గెలుచుకున్న వివిధ వస్తువులతో, ఆహారపదార్థాలతో నిండిన శకటాలు చెల్లాచెదురుగాఉన్నాయి. వాటికింద తారుబొక్కెనలు వేలాడుతున్నాయి. శకటాల చుట్టూ కోసక్‌లు గడ్డిమీద కాళ్లుచాచుకుని సంచులమధ్య టోపీలమీద, స్నేహితులమీద తలలుపెట్టుకుని విచిత్రమయిన భంగిమాలలో నిద్రిస్తున్నారు. కత్తిని, తుపాకిని, చిన్నపైపును, తీగకుంచెను, చెకుముకిపెట్టెను కోసక్ ఎన్నడూ వదిలి ఉండడు. భారీఎడ్లు కాళ్ళుముడుచుకుని తెల్లటి పెద్దకుప్పలాగా, సులోబీ మీద చిందరవందరగా ఉండే పెద్ద పెద్ద గంద్రాళ్ళలాగా పడు కున్నాయి. నిద్రబోతున్న జనం అన్నివేపులనుంచీ గురకపెట్ట సాగారు. ఆ గురకలకు జవాబా అన్నట్లు కాళ్ళకు బందాలు వేసినందుకు మండిపడుతున్న గుర్రాలు సకిలించాయి. ఇంతలో ఆ నిశి మహోన్నతమయిన, మహాభయంకరమయిన లక్షణా

లను ఆలవర్చుకుంది. అగ్నికిఆహుతయి ఇంకానేలగూలని పొగుగు గ్రామాలవెలుగేఅది. ఒక్కొక్కచోట మంటలు మెల్లగా తీవిగా ఆకాశం అంటుతున్నాయి. ఇంకోచోట మండని వస్తువులతో తారసిల్లి సుడిగుండంలా ప్రజ్వరిల్లి మోత చేసుకుంటూ చుక్కలను అంటుతున్నాయి. జ్వాలలు ఆకసంలో ఎక్కడో అణగారిపోతున్నాయి. మొండిసన్యాసిలాగా నల్లగా పొగచూరిపోయిన మఠం మంటలుపైకెగసినపుడల్లా తన విషాదాన్ని, గొప్పదనాన్ని వెల్లడిస్తోంది. మఠానికి చెందిన తోట దగ్ధమయిపోయింది. పొగకమ్ముకుంటూంటె చెట్లుహుస్సని ధ్వనిచేసాయి. మంటలు విస్తరించిన కొలదీ వంగచాయ రేగిగుత్తులు నిగనిగలాడసాగాయి. అక్కడక్కడా పచ్చ బేరిపళ్ళకు బంగారపు చాయ అబ్బింది. వీటన్నింటి మధ్యా మఠంగోడకో చెట్టుకొమ్మకో వేలాడుతున్న యూదులను, సన్యాసులను అగ్ని మఠంతోపాటు దహించివేసింది. మంటలకు పైగా ఎంతోఎత్తున ఎగిరేపతులు కాలిపోతున్న పొలాలలోని శిలువలలాగా ఉన్నాయి.. శత్రువులు చుట్టుముట్టిన ఆ పట్టణం నిద్రిస్తున్నట్లుంది. దాని శిఖరాలు, కోరడులు, ఇళ్లు, ఇళ్ళపై కప్పులు, గోడలు దూరపుమంటల వెలుగులో మినుకుమినుకు మంటున్నాయి.

ఆంద్రీ క్లొసక్ శకటశ్రేణుల చుట్టూ ప్రదక్షిణంచేసాడు. పక్షణంలోనయినా నెగళ్ళు ఆరిపోవడానికి సిద్ధంగాఉన్నాయి. కాపలావాళ్ళు మస్తుగా తిని బండనిద్ర పోతున్నారు. వారి అజాగ్రతకి ఆంద్రీ నివ్వెరపోయి అనుకున్నాడు: "దగ్గరలో శత్రువూలేడు భయమూలేదు కాబట్టి సరిపోయింది." తిరిగి తిరిగీ ఒక శకటం మీదకు ఎక్కి తలకింద చేతులుకట్టుకుని

పడుకున్నాడుగాని నిద్రపట్టలేదు. ఆకాశంకేసి ఆర్టే పారజూ సాడు. అంతా స్పష్టంగా గోచరిస్తోంది. గాలి పరిశుభ్రంగా నిర్మలంగా ఉంది. పాలపుంతను రూపొందిస్తూ ఆకాశాన్ని చుట్టుముట్టుతున్న నక్షత్రసముదాయం వెలిగిపోతోంది. మధ్యమధ్య ఆంద్రీ కునుకుపడుతోంది. నిద్ర తేలిక పొగమంచులాగా ఆకా శాన్ని కనుమరుగుపరుస్తూ ఆంద్రీ మంత్రముగ్ధుడిని చేసింది. మళ్ళీ కొలువచ్చి అంతా నిస్పష్టంగా గోచరించింది.

సరిగ్గా ఆ సమయంలో ఒక కొత్తవ్యక్తి మొహం అతని కనులముందుతారాడింది. అదేదో నిద్రమత్తువల్ల తనకు కలిగిన భ్రమ అనీ, అప్పటికప్పుడే మాయమయి పోతుందనీ భావించు కుని కళ్ళువిప్పిచూసాడు. కుష్కించిపోయిన మొహం అతని మీదకు వంగి కళ్ళల్లోకి చూసింది. తలమీది నల్లటి ముసుగులో నుంచి కారునల్లని పొడుగాటిజుట్టు చిందరవందరగా వేలాడు తోంది. కళ్ళల్లోని ఆ విచిత్రమయిన కాంతి, కారునల్లని మొహం పిశాచాలకి తప్పితెంకెవరికీ ఉండవు, అప్రయత్నంగా ఆంద్రీ తుపాకికోసం తడుముకున్నాడు. నిలువెల్లా కంపించిపోతూ, "యెవరు నువ్వు? పిశాచానివా? వెళ్ళిపో. బతికివున్న మనిషివా హాస్యాలకిది సమయంకాదు. పో, లేకపోతే వక దెబ్బతో నిను నేలకూల్చేస్తా" అన్నాడు ఆంద్రీ.

ఈ మాటలకు జవాబుగా ఆ పిశాచం పెదవులమీద వేళ్ళు ఆనించి మాట్లాడ వద్దనిబతిమాలుతున్నట్టు సైగచేసింది. ఆంద్రీ తలవంచుకుని ఆపిశాచాన్ని ఇంకా పరీక్షగా చూడ సాగాడు. నిడుపయిన శిరోజాలనుబట్టి, మెడనుబట్టి. పూర్తి ఆచ్ఛాదనిలేని వక్షస్థలాన్ని బట్టి ఆ వ్యక్తి స్త్రీ అని గుర్తిం చాడు. ఆమె ఆ ప్రాంతం మనిషికాదు. మొహం కారునల్లగా

కృశించిపోయి ఉంది. చెంపలు లోతుకు తోసుకుపోయాయి. వెడల్పాటి బొమికలు ముందుకు పొడుచుకువచ్చాయి. కళ్ళు విల్లులుగా వంపుతిరిగి ఉన్నాయి. పరీక్షగా ఆ ఆకృతిని చూసిన కొద్దీ అది చిరపరిచిత మయిందిగా అతనికి తోచింది. ఎట్టకేలకు ఆదుర్దాతో దడాలున, "చెప్పు, నువెవరివి? నిన్నెక్కడో చూసి నట్టుందే?" అని ప్రశ్నించాడు.

"రెండేళ్ళ కితం కీవ్‌లో..."

"రెండేళ్ళ కితం కీవ్‌లోనా?..."అని ఆండ్రీ తనవిద్యార్థి జీవిత స్మృతులను జ్ఞప్తికి తెచ్చుకోసాగాడు. ఇంకోమారు పరీక్షగా చూసి హఠాత్తుగా బిగ్గరగా, "అక్కడికి వచ్చిన ఆ అధికారి కూతురు దాసివి, తాతారు దాసివి కావూ?" అని ప్రశ్నించాడు.

"ఉష్!" అంది ఆమె ఆపాదమస్తకం కంపించిపోతూ చేతులు జోడించి బతిమాలుకుంటూ. ఆండ్రీ బిగ్గరగా అన్న మాటలకు ఎవరయినా లేచారేమోనని చుట్టూ కలయజూసింది.

"యిక్కడ - యిక్కడ యెందుకున్నావ్?" చెప్పు, చెప్పు, అని ఆండ్రీ ఊపిరిబిగపట్టి ఆంతరంగికోద్రేకంతో మెల్లగా అడిగాడు. "మీ దొరసాని ఎక్కడుంది? కులాసాగా వుందా?"

"ఆమె యిక్కడే, యీ పట్నంలోనే వుంది."

"యీ పట్నంలోనా?" అని ఆండ్రీ తిరిగి బిగ్గరగా అరిచాడు. రక్తం బహువేగంగా గుండెకు పారుతోంది. "యీ పట్నంలో యెందుకుంది?"

"వాళ్ళ నాన్నగారుకూడా యిక్కడేవున్నారు. యేణ్ణర్ధంనించీ యీ పట్టణాధికారిగా పని జేస్తున్నారు."

"ఆమెకి పెళ్ళిఅయిందా? చెప్పు. నువెంత విచిత్రంగా వున్నావ్! ఆమె యెలావుంది?"

"యెలావుందా? తిండితిని రెండురోజులు అయిందు."

"యేం?"

"చాలా కాలంగా యెవరికీ కాస్త రొట్టెముక్కయినా దొరకడంలేదు. మట్టి మిగిలింది....

ఆంద్రీ నిర్ఘాంత పోయాడు,

"కోటగోడ మీదనించి మా దొరసాని మిమ్మల్ని చూసింది. నను పిలిచి చెప్పింది.

"నేను గ్నాపకంవుంటే - ఆ యోధుడిని యిక్కడికి రమ్మను. జ్ఞాపకంలేనూ మా అమ్మకి యింత రొట్టె యిచ్చి పుణ్యాం కట్టుకోమను. నా కళ్ళముందు మా అమ్మ చావు చూసి భరించలేను. నేను ముందు ఆమె వెనకా చస్తే బావుండి పోను. బతిమాలుకో. కాళ్లూ కడుపూ పట్టుకో. అతనికీ అమ్మ వుంది. ఆమె కోసమయినా మనకింత రొట్టె యిమ్మనమను"

ఆ కోసక్ యువకుని హృదయంలో పరస్పర విరుద్ధ భావాలు రగిలి మండినాయి.

"యింతకీ యిక్కడికి యెలా రాగలిగావూ?"

"నేల సొరంగం గుండా."

"నేల సొరంగం వుందా?"

"ఆఁ —"

"యెక్కడ?"

"నాకు ద్రోహం తలపెట్టవుగదా?"

"పవిత్ర శిలువ మీద ప్రమాణం చేసి చెపుతున్నా, నీకు ద్రోహం తలపెట్టను."

"సరే, ఆలోయకింద, రెల్లు పెరిగిన ఆకాలవకి అడ్డంగా"
"ఆ సొరంగం సరాసరి పట్నంలోకి తీసుకుపోతుందా?"
"సరాసరి పట్నంలోని మఠానికి తీసుకుపోతుంది."
"అయితే నడు, పోదాం."
"కాని క్రీస్తు మేరిమాతలసాక్షిగా ముందు రొట్టి ముక్క...."

"సరే మంచిది. తెచ్చిస్తాను. యిక్కడ, యీ శకటం పక్కనసుంచో. ఉహుఁ. దాంటో పడుకోవడం మంచిది. అంతా నిద్రపోతున్నారు. నువెవరికంటా పడవు. యిపుడేవస్తా."

తన తండాకు చెందిన ఆహారపదార్థాలు ఉన్న శకటం దగ్గరకు ఆంద్రీ వెళ్ళాడు. గుండె దడదడా కొట్టుకోసాగింది. గతం, ప్రస్తుతకఠోర కోసక్ జీవితాన్ని వెనకకు నెట్టివేసిన గతం తిరిగీ పయికి పొంగి ప్రస్తుతజీవితాన్ని ముంచెత్తివేసింది. సముద్రపు అఖాతంలోనుంచిలాగా ఆ అభిమానవతి ఆకారం అతని కళ్లకు కానవచ్చింది. తిరిగీ ఇంకోమారు అందమయిన ఆమె బాహువులు, కళ్లు, చిరునవ్వుచిందులాడే పెదవులు, వక్షోజాల మీద పడే నల్లటిఉంగరాల జుట్టు, తీర్చిదిద్దినట్టుండే సున్నితమయిన శరీరం అతనిస్మృతిపథంలో తళుక్కుమన్నాయి. ఉహుఁ - ఈ స్మృతులు ఎన్నడూమాసిపోలేదు. మనసులో అణగారి పోలేదు. తాత్కాలికంగా బలీయమయిన ఉద్రేకాలకుతావిచ్చాయి.అంతే! ఈ స్మృతులుతరుచుగా ఆ కోసక్ యువకునికి గాఢనిద్రా భంగం కలిగించాయా ?. అలా తరుచు మేలుకొని నిద్రపట్టక, ఎందుకు నిద్రపట్టనిదీ తెలుసుకోలేక పడిఉండేవాడా?

ముందడుగు వేస్తున్నకొలదీ అతని గుండె అతి వేగంగా కొట్టుకోసాగింది. తిరిగీ ఆమెను చూడదలచినకొద్దీ కాళ్లుగడ

గడా వణికిపోయాయి. శకటాను చేరుకున్నాడేగాని అక్కడకు ఎందుకు వెళ్ళిందీ మరిచేపోయాడు. నుదుటిమీద చేతితో రుద్దు కుంటూ, తాను వచ్చిన పనిని జ్ఞప్తికి తెచ్చుకోవడానికి యత్నించాడు. ఆమె ఆకలితో మాడిపోతున్నదనే విషయం జ్ఞాపకం వచ్చి నఖశిఖపర్యంతం భయంతో కంపించిపోయాడు. ఒకశకటం దగ్గరకు ఉరుక్కుంటూ వెళ్ళి ఇన్ని నానురొట్టెలుపట్టుకుని-చక్కా-వచ్చాడు. కాని అటువంటి ఆహారం సామాన్య రుచికి సంతృప్తి పడే కోసక్ లకే సరిపోతుందిగాని ఆసుకుమారికి తగదనే విషయం అతనికి పట్టింది. ఆ కిందటిరోజున మూడుపూట్లకు సరిపోయే గోధుమపిండి ఒకతట్టలో వాడేసినందుకు కొౘెవాయ్ వంట వాళ్ళమీద మండిపడడం గుర్తుకువచ్చింది. బానలలో తప్పకుండా బోలెడంత అంబలి దొరుకుతుందనే నమ్మకంతో తండ్రి అంబలి ముంత తీసుకుని వంటవాడి దగ్గరకు బయలుదేరాడు. ఆ వంట వాడు పదేసి కడవలుపట్టే రెండు బానలమధ్య పడుకొని నిద్ర పోతున్నాడు. బానలకింద బొగ్గులు ఇంకా మండుతూనే ఉన్నాయి. వంగి బానలలోకి చూసేసరికి ఆశ్చర్యంవేసింది. ఆ రెండు బానలలో అంబలి ఒక్కచుక్కయినా లేదు. ఆ అంబలి అంతా తాగివేయడం మానవమాత్రులకు సాధ్యంకాదు. ఇతర తండాలతో పోలిస్తే అతని తండాలో జనం తక్కువ. దాంతో ఆశ్చర్యం మరీ ఎక్కువయింది. ఇతర తండాలకు చెందిన బాన లలో చూసాడు. వాటిలోనూ ఏమీలేదు. ఒకసామెత ఉంది: 'జపరోజియే వాళ్లు చిన్నపిల్లల్లా తింటారు. కొద్దిగా ఉందీ కొద్దిగానే తింటారు. బోలెడంత ఉందీ ఒక పిసరుకూడా మిగ ల్చరు' ఈ సామెత ఆ సమయంలో అతనికి జ్ఞాపకం వచ్చింది.

ఇంకేంచేయాలి? ఎక్కడో అతని తండ్రి పటాలంలోని శకటంలో గోధుమరొట్టెల మూట ఉన్నట్టు గుర్తుకువచ్చింది. అది మఠానికి చెందిన రొట్టెల దుకాణం దోచుకున్నపుడు దొరికిన బాపతు తిన్నగా ఆహారపదార్థాల శకటం దగ్గరకు వెళ్ళాడు. మూట అక్కడ కనిపించలేదు. ఒస్టాప్ దానిని తల కింద పెట్టుకుని, నేలమీద కాళ్ళు చాచుకు పడుకుని గుర్రు కొడుతున్నాడు. ఆ గురకకు ఆ ప్రదేశమంతా ప్రతిధ్వనిస్తోంది. ఆండ్రీ ఒక చేతితో మూటను ఒడిసిపట్టుకుని ఒక్క గుంజు గుంజాడు. దానితో ఒస్టాప్ తల నేలమీద పడింది. అదిరిపడి లేచి కళ్ళుమూసుకునే కూర్చుని గొంతెత్తి బిగ్గరగా, "పట్టు కోండి, పోలిష్ వెధవని పట్టుకోండి! గుర్రాన్ని పట్టుకోండి, పట్టుకోండి!" అని కేకపెట్టాడు.

"నోరు మూసుకుని పడుండు. లేకపోతే నిను చంపే స్తాను" అన్నాడు ఆండ్రీ భయంతో మూటను అన్నకేసి విసురుతూ. కాని అంతపని చేసే అవసరం పట్టలేదు. ఒస్టాప్ కేకలు మానివేసి మళ్ళీ ఒరిగి చుట్టూ ఉన్న గడ్డి అల్లల్లాడిపోయేటట్టు గురక పెట్టసాగాడు. ఎవరన్నా ఒస్టాప్ కలవరింతలు విని మేలు కున్నారేమోనని ఆండ్రీ చుట్టూ జాగ్రతగా చూసాడు. దగ్గిరి తండాలో పొడుగాటిజుట్టు తలలేచి గుడ్లువిప్పి మళ్ళా వెంటనే నేలకు ఒరిగింది. రెండు నిమిషాలు ఆగి ఆండ్రీ ఆ మూట తీసుకుని బయలుదేరాడు. ఆ తాతారు యువతి ఊపిరి పీల్చడానికి కూడా భయపడుతూ పడుకుంది.

"ఊఁ- యికలే. అంతా గుర్రుకొడుతున్నారు. మరేం భయంలేదు. యివన్నీ నేను మోయలేకపోతే వక దొంతరన్నా

మోాయగలవా?" ఇలాఅంటూ ఆంద్రీమూట వీపుమీద వేసు కున్నాడు. తాతారు యువతిని మోాయమని రొొట్టెలదొంతర చేతిలో ఉండగానే దోవలో ఇంకో శకటంలోనుంచి జొొన్నల మూట లాగాడు. వీపుమీద బరువు వుందేమో వంగి, వరసగా పడుకుని నిద్రపోతున్న జపరోజియే వాగి మధ్యగా ధైర్యంచేసి బయలుదేరాడు.

"ఆంద్రీ!" అని పిలిచాడు బుల్బా, అతనిపక్కగా వెళు తూండగా.

ఆంద్రీకి గుండె ఆగిపోయినట్లయింది. నిలబడిపోయి నిలు వెల్లా వణుకుతూ, "యేవిఁటి?" అన్నాడు హీనస్వరంతో.

"నీతో యెవతో ఆడదివుంది, లేచి నీతోలు దొలిచేస్తా. ఆడాళ్లు నీపుట్టి ముంచేస్తారు." ఇలా అంటూ మోచేతిమీద తల ఆనించుకుని ముసుగు వేసుకున్న ఆ తాతారు యువతికేసి తేరి పార జూచాడు.

ఆంద్రీ సగంచచ్చి అక్కడే నిలబడిపోయాడు. తండ్రి మొహంకేసి చూడడానికి ధైర్యం లేకపోయింది. తలఎత్తిచూసే సరికి అరచేతిలో తలపెట్టుకుని బుల్బా నిద్రపోతున్నాడు. అంద్రీ శిలువగుర్తు వేసాడు భయం గుండెను ఆవరించింది. అంత కంటె ఎక్కువవేగంతో పైకిఉబికింది. తాతారుయువతికేసి తిరిగి చూసాడు. నిండా ముసుగు వేసుకుని నల్లరాతి విగ్రహంలాగా అతనిముందు ఆమె నిలబడిఉంది. దూరాన మండే మంటల వెలు గులో జీవకళలేని ఆకళ్ళుమాత్రం కనిపించాయి. అతను ఆమె అంగీచేతిని పట్టుకుని గుంజాడు. ఇద్దరూ అడుగడుగుకూ వెన కకు తిరిగిచూస్తూ సాగిపోయి పోయి లోతయిన లోయ సులేబీ

వెంబడే కిందికిదిగారు. అక్కడ చిన్న కాలవ పాములాగా మె
కలుతిరుగుతూ ప్రవహిస్తోంది. అందులో రెల్లు దట్టంగా పెరిగింది.
మన్ను మేటలు వేసింది.

లోయ అడుగుకు చేరుకునే సరికి జపరోజియే వారి
మకాం కనుమరుగయింది. ఆండ్రీ వెనకకు తిరిగి చూసేసరికి
ఒడ్డు గోడలాగా కనిపించింది. గడ్డిమొలకలు దానిమీద అటూ
ఇటూ కదలాడుతున్నాయి. ధగ ధగలాడే నీకారసు బంగారు
కొడవలిలాగా చంద్రుడు ఉదయించాడు. మైదానం మీదుగా
వీస్తున్న చల్లగాలి తొందరలోనే అరుణోదయం కాబోతోందని
హెచ్చరిస్తోంది. కాని ఒక్క కోడి అయినా కూయలేదు ఆ
పట్టణంలోగానీ, ఆ చుట్టుపక్కలగానీ కోడినంటూ సైన్యం
బతకనిస్తేనా! చిన్న కొయ్య మీదుగా వారు కాలవ
దాటారు. ఎదటి గట్టు ఎత్తుగానూ నిటారుగానూ, బలీయం
గానూ తోటకు రక్షణ కేంద్రంగానూ ఉంది. ఇక్కడ
బురుజులు ఎక్కువ ఎత్తుగా లేవు. ఎక్కడా రక్షణ
సేనలేదు. కాని దూరాన్నుంచి మఠంగోడ మాత్రం గోచ
రిస్తోంది. నిటారుగట్టుమీద కలుపుమొక్కలు పిచ్చిగా పెరిగాయి
గట్టుకీ కాలవకీ మధ్య ఇరుకుప్రదేశంలో మనిషిఎత్తున తుంగ
పెరిగింది. ఆ గట్టు శిఖరంమీద ఊగులాడుతూ కోరడి కనిపిం
చింది. కోరడిముందు వెడల్పాటి బర్డాక్ ఆకులు మొలిచాయి.
దాని వెనక ముళ్ళపొదలు, ముళ్ళమొక్కలు, పొద్దుతిరుగుడు
పూలు, ఇక్కడ అంతా బురద బురదగా నీటిమయంగా ఉంది.
అందుకని ఆ తాతారుయువతి కాళ్ళచెప్పులు ఊడదీసి లంగా
అంచులు దగ్గరకు తీసుకుని నడవసాగింది. తుంగలోనుంచి దారి

చేసుకుంటూ వెళ్ళి వారు చీపురుమోపులు, వంటచెరుకు మోపులు పడిఉన్న ఒక స్థలంచేరుకున్నారు. చీపురుమోపులు పక్కకి తొలగించేసరికి అర్ధచంద్రాకారపు సొరంగం పొడ గట్టింది. అది రొట్టెకాల్చే పొయ్యిమూతి కంటె వెడల్పుగా ఉంది. తాతారుయువతి తలవంచుకుని ముందుగా సొరంగంలో ప్రవేశించింది. వీపుమీది మూటకూడా పట్టడానికి వీలయినంతగా వంగి ఆంద్రీ ఆమెను అనుసరించిపోసాగాడు. పోనుపోను చీకటి వారిని చుట్టుముట్టింది.

# 6

రొట్టి మూటలు బుజానవేసుకుని ఆ తాతారు యువతి వెనకాలే ఇరుకు సొరంగం గుండా చీకటిలో తడుముకుంటూ ఆంద్రీ నింపాదిగా సాగిపోజొచ్చాడు.

"తొందర్లోనే దోవ కనిపిస్తుంది." అంది ఆ తాతారు యువతి. "నేను దీపం వదిలివచ్చిన చోటుకు చేరుకోబోతున్నాం."

నిజం! మసక మసకలాడుతున్న దీపం క్రమంగా నల్లటి మట్టిగోడల మీద కాంతిని ప్రసరిస్తోంది. ఒక చిన్న బహిరంగ స్థలానికి వారు చేరుకున్నారు. దానిని పూజామందిరంగా ఉపయోగిస్తున్నట్లు స్పష్టంగా పొడగట్టింది. గోడకు దగ్గరగా దైవపీఠంలాంటి మేజాబల్ల, ఆ మేజాబల్ల మీద కాథలిక్కు మతస్తులు పూజించే మేరీమాత చిత్రం ఉన్నాయి. కాని ఆ

చిత్రం పూర్తిగా రూపు మాసిపోయి ఉంది. ముందు వేలాడు తున్న కుందిదీపం ఆ చిత్రం మీద మసక మసక కాంతిని విరజిమ్ముతోంది. ఆ తాతారు యువతి వంగి, అంతకుముందు నేలమీద వదిలి వచ్చిన దీపం పైకెత్తింది. ఆ దీపం రాగిది, కాండం పొడుగుగా సన్నగా ఉంది వత్తి కత్తిరించడానికి కత్తెర, సవరించడానికి గుండుసూది, ఆర్పడానికి కొక్కెం గొలుసుకు వేలాడుతున్నాయి. దీపం పైకెత్తి కుంది దీపంతో వెలి గించింది. వెలుతురు ఎక్కువయింది ఒకరి వెనక ఒకరు సాగి పోయారు. అలా వెళుతూంటే గెరార్డో డెల్లానాటీ చిత్రా లలోలాగా ఆ దీపపు కాంతిలో వారు వెలిగిపోయారు. మధ్య మధ్య కారునల్లని చీకటిలో మునిగిపోయారు.

ఆరోగ్యంతో యవ్వనంతో వెలిగిపోతూ నవనవలాడే ఆ యోధుని సుందరవదనానికీ శుష్కించి పాలిపోయిన ఆ తాతారు యువతి మొహానికీ భేదం కొట్టవచ్చినట్టు కనిపిస్తోంది. దారి విశాలమయింది. ఆంద్రీ నడుం ఎత్తడానికి వీలు చిక్కింది. మట్టిగోడల కేసి జిజ్ఞాసతో చూసాడు. కీవ్‌లోని ఖనన గుహాలు జ్ఞాపకం వచ్చాయి. అక్కడి ఖనన గుహాలలో లాగానే ఇక్కడా గోడలలో గూళ్లు ఉన్నాయి. ఆగూళ్ళు కొన్నిటిలో శవ పేటి కలు, కొన్నిటిలో చెమ్మగిల్లి నుసినుసి అయిపోయిన బొమికలు ఉన్నాయి. ప్రపంచంనుంచీ దాని తుపానులనుంచీ, దుఃఖాల నుంచీ ప్రలోభాలనుంచీ తప్పించుకోవడానికి ఋషులు ఇక్కడకూడా తల దాచుకున్నారు. కొన్నిచోట్ల నేల తేమగా ఉంది. కొన్నిచోట్ల వారి కాళ్ళకిందకు నీరు వచ్చేసింది. ఆ తాతారు యువతి అడుగడుగుకూ అలసిపోతూండడంవల్ల ఆమెకు విశ్రాంతి ఈయడానికి ఆంద్రీ తరుచు ఆగిపోవలసి

వచ్చింది. కాస్త రొట్టెముక్క తిందేమో కడుపులో నొప్పి బయలుదేరింది. అడుగువేసే ముందు కొద్ది నిమిషాలసేపు కదల కుండా నిలబడవలసి వచ్చింది.

ఎలాగయితేనేం చివరకు ఒక ఇనప తలుపు వారి కంట పడింది. "అమ్మయ్య! వచ్చేసాం!" అంది హీనస్వరంతో. తలుపు కొట్టడానికని చేయి పైకెత్తిందిగాని ఓపికలేక పోయింది. ఆమెకు బదులు ఆంద్రీ తలుపు గట్టిగా కొట్టాడు. బోలుగా ప్రతిధ్వనించింది. బోలుగా ప్రతిధ్వనించిందంటే తలుపు అవతల విశాలమయిన ఆరుబయలు ఉన్నదన్నమాట. ఎత్తు గోడలనుంచి తిప్పికొట్టబడినట్లు ఆ ప్రతిధ్వని నాదంలో మార్పువచ్చింది. ఒకటి రెండు నిమిషాలలో తాళాలు గలగల మన్నాయి, మెట్లుదిగి ఎవరో వస్తున్న చప్పుడయింది. చివరికి తలుపు తెరుచుకుంది. ఇరుకు మెట్ల మీద తాళంచేతుల గుత్తి కొవ్వొత్తి పట్టుకుని ఒక సన్యాసి ప్రత్యక్షమయాడు. ఆసన్యాసి కంటపడే సరికి ఆంద్రీ అనుకోకుండానే తుళ్ళిపడి వెనకడుగు వేశాడు. ఈ కాథలిక్ సన్యాసులంటే కోసక్‌లకు పరమా సహ్యం. యూదులకన్నా వీరిని కనాకష్టంగా అమానుషంగా కోసక్‌లు చూసేవారు. ఆ సన్యాసి కూడా జపరోజియే కోసక్ కంటపడగానే తుళ్ళిపడి ఒక అడుగు వెనకకు వేసాడు. కాని తాతారు యువతి ఆతని చెవిలో ఎదో మెల్లగా చెప్పే సరికి భయంతీరింది. మెట్లమీదకు దీపంచూపి, తలుపు తాళంవేసి పైకి తీసుకువెళ్ళాడు. మఠం తాలూకు చర్చి కమానుల కిందకు వారు చేరారు. ఆ కమానులు నల్లగా, బ్రహ్మాండంగా ఉన్నాయి. దైవ పీఠం ముందు ఒక ఫాదిరీ మోకరిల్లి మృదుల

స్వరంతో ప్రార్థన చేస్తున్నాడు. అతనికి ఇరుపక్కలా ఇద్దరు గాయకులు కూడా హారతులు పట్టుకుని మోకరిల్లారు, ఆ ఫాదరీ అద్భుతలీలలు జరిగిపోవాలని భగవంతుని ప్రార్థిస్తున్నాడు. పట్టణం రక్షింపబడాలనీ, వారి స్థయిర్యం పెంపొందాలనీ, ఓర్పు ఆవహిల్లాలనీ, వారి మనసులో పిరికితనాన్ని రగిలించే భౌతిక దురదృష్టాలకు గొంతుగుకునేటట్టు చేస్తున్న ప్రలోభకుడు కంగు తినాలనీ అతని ప్రార్థన. పెనుభూతాల వంటి స్త్రీలు కూడా కొందరు అలసిపోయి తమ ముందున్న కుర్చీవీపులకు, నల్లటి కొయ్య బల్లలకు తలలు ఆనించి మోకరిలారు. కమానులకు మోపుదలగా ఉన్న స్తంభాలకు ఆనుకుని కొంతమంది పురుషులు కూడా మోకరిల్లారు. దైవపీఠం మీది మసక గాజు కిటికీ అరుణకాంతితో వెలుగొందింది. లేత ఊదా, పసుపు, కెంపు కాంతిపుంజాలు దానినుంచి నేలమీదికి పడి చీకటి చర్చికి వెలుగు ప్రసాదిస్తున్నాయి. ఆ దైవపీఠమంతా హఠాత్తుగా తళతళా వెలిగిపోయింది. హారతి పొగ మబ్బులకు ఇంద్ర చాపంలోని రంగులు పట్టాయి. చీకటిలోనుంచి ఆండ్రీ వెలుతురు కొనివచ్చిన అద్భుతాలను తిలకించాడు. సరిగ్గా ఆ సమయానికి చర్చి అంతా హఠాత్తుగా ఆర్గన్ హోరుతో మోగిపోయింది. ఆ హోరు క్రమక్రమంగా హెచ్చుతూ తగ్గుతూ పెళపెళమనే ఉరుముగా పరిణితి చెందింది. ఆ తరవాత మళ్ళీ హఠాత్తుగా ఉత్తమ సంగీతంగా రూపొంది పడుచుకన్యల మృదుమధుర స్వరంలాగా కమానుమధ్య నృత్యం చేసింది. తిరిగీ బ్రహ్మాండమైన హోరుగా ఉరుముగా మారి మాటుమణిగింది. కాని తరవాత చాలాసేపటి వరకూ కమానుల మధ్య ప్రతిధ్వనులు కంపించుతూ ప్రవహించాయి. సగం నోరు

తెరుచుకుని ఆంద్రీ ఆ ఉత్తమోత్తమ సంగీతానికి విభ్రాంతు డయిపోయాడు.

అతని అంగీఅంచు పట్టుకుని ఆ తాతారు యువతి గుంజి, "వేళయింది!" అంది.

ఎవరికంటా పడకుండా చర్చిలోనుంచి బయటి చౌకులోకి వారు ప్రవేశించారు. అరుణోదయ మయింది. ఉదయభానుని రాకను అన్నీ సూచిస్తున్నాయి. ఆచౌకు ఖచ్చితంగా నలుచదరంగా ఉంది. ఎవరూలేరు. వారంరోజుల క్రితం అక్కడ సంత జరిగి ఉంటుంది. చౌకుమధ్య ఇంకాకొన్ని దుకాణాలు ఉన్నాయి, ఆ రోజులలో రోడ్లకు కంకర వేసేవారుకాదు. బురద ఎండిపోయి కుప్పలు కుప్పలుగా పడిఉంది. చౌకుచుట్టూ రాతిఇళ్లు, మట్టిఇళ్లు ఉన్నాయి. గోడలలోని కలప చట్రాలు కిందనుంచి పైదాకా గోచరమవుతున్నాయి. అటువంటి సగంసగం కలప ఇళ్లు ఆరోజులలో సర్వసామాన్యమే. నేటికీ లిథుయేనియా, పోలండులలోని కొన్ని ప్రాంతాలలో కనిపిస్తాయి. పై కప్పులు చాలా ఎత్తు, వాటికి అద్దాలు, కంతలు అమర్చబడ్డాయి. చర్చిప్రక్కన తక్కిన ఇళ్ళకంటె విభిన్నమయిన ఒక భవంతిఉంది. బహుశా అది పుర మందిరమో, ప్రభుత్వ కార్యాలయమో అయిఉంటుంది. దానికి రెండస్తులు. దానిమీద రెండు కమానులు. కమానులమీద ఒక మంటపం. మంటపంలో పారా జవాను. కప్పులో అమర్చి గడియారం.

చౌకు స్మశానవాటికలాగా నిశ్శబ్దంగాఉంది. కాని ఆంద్రీకి వినిపించీ వినిపించని మూలుగు వినిపించినట్టనిపించింది. చుట్టూ చూసాడు. ఎదురుగా వీధి చివరన ఇద్దరు ముగ్గురు మనుషులు

కదలకుండా పడిఉన్నారు. వారు నిద్రపోతున్నారో చనిపోయారో తెలుసుకోవాలని దృష్టి నిగిడ్చి చూశాడు. సరిగ్గా ఆ సమయానికి ఏదో కాలికి అడ్డం తగిలింది. తూలిపోయాడు. తీరా చూస్తే అది ఒక స్త్రీ శవం. యూదువనిత శవమని స్పష్టమయింది. ఆమె శరీరం శుష్కించి మారురూపు పడింది. ఆకారాన్ని బట్టి కాకపోయినా ఆమె ఇంకా యవ్వనంలోనే వుందని తెలుస్తోంది. తలమీద పట్టు జేబురుమాల, చెవి తమ్మెలకు రెండు వరసలుగా ముత్యాల పూసలూ ఉన్నాయి. వాటి కిందనుంచి వచ్చి వెంట్రుకలు ఉంగరాలు తిరిగి రెండు మూడు కుచ్చులుగా మెడమీద పడ్డాయి. ఆ మెడ కూడా కృశించి ముడతలు పడి ఉంది. రక్తనాళాలు గట్టిగా బిగుసుకుపోయాయి. ఆమె పక్కనే ఒక చంటిబిడ్డ వట్టిపోయిన స్తనాలను వణుకుతూ పట్టుకుని ఉంది. పాలు లేకపోయే సరికి కోపంతో స్తనాలను మెలిపెట్టివేస్తోంది. ఆ బిడ్డ ఏడ్వడంలేదు పోరుపెట్టడంలేదు. డొక్క ఆడుతూండడం బట్టి ఇంకా ప్రాణం పోలేదని అనుకోవలసి వస్తోంది. ఆండ్రీ, ఆ తాతారు యువతి ఒక వీధిలోకి మరలారు. హఠాత్తుగా ఒక పిచ్చివాడు వారి దారికి అడ్డు వచ్చి ఆపుచేసాడు. ఆండ్రీ వీపుమీది అమూల్యమయిన మూటను చూసి ఆ పిచ్చివాడు "రొట్టె" అని పెద్దగా అరుస్తూ పెద్దపులిలాగా అతని మీదకు ఉరికి గట్టిగా పట్టేశాడు. పిచ్చికి తగిన బలంలేదేమో ఆండ్రీ ఒక్కతోపు తోసేసరికి నేలమీద కుప్పకూలినట్లు కూలిపోయాడు. మనసు కరిగి ఆండ్రీ ఒక రొట్టెముక్క విసిరివేసాడు. ఆ పిచ్చివాడు రొట్టెముక్కను పట్టుకుని పిచ్చికుక్కలా కొరుకుతూ చీల్చుతూ తినసాగాడు. కాని చాలా కాలంనుంచి తిండి అంటూ ఎరగడేమో తినీతినడంతో

అక్కడే గిలగిలా తన్నుకుని ప్రాణం వదిలాడు. అడుగడుగుకూ వారికి క్షామ దేవత విలయతాండవం గోచరించే సరికి అదిరిపోయారు. ఇళ్ళల్లో నరక యాతన అనుభవించలేక అద్భుతా వహంగా చల్లగాలికి తాపోశమనం గలుగుతుందనే ఆశతో చాలామంది వీధులలోకి వచ్చేసారు. ఒక ఇంటి గుమ్మంలో ఒక ముదుసలి స్త్రీ కూర్చుని ఉంది. ఆమె నిద్రపోతోందో, చనిపోయిందో, మూర్ఛపోయిందో చెప్పడం సాధ్యం కాదు. ఆమెకేమీ కనిపిస్తున్నట్టు లేదు, వినిపిస్తున్నట్టు లేదు. వక్షస్థలంమీదికి తల వాల్చుకుని కదలకుండా మెదలకుండా కూర్చుంది. ఇంకో ఇంటికప్పుమీదనుంచి శుష్కించి బిగుసుకుపోయిన శవం తాడుకు వేలాడుతోంది పాపం! చివరికంటూ ఆకలిబాధ భరించలేక ఉరి వేసుకుని తొందరగా చనిపోవడమే మేలని ఎంచి ఉంటాడు.

క్షామదేవత విలయ తాండవం చూసి ఆంద్రీ తాతారు యువతిని,

"ప్రాణం నిలుపుకోడానికి యేమీ దొరకలా? గత్యంతరం లేనపుడు అసహ్యించుకునే వాటితో నయినా సరే పొట్ట నింపుకోక చేసేదేముంది? నిషిద్ధమయిన వాటితోనయినా పొట్ట నింపుకోవచ్చు. యేది దొరికితే అది తినవచ్చు" అని అడగకుండా ఉండలేకపోయాడు,

"వున్నదంతా తినేయడం అయిపోయింది" అని సమాధాన మిచ్చింది తాతారు యువతి. "జంతువు లన్నింటినీ తినేయడం అయిపోయింది. ఒక గుర్రంగాని, కుక్కగాని, చివరికి యెలకగానీ పట్టణమంతా గాలించినా కనిపించదు. మేము

ఆహార పదార్థాలు నిలవ జేసుకోవడం లేదు. ప్రతిదీ గ్రామాల నుంచి వస్తుంది.''

"యిలా జనం మహాఘోరంగా చచ్చిపోతుంటే యింకా పట్టణాన్ని నిలబెట్టుకోవాలని యెలా ఆలోచిస్తున్నారు?"

"పట్టణాధికారి లొంగిపోయేవాడేగాని నిన్న వుదయం బుడ్జాక్ నుంచి సేనాధిపతి లొంగిపోవద్దని చీటీకట్టి ఒక డేగని పట్నంలోకి వదిలాడు. పట్నం రక్షించే నిమిత్తం బయలుదేరుతున్నాననీ, యింకో సేనాని కూడా రావాలి. అతనికోసం యెదురు చూస్తున్నాననీ తెలియజేసాడు. యే నిమిషంలోనయినా వాళ్ళు వచ్చేయవచ్చు...యిదిగో, యింటికి చేరుకున్నాం."

దూరాన నుంచే ఆంద్రీ ఒక ఇంటిని గమనించాడు. అది తక్కిన ఇళ్ళలాగా లేదు. బహుశా ఇటాలియన్ వాస్తుకారు డెవరో దానిని నిర్మించి ఉంటాడు. దానిని అందమయిన సన్నటి ఇటికరాళ్ళతో కట్టారు. రెండు అంతస్తులు. కింది భాగంలోని గూడుకిటికీల చుట్టూ పెద్ద పెద్ద నల్లరాతి బండలు అమర్చారు. పై అంతస్తు చిన్న చిన్న కమానుల వరుసతో ఏర్పడింది. ఈ కమానుల మధ్య అల్లికలమీద, భవంతి మూలమూలలా బిరుదు పట్టీలు అలంకరింపబడ్డాయి. రంగు ఇటుక రాళ్ళతో కట్టినమెట్లు చౌకులోకి ఉన్నాయి. అడుగుమెట్టు దగ్గర ఇద్దరు కాపలా మనుషులు కూర్చున్నారు. వారు చిత్రంగా పొందికగా ఒక చేతితో బల్లెం పట్టుకుని వేలాడిపోతున్న తలకు రెండో చెయ్యి ఆసరాగా పెట్టుకుని జీవంలేని

రాతి బొమ్మలలాగా ఉన్నారు. వారు నిద్రపోవడమూ లేదు, కలలు కనడమూ లేదు వారికి చుట్టూ ఉన్న వాటి పరిజ్ఞానమే లేనట్టు కనిపిస్తున్నారు మేడమీదకు వెళుతున్నవారి విష యమయి ఏమాత్రం పట్టించుకోవడం లేదు. పై మెట్లు దగ్గర ఆపాదమస్తకం ఆయుధాలు, మంచి విలువయిన దుస్తులు ధరించిన ఒక యోధుడు వారికి కనిపించాడు. అతని చేతిలో ప్రార్థన పుస్తకం ఉంది. అలసిపోయిన కళ్ళు ఎత్తి ఆ యోధుడు వారివంక చూసాడు. కాని ఆ తాతారు యువతి ఏదో చెప్పే సరికి అతను వారినుంచి దృష్టి ప్రార్థన పుస్తకం మీదకు మర ల్చాడు. వారు మొదటి హాలులోకి ప్రవేశించారు. ఆ హాలు చాలా పెద్దది. అది కచేరిగదిగానో ముంగిటిగదిగానో ఉపయో గపడుతూ ఉంది. దానిలోపల గోడల వెంబడే సిపా యిలు, బంట్రోతులు, వేటగాళ్ళు, మొదలయిన పరి వారం వివిధ భంగిమలలో కూర్చుని ఉన్నారు. ఉన్నత సైనిక పదవిగాని, పెద్దపెద్ద భూఖండాలుగాని ఉన్న పోలిష్ సరదారుల హోదాకు ఈ పరివారం తప్పనిసరి. కొడిగట్టిన కొవ్వొత్తి పొగరాజుతోంది. విశాలమయిన ఇనప కమ్మీల కిటి కీలగుండా ఉదయభానుని కిరణాలు వచ్చిపడుతున్నా, గదిమధ్యలో మనిషి ఎత్తు దీపస్తంభాలు రెంటిలో రెండు కొవ్వొత్తులు వెలుగుతున్నాయి.

ఆంద్రీ ఒక వెడల్పాటి సిందూరపు చెక్క తలుపు కేసి సరాసరి అడుగు వేసాడు. ఆ తలుపుమీద వంశముద్రలు, నగిషీలు అతిగా చెక్కబడి ఉన్నాయి. కాని ఆ తాతారు యువతి అతని చొక్కా చేతిని పట్టిలాగి పక్కగోడలోని చిన్నగుమ్మం కేసి

చూపించింది. వారిద్దరూ ఆ గుమ్మంగుండా నడవలోకి, నడవలో నుంచి ఇంకో హాలులోనికి వెళ్ళారు. ఆండ్రీ ఆ హాలును కుతూహలంతో చూడసాగారు. కిటికీ తలుపు సందులోనుంచి ఒక కాంతిపుంజం చూసుకువస్తూ కెంపురంగు తెరను, బంగారు మలాంతో అలంకరించిన గోడ అంచులను, గోడమీది చిత్ర పటాన్ని ద్యోతకం చేసింది. తాతారు యువతి ఆండ్రీని అక్కడే వేచిఉండమని సంజ్ఞ చేసి తలుపు తెరుచుకుని ఇంకో గదిలోనికి వెళ్ళింది. ఆ గదిలోనుంచి కొవ్వొత్తు కాంతి ప్రసరిస్తోంది. అతనికి గుసగుసలు మృదుమధురస్వరం వినిపించాయి.లోలోపల వణికి పోయాడు. సగం తెరిచిన తలుపు సందులోనుంచి ఒక స్త్రీ రమణీయరూపం పొడగట్టింది. ఆమెచేయి ఒకటి ఎత్తుకుని ఉంది. ఆ చేతిమీద పొడుగాటి సొగసయిన జడ వేలాడుతోంది. ఆ తాతారు యువతి తిరిగివచ్చి ఆండ్రీని లోపలికి రమ్మని పిలిచింది. ఎలా ఆ గదిలో ప్రవేశించాడో, తలుపు ఎలా మూత పడిందో అతనికి జ్ఞాపకం లేదు.

ఆ గదిలో రెండు కొవ్వొత్తులు వెలుగుతున్నాయి. ఒక దేవతా విగ్రహం ముందు దీపం మినుకు మినుకు మంటోంది. ఆ విగ్రహానికి దిగువున ప్రార్థన చేసేటపుడు వంగడానికి వీలుగా మెట్లతో కూడిన పొడుగాటి మేజాబల్ల ఉంది. కాని అతనికి వీటిని చూడాలనే ఇచ్ఛ కలగలేదు. వీటి నుంచి దృష్టి మరలించాడు. ఒక స్త్రీ కనిపించింది. హఠాచ్చలనం మధ్య ఆమె గడ్డకట్టుకునే పోయిందో రాయే అయిపోయిందో అనిపించింది. అతనివేపుకు దూకబోతుంటే శరీరమంతా ఆపివేయబడినట్లుంది. అతనూ చకితుడయి ఆమె ముందు నిలబడ్డాడు. ఆమె అలా ఉంటుందని అతను ఎన్నడూ తలపోయ

లేదు. పూర్వం అతను ఎరిగిన బాలిక కాదామె. సాపత్యమే లేదు. ఇదివరలో చూసినప్పటి కంటె రెట్టింపు అందంగా, రెట్టింపు ఆకర్షణీయంగా ఉంది. అప్పుడు ఆమెలో ఏదో అసంపూర్ణత ఉంది. ఇప్పుడో చిత్రకారుడు కుంచెతో ఆఖరిసారిగా తీర్చిదిద్దిన దివ్యచిత్రంలా ఉంది. పూర్వం ఆమెలో చాపల్యం ఎక్కువగా ఉన్నా మనోహరంగా ఉండేది. ఇక ఇప్పుడో ఆమె సౌందర్యం వికసించింది. పైకెత్తిన కళ్ళు పరిపక్వమయిన భావాలతో ప్రకాశిస్తున్నాయి. ఆ భావాలు సూచనప్రాయంగా లేవు. ప్రపూర్ణతను చెందాయి. ఆ కళ్ళలో నీళ్ళు ఇంకా ఇంకిపోలేదు. ధగ ధగలాడుతూ కంటికి తెరగా ఏర్పడి చూసేవారి హృదయానికి సూటిగా తాకుతున్నాయి. ఆమె వక్షఃస్థలం, మెడ, బుజాలు అతి సుందరంగా ఎదిగినాయి. పూర్వం ఆమె జుట్టు ఉంగరాలు ఉంగరాలుగా ఆ మొహం చుట్టూ ఎగురుతూండేది. ఇప్పుడో ఒత్తుగా, సొగసుగా పెరిగింది. కొంత జడగా అల్లి ముడి వేయబడింది. తక్కినది వదులు వదులుగా వక్షస్థలంమీద పడి గోళ్ళవరకు విస్తరించుకుంది. ఆమె స్వరూపమే మారిపోయినట్లు కనిపించింది. స్మృతి పథంలో వెంటాడుతున్న పోలిక ఒకటయినా కనిపిస్తుందేమోనని ఆంద్రీ యత్నించి చూసాడు. కాని ఒక్కటీ గుర్తుకు రాలేదు! ఆమె శరీరకాంతి తరిగి పాలిపోయింది. కాని అంతమాత్రాన ఆమె అందానికేమీ కొదువ రాలేదు. పైగా తీక్షణత చేకూరింది. పురుషులను దాసులను చేసుకుని విజయం చేపట్టే శక్తి అలవడింది. ఆంద్రీ హృదయం భయంతో కంపించిపోయింది. మంత్రముగ్ధుడిలా ఆమె ముందు నిలబడ్డాడు, ఈ కోసక్ యువకుడు కంటబడేసరికి ఆమెకూడా ఆశ్చర్యపోయింది. నిండుయవ్వ

నపు సర్వసౌందర్యంతో, శక్తితో ఆమెముందు అతను ప్రత్యక్షమయాడు. భారీకాయ మయినా కదలికలో సౌలభ్యం, ఎవరినీ లక్ష్యపెట్టని స్వేచ్ఛా గోచరించాయి. దృష్టి నిలకడగా, తళతళా మెరిసిపోతోంది. మెత్తటి కనుబొమలు విల్లులాగా వంగాయి. ఎండకు కమిలిన చెంపలు యవ్వన జ్వాలలతో ప్రకాశిస్తున్నాయి. నల్లటి నూనూగు మీసాలు పట్టులాగా నిగనిగ లాడుతున్నాయి.

"ఉపకృతజ్ఞత తెలిపే శక్తికూడా నాకులేదు, దయామయా!" అంది. వెండిలా మోగే గొంతు వణికింది. "భగవంతుడే నిన్ను బహూకరిస్తాడు అశక్తురాలను నేనేం చేయగలను?"

దృష్టి కిందకు బరపింది. రెప్పలు అరమూత పడ్డాయి. పక్ష్మాలు బాణాకృతి దాల్చాయి. ముందుకు వంగిన ముద్దు మొహంలో సిగ్గు దొంతరలు వ్యాపించాయి. ఆంద్రీ నోట మాటలు పెగలలేదు. మనసులో మరిగేదంతా వెళ్ళగక్కేదామని కాంక్షించాడు. కాని లాభం లేకపోయింది. ఏదో గొంతుకు అడ్డు పడింది. మాట చిటుక్కుమనలేదు. ఇటువంటి మాటలకు జవాబు చెప్పడం తనకు, పాఠశాలలో పెరిగిన తనకు, ఒకచోట నిలవకుండా దిమ్మరి సిపాయి జీవితం గడిపే తనకు సాధ్యం కాదని తోచింది. అతనిలోని కోసక్ స్వభావాన్నే నిందించుకో సాగాడు.

ఇంతలో ఆ తాతారు యువతి గదిలోకి చల్లగా వచ్చింది. ఆ యోధుడు తెచ్చిన రొట్టెను ముక్క ముక్కలుగా కోసి బంగారు పళ్లెంలో పెట్టి తీసుకువచ్చి యజమానురాలి ముందు పెట్టింది. ఆ సుందరి తాతారు యువతికేసీ, రొట్టెకేసీ తేరిపారజూసి, ఆ తరవాత ఆంద్రీవంక దృష్టి బరిపింది. ఆ

కళ్ళలో ఒక భావజగత్తు నిబిడీకృతమయి ఉంది. ఆమె అనుభవిస్తున్న బాధలను, ఉద్వేగాలను వెల్లడించలేని అశక్తతను ద్యోతకం చేసే ఆ చూపుతోని అర్థం ఆంద్రీకి మాటలలో కంటె ఎక్కువగా గ్రాహ్యా మయింది. మనసు తేలిక పడింది. అతనిలోని సర్వమూ స్వేచ్ఛను పొందింది. అంతవరకూ ఏదో నిగూఢ హస్తపు గుప్పిటలో చిక్కుకున్న అతని మనసులోని భావాలు, ఉద్రేకాలు కట్టలు తెంచుకుని వాగ్రూపంలో నిర్ఝురీ వేగంతో ప్రవహించడానికి ఆతుర పడ్డాయి. కాని ఆ సుందరి హఠాత్తుగా తాతారు యువతికేసి తిరిగి ఆదుర్దాగా, "మాఅమ్మ సంగతేమిటి ? ఆమెకీ కాస్త రొట్టెముక్క తీసుకునివెళ్ళి యిచ్చివచ్చావా ?" అని అడిగింది.

"నిద్రపోతోంది !"

"మా నాన్నకి యిచ్చావా ?"

"ఆఁ-యీ యోధునికి కృతజ్ఞత తెలపడానికి స్వయంగా ఆయనే వస్తామన్నారు."

ఆ సుందరి రొట్టెముక్క ఒకటి తీసుకుని నోటిలో పెట్టుకోబోయింది. ముక్తాయమానమయిన వేళ్ళతో రొట్టెముక్కను తుంపి తింటుంటే వర్ణింపనలవిగాని ఆనందంతో ఆంద్రీ చూడసాగాడు. కాని పిచ్చిఆకలి వేసి రొట్టెముక్క మింగీ మింగడంతో తనకళ్ళముందే మరణించిన వ్యక్తి ఆంద్రీకి హఠాత్తుగా జ్ఞాపకం వచ్చాడు. మొహం వెలవెల బారింది. ఆమె చేయిపట్టుకుని "చాలు ! యిక తినకు ! తిని చాలాకాల మయింది. తిండి విషంగా పరిణమిస్తుంది" అని బిగ్గరగా చెప్పాడు. అణకువగల బిడ్డలాగా ఆమెచేయి కిందకి జారవిడిచి అతని కళ్ళల్లోకి

చూసింది. మాటలకే వారి భావాలను ద్యోతకంచేసే శక్తి ఉంటేనా! ఊహుఁ- లేదు. ఉలికిగాని, కుంచెకుగాని, మహోప న్యాసానికిగాని ఆకన్నె కళ్ళల్లోని భావాలనుగాని, ఆ కళ్ళల్లోకి చూసే ఆ పురుషుని భావాలనుగాని ద్యోతకంచేసే శక్తిలేదు.

"ఓ రాణీ!" అని అరిచాడు ఆంద్రీ, ఉద్రేకం అతని మనసులోనుంచి, ఆత్మలోనుంచి, శరీర మంతటిలోనుంచి పొంగి పొరలసాగింది. "నీకేం కావాలి? నీ కోరిక యేమిటి? ఆజ్ఞా పించు. ప్రపంచంలోకల్లా అసాధ్యమయిన పని నా నెత్తినపెట్టు. ప్రాణం ఒడ్డిఅయినా దానిని సాధిస్తాను. అవును సాధిస్తాను. నీకోసం మరణించడం ప్రమాణ పూర్వకంగా చెప్తున్నా కమ్మగా వుంటుంది, యెంతకమ్మగా వ్పంటుందో చెప్పలేను! నాకు మూడు గ్రామాలున్నాయి. మా నాన్నగారి గుర్రపు మందలో సగం నావే. మాఅమ్మ అరణంగా తెచ్చింది. మా నాన్నకు తెలియనీయకుండా రహస్యంగా దాచిందీ నాకే. అంతానాకే. నా ఆయుధాలవంటి ఆయుధాలు ఏ కోసక్కీ లేవు. ఒక్క నా కత్తిపిడితో వుత్తమ రకం గొడ్ల మంద, మూడువేల గొర్రెలు కొనవచ్చు. నీ నోటివెంట ఒక్క మాట వెలువడితే చాలు, చక్కటి నీ నల్ల కను బొమలు ఒక్కసారి కదిలితే చాలు, వీటన్నిటినీ కాలదన్నే స్తాను, విసిరి పారేస్తాను, తగలబెట్టిస్తాను. నీళ్ళల్లో ముంచే స్తాను, నేను తెలివితక్కువగా మాట్లాడుతూండవచ్చు, మాట్లాడ డానికీయిది తగిన సమయం, స్థలం కాకపోవచ్చు, నేను విద్యా లయంలో చదివాను. జపొరోజియన్ల మధ్య జీవించాను. అటు వంటపుడు రాజులలాగా, సంస్థానాధీశులలాగా, యోధ శిఖా మణులలాగా మాట్లాడడం నాకు చేతకాదు. నువు మాలాంటి

దానవు కావు గొప్పవాళ్ళ భార్యలు, కూతుళ్ళు నీ కాలిగోటికి సరిరారు. మేము నీ దాసీసలుగా వుంటానికి కూడా తగం. స్వర్గలోకంలోని దేవకన్యలే నీకు సేవచేయడానికి తగినవారు."

ఆశ్చర్యం ఇనుమడిస్తూంటే నిలువల్లా చెవులు చేసుకుని ఒక్క మాటకూడా జారకుండా ఆ యువకుని ఉద్రేకపూరిత మయిన ప్రసంగం ఆమె విన్నది. అతని నిండు యవ్వనపు మహోత్సాహ శక్తిని ఆ ప్రసంగం అద్దంలాగా ప్రతిఫలింప జేసింది. ఆ ప్రసంగంలోని ప్రతిమాటా అతని హృదయ గహ్వరంలోనుంచి సూటిగా దూసుకువచ్చి ఘంగున మోగింది. అందమయిన మొహం అతనికేసి తిప్పి, ఉంగరాల జుట్టును వెనకకు తోసుకుని, అతనివంకే నోరు తెరుచుకుని అదేపనిగా తేరపారజూసింది. తరవాత మాటాడబోయి ఆ యువకుడు జప రోజియే వాడనీ, అతని తండ్రి, సహోదరులు, దేశప్రజలు అతని వెనక నిలచి తీవ్రంగా పగతీర్చుకోవాలని చూస్తున్నా రనీ, పట్టణాన్ని చుట్టుముట్టిన జపరోజియేవారు రాక్షసుల లాంటి వారనీ, లోపలివారందరూ మృత్యుముఖంలో పడ్డారనీ జ్ఞాపకం వచ్చి తటాలున ఆగిపోయింది. హఠాత్తుగా ఆమె కళ్ళల్లో నీళ్లు నిండిపోయాయి. పట్టుబుట్టాలు కుట్టిన జేబురు మాలు తీసి మొహం మీద కప్పుకుంది. ఒక్క నిమిషంలో రుమాలు తడిసిపోయింది. అందమయిన తల,వెనకకు, తోసుకుని, అందమయిన కిందిపెదవిని తెల్లటి పళ్ళతో నొక్కుకుంటూ, విషసర్పం కరచినదానిలాగా చాలాసేపు కూర్చుంది. కలత పెడుతున్న దుఃఖాన్ని అతను కనిపెడతాడేమోనని మొహం మీదనుంచి రుమాలు తీయలేదు.

"ఒక్క మాట మాట్లాడు!" అని ఆంద్రీ ఆమె మృదు హస్తం పట్టుకున్నాడు. ఆ స్పర్శకు అతని రక్తనాళాలలో అగ్ని ప్రజ్వరిల్లి ప్రవహించింది. అతని చేతిలో మోడులాగా ఉన్న అమె చేతిని నొక్కాడు.

మొహంమీదనుంచి రుమాలు తీయకుండా కధలకుండా మెదలకుండా ఆమె కూర్చుంది.

"యెందుకు అంత విచారంగా వున్నావ్? చెప్పు. యెందుకు అంత విచారంగా వున్నావ్?"

జేబురుమాలును విసిరి పారవేసి, కళ్లమీద పడిన జుట్టును పక్కకు తొలగించుకుని, మెల్లగా ప్రశాంతంగా విచారంగా ప్రసంగించ సాగింది. రమణీయ సాయంసంధ్యలో ఈ విధంగానే లేచినపిల్లతుమ్మెద ఒత్తుగా పెరిగిన తుంగ గుండా సంచరిస్తూంది. విషాద ధ్వనులు మృదువుగా ముర్మర మంటాయి, గుసగుసలు పోతాయి. గలగల లాడతాయి. కాని దారిపోయేవారు అనిర్వాచ్యమయిన విషాదంతో తారాడుతూ చెవులు దోరచేసు కుని వింటారు. అస్తమయ సూర్యుని గమనించరు. పొలాలలో కోతపనులు చేసుకుని తిరిగివస్తూ గ్రామస్తులు హుషారుగా పాడే పాటలనుగాని, దూరానపోయే బండీ దడదడ శబ్దాన్ని గాని లక్ష్యపెట్టరు.

"దయ జూపడానికి తగిందాన్ని కానా? నన్ను కన్న తల్లి యేం సుఖపడుతోంది. నా అవస్థ యింతా అంతా కాదు. ఓ క్రూరవిధీ! యెందుకు ననిలా నిర్దాక్షిణ్యంగా వేధిస్తావు? గొప్పగొప్ప సంస్థానా ధీశులను, ధనరాసులతో తులతూగే ప్రభు వులను, జమిందారులను నా పాదాలముందు మోకరిల్లేటట్టు

చేసావు. వారంతా నను ప్రేమించారు. నా ప్రేమను వారంతా వరప్రసాదంగా స్వీకరించేవారు. వేలు కదిపితే చాలు అందంలో, పుట్టుకలో అందరికంటె గొప్పవాడు నన్ను వివాహ మాడే వాడు. కాని ఓ హతవిధీ! వారిలో ఏ ఒక్కరిమీదా నా మనసు లగ్నం కాకుండా మంత్రించావు. మా దేశంలోని మహావీరుల మీదకాకుండా ఒక అపరిచితునిమీద, మా శత్రువు మీద, నా మనసు లగ్నమయేటట్టు చేశావు. నేనేం పాపం చేసాను, మేరీమాతా! యేంపాపం చేసానని, యే మహానేరం చేసానని యింత నిర్దాక్షిణ్యంగా, నన్ను శిక్షిస్తున్నావు? నా రోజులు సిరిసంపదలతో, సర్వసౌభాగ్యలతో గడిచిపోయాయి. మాంచి రుచిగల ఆహార పదార్ధాలు, తియ్యతియ్యని మద్యం సేవించాను. యిదంతా యేవిఁటి? చివరికి జరిగేదేవిఁటి? వెధవ ముష్టివాడికి కూడా సంభవించని దారుణపుచావు చావడమేనా? యింతటి దురవస్థకు పాల్పడడం చాలదన్నట్టు, నా కళ్ళముందరే నాతలి దండ్రులు ఘోరనరకం అనుభవించి చచ్చిపోవాలా? నా తలదండ్రులకోసం నా ప్రాణాలు బలిపెట్టడానికి సిద్ధంగా వున్నానే! యిదంతా యింకా చాలదన్నట్లు ప్రాణం పోయే ముందు యెన్నడూ కలలోనయినా వినని మాటలు వినవలసి వచ్చింది. ఆ కలలోనయినా యెరగని ప్రేమను యెరగవలసి వచ్చింది. ఆ మాటలువింటూంటే నా హృదయం వ్రచ్యలు కావ లసింది. యింత చిన్నవయసులో చనిపోతున్నందుకు విలపించాలి. నా చావు యింకా ఘోరంగా కనిపిస్తుంది. చస్తూ, చస్తూ క్రూరవిధీ! నిన్ను నిందించాలి. నా పాపాలను క్షమించు మేరీ మాతా!"

ఇలా అని మౌనం వహించేసరికి ఆమె మొహంలో నిరాశా నిస్పృహలు ద్యోతక మయాయి, గుండెను చీలుస్తున్న దుఃఖం ఆమె ఆకృతి అంతటా కానవచ్చింది. విచారంతో వంగిన కనుబొమలు, కిందచూపులు మొదలు, ధగధగా మెరిసే చెంపలమీద తారాడి ఎండిపోయిన కన్నీళ్ళవరకు అన్నీ "సుఖపడేయోగం లేదు" అని చెపుతున్నట్లున్నాయి.

"అటువంటిది యెన్నడూ వినియెరగం" అన్నాడు ఆంద్రీ. "ఉహుఁ- అలా జరగడానికి వీల్లేదు. దేవతముందు మోకరిల్లినట్లు ప్రపంచంలోని పుత్తమోత్తములు మోకరిల్లడానికి జన్మించిన యీ మహాసౌందర్యవతికి అటువంటి దారుణపు గతి పట్టడానికి వీల్లేదు. ఉహుఁ- నువు చావడానికి వీల్లేదు: వీల్లేదు. నీలాంటి మనిషి చావకూడదు. ప్రమాణపూర్తిగా చెపుతున్నాను. నిను చావనీయను. కాని అలా జరగవలసివస్తే - నా శక్తిగాని, నా ప్రార్ధనలుగాని, నా ధైర్యసాహసాలుగాని పనిచేయకపోతే మనిద్దరం కలిసే చనిపోదాం. ముందు నేను చనిపోతాను. నీకంటెముందు, నీ పాదాలదగ్గిర చనిపోతాను. మృత్యువు ఒకటే యిక మనలను విడదీయగలదు."

"నన్ను మోసగించవద్దు, నిను నీవు మోసగించుకోవద్దు. యోధుడా!" అంది ఆ యువతి మెల్లగా అందమయిన తల ఆడిస్తూ, "నాకు తెలుసు. నువు నన్ను ప్రేమించలేవని తెలుసు. అదే నాకెంతో విచారం గొలుపుతోంది. నీ కర్తవ్యం యేమిటో నీ మతంయేమిటో నాకు తెలుసు. మేము మీ శత్రువులం. నీ తండ్రి, నీ స్నేహితులు, నీదేశం నిన్ను పిలుస్తారు."

"నా తండ్రితో స్నేహితులతో దేశంతో నాకేం నిమిత్తం" అన్నాడు ఆంద్రీ.గబగబా తల ఆడిస్తూ. నదీతీరం

మీది బూరుగుచెట్టులా నిటారుగా నిలబడ్డాడు. "అంతవరకు వస్తే, వారి మొహమే నేను చూడదలుచుకోలేదు. చూడదలు చుకోలేదు." అన్నాడు అదే స్వరంలో, అదే వైఖరిలో. ఆ వైఖరి, ఎవరికీ సాధ్యంకాని ఎన్నడూ కనివిని ఎరగని సాహస కార్యం చేయడానికి నిశ్చయించుకున్న కోసక్ యోధుని ధైర్య స్థయిర్యాలను వెల్లడిస్తుంది. "యుక్రెయిన్ నా దేశమని యెవరు చెప్పారు? యెవరు యిచ్చారు? మన ఆత్మ కాంక్షించేదే, మన దేశం! మన ప్రేమకు పాత్రమయి నదేమనదేశం! నువ్వు - అవును నువ్వే నా దేశానివి! ఆ దేశాన్నే నా హృదయంలో పదిలపర్చుకుంటాను. బతికివున్నంతవరకు పదిలపర్చుకుంటాను. దానిని నా హృదయంనుంచి వేరుచేయ చూస్తే యే కోసక్ నయినాసరే యెదిరిస్తాను. ఆ దేశం కోసం నా సర్వస్వమూ అర్పిస్తాను, నా అన్నదంతా నాశనం చేసేస్తాను."

ఆమె ఒక్క నిమిషం రాయి అయిపోయింది. సుందర విగ్రహం అయిపోయింది. అతని కళ్ళల్లోకి తేరిపారజూసి హఠా త్తుగా కన్నీరు పెట్టుకుంది. స్త్రీజన సహజమయిన అమితో ద్రేకంతో అతని మెడమీద వాలి తెల్లటి చేతులతో అతనిని ఆలింగనం చేసుకుని బిగ్గరగా వెక్కి వెక్కి ఏడ్చింది.

సరిగా ఆ సమయానికే వీధిలోనుంచి చెవులు గింగురు మనే అరుపులు, బాకా నగారా శబ్దాలు వినవచ్చాయి. కాని అతనికి మాత్రం ఏమీ వినిపించలేదు. అందమయిన ఆమె పెద వులు మధురోష్ణ నిశ్వాసంతో తనను ముంచెత్తడం, తన మొహం మీద ఆమె కన్నీరు కాల్వలు కట్టడం, సువాసనలు

విరజిమ్మినట్లు మె_త్తటి జుట్టు తనను కప్పివేయడం మాత్రమే అతనికి తెలుసు.

ఆ తాతారు యువతి పరుగెత్తుకుంటూ సంతోషంతో కేకలు పెడుతూ వచ్చింది. "అమ్మయ్యా! రక్షింపబడ్డాం! రక్షింప బడ్డాం! "అని ఒడలు తెలియకుండా అరిచింది. "పట్నంలోకి మన సేనలు ప్రవేశించాయి. ధాన్యం, జొన్నలు, గోధుమపిండి, జపరోజియే ఖై_దీలను పట్టుకు వచ్చారు."

కాని పట్నంలోకి ఎవరి సేనలు ప్రవేశించిందీ, కూడా ఏమి తీసుకువచ్చిందీ, ఖై_దీలుగా ఏ జపరోజియన్లు పట్టు బడిందీ వారికి వినిపించలేదు. లౌకిక ప్రపంచంలో అనుభూతికి రాని భావసముద్రంలో మునిగి ఆంద్రీ తన చెంపలను స్పర్శిం చిన తియ్యని ఆ పెదవులను ముద్దాడాడు. ఆ పెదవులూ అతనిని నిరాకరించలేదు. తిరిగీ ముద్దిడుకున్నాయి. వారిద్దరూ ఒకరి నొకరు ముద్దిడుకుని మానవులకు జీవితకాలంలో ఒకే ఒక సారి లభించే పరమానందం అనుభవించారు.

ఆ కోసక్ పతనమయి పోయాడు! కోసక్ యోధులకు దూరమయి పోయాడు. ఇక అతను ఎన్నడూ జపరోజియే చూడడు. తండ్రికి చెందిన గ్రామాలకు గాని, పూజించే దేవుని చర్చికి గాని తిరిగి వెళ్ళడు. యుక్రెయిన్ తనను రక్షించడానికి నడుం కట్టిన ఈ మహా ధై_ర్యశాలిని ఇంక చూడబోదు! ముసలి తారాస్ నడినె_త్తి సిగలోనుంచి నెరసిన వెంట్రుకలు నాలుగు పీకి తనకు అవమానం తెచ్చిపెట్టిన కొడుకుజన్మ నక్షత్రాన్ని నిందిస్తాడు!

# 7

జపరోజియేవారి మకాంలో గందరగోళం బయలుదేరింది. పట్టణంలోనికి సేనలు ఎలా ప్రవేశించాయో మొట్టమొదట ఎవరికీ అర్థంకాలేదు. పట్టణంపక్క ద్వారాలదగ్గర మకాం చేసిన పెరెయస్లావ్ తండావారు తప్పతాగి పడివున్నారని తరవాత తరవాత బయట పడింది. ఏం జరుగుతోందో గ్రహించేసరికి సగం మంది శత్రువుల చేతిలో చావడం సగంమంది ఖైదీలుగా పట్టుబడడం ఎవరికీ ఆశ్చర్యం గొలపలేదు. ఇరుగుపొరుగు తండావారు ఈ గల్లంతుకు మేలుకుని ఆయుధాలు తీసుకునేసరికి శత్రుసేనలు ద్వారాలగుండా పట్టణంలో ప్రవేశించాయి, చిందర వందరగా వారివెనక పడిన జపరోజియేవారు నిద్రమత్తులో, సగం ఎరకలో ఉన్నారేమో తుపాకులతో శత్రువులను వెనకకు తరిమివేశారు. కొచెవాయ్ అందరినీ సమావేశ పర్చాడు. అందరూ వలయాకారంగా, నిశ్శబ్దంగా తలమీది టోపీలు తీసివేసుకుని నిలబడగానే అతను అన్నాడు :

"సోదరులారా! నేటిరాత్రి యేం జరిగిందో చూసారుగా! తాగుడు దేనికి దారితీసిందో తెలిసిందా! శత్రువు మనల్ని యెలా అవమానించాడో చూసాదుగా! అటువంటి వాళ్ళం మనం! వోడ్కా రెట్టింపు యిస్తే, పీకలదాకా తాగేసారు. క్రైస్తవ యోధులకు శత్రువులయినవారు మీ లాగూలు లాగేసి, మీ మొహంమీద ఉమ్మివేసినా మీకు తెలిసిచావదు."

నేరం చేసామనే పరిజ్ఞానంతో కోసక్‌లు అందరూ తలలు వంచుకుని నిలబడ్డారు. నెజమూాయ్ తండా నాయకుడు కుకు బెంకోమాత్రం ఇలా జవాబిచ్చాడు:

"బాట్కో ఆగు" అన్నాడు. "సేన అంతటిముందూ కొచెవాయ్ మాట్లాడినపుడు తిరిగి జవాబివ్వడం మన చట్టానికి వ్యతిరేకమయినా నువు చెప్పింది సరిగా లేదు కాబట్టి నేను మాట్లాడవలసి వచ్చింది. యీ క్రైస్తవ సేనను నిందించడం బాగుండలేదు. దాడి వెడలేటపుడుగాని, యుద్ధం చేసేటపుడు గాని, యేదయినా దుష్కరమయిన కార్యభారం వహించినపుడు గాని తాగితే వారు నేరస్తులే. మరణ దండన విధించడానికి తగినవారే. కాని మేం సోమరిపోతుల్లా పట్నంచుట్టూ తిరుగుతూ వుండిపోయాం. వుపవాసాలుగాని వ్రతాలుగాని చేయడంలేదు. అటువంటపుడు తాగక యేంజేస్తాం? అందులో పాపమేమీ లేదు. అమాయిక ప్రజమీద వచ్చిపడడం యిక సాగదని నిరూపిద్దాం. యిదివరలో మనం వాళ్ళని చితకతన్నాం. ప్రాణాలతో పారిపోకుండా చేదాం."

ఈ తండా నాయకుని ప్రసంగానికి కోసక్‌లు అందరూ సంతృప్తి పడ్డారు. కిందకు వంగిపోతున్న తలను పైకెత్తారు. చాలామంది తలను పంకిస్తూ ఆ ప్రసంగానికి ఆమోదం తెలిపి "కుకుబెంకో బలేగా చెప్పాడు" అన్నారు.

కొచెవాయ్‌కి దగ్గరలో నిలబడ్డ తారాస్ బుల్బా, "యే వంటావ్ కొచెవాయ్? కుకుబెంకో నిజం చెప్పినట్టుంది. యేమంటావ్?" అన్నాడు.

"నేనేం చెప్పను? అతనిని కన్న తండ్రి అదృష్టవంతుడు! దెప్పడానికి పెద్ద తెలివితేటలు అక్కర్లేదుగాని

కష్టంలో వున్న మనిషికి కష్టం తోచే మాటలు మాటాడకుండా వుండడానికి, గుర్రానికి పట్టుడు ముల్లులాగా వుత్సాహం ధైర్యం కలిగించడానికి తెలివితేటలు యెక్కువగా కావాలి. మీకు వుత్సాహం కలిగించే మాటలు మాటాడదామనుకున్నాను. కాని కుకుబెంకో నాకంటె ముందు ఆలోచించి చెప్పాడు."

"కొచెవాయ్‌కూడా బాగానే చెప్పాడు." అనే మాటలు జపరోజియే శ్రేణులలో మారుమోగాయి. "బాగానేచెప్పాడు!" అన్నారు తక్కినవాళ్ళు. వారిలో ముసలివారు తలలు పంకించి, తెల్లటి మీసాలు ఆడించుకుంటూ మెల్లగా "బలేగా చెప్పాడు!" అన్నారు.

"యిక వినండి" అంటూ ప్రారంభించాడు కొచెవాయ్. "జర్మనీవాళ్ళలాగా నిచ్చెనలమీద యెక్కిగాని, మందుతో పేల్చిగాని కోట పట్టుకోవడం కోసక్‌లకు తగిన పనికాదు. అన్ని విషయాలూ బాగా ఆలోచిస్తే - యెక్కువ ఆహార పదార్థాలు తీసుకు వెళ్ళకుండా శత్రువు కోటలో ప్రవేశించాడు. శకటాలు ఆట్టేలేవు. పట్నంలోని ప్రజానీకం ఆకలితో అలమటిస్తున్నారు. వున్న ఆహారమంతా యిట్టె తినేస్తారు. యిక వారి గుర్రాల సంగతి - గడ్డి యెలా తెస్తారో తెలీదు. భగవంతుడు ఆకాశాన్నుంచి గడ్డిమోపులు కిందకి పారేస్తేయేమో - వారి ఫాదరీలు తియ్యగా మాటాడుతారు. యెందుకో ఒకందుకు పట్నం బయటికి వాళ్లు వచ్చితీరాలి అందువల్ల మీరు మూడు ముఠాలుగా విడిపోయి మూడు ద్వారాలముందరి మూడురోడ్లు ఆక్రమించి తయారుగా వుండండి. ప్రధాన ద్వారంముందు అయిదు తండాలవారు, తక్కిన రెంటిముందు ముడేసి తండాలవారు నిలవండి.

డ్యాడ్లివ్, కోర్సన్ తండాలవారు మాటువేసుకుని వుండాలి. కల నల్ తారాస్ కూడా అతని పటాలంతోపాంచి వుంటాడు. టిట రెవ్హా, టిమొచెవ్హా తండాలవారు అదనపుదళంగా యేర్పడి సామానుశకటాలకుకుడివేపునా. షెర్బినోవ్, యెగువస్టెబ్లికివ్ తండాలు యెడమ వేపునా నిలవాలి. కత్తిలా మాటాడ గలిగిన వుద్ధండులు ముందుకు శత్రువును వేళాకోళం పట్టించండి. పోలిష్ వాళ్లు స్వభావసిద్ధంగా వట్టి మట్టిబుర్రలు. వేళాకోళాలకు తట్టుకోలేక రెచ్చిపోయి వాళ్లే బయటికి వచ్చేయన్నం. తండా నాయకులు తమ తమ తండాలను జాగ్రత్తగా కనిపెట్టి వుండాలి. తండాలో జనం తక్కువయితే పెరియస్లావ్ తండా నుంచి జనాన్ని తీసుకోవాలి. అన్ని విషయాలు జాగర్తగా చూడండి. మతి స్థిమితపడడానికి ఒకొక్కడికి ఒకొక్క రొట్టె ముక్క, ఒకొక్క కప్పు వోడ్కా యివ్వండి. నిన్నటి ఆహారమే యెక్కువ తక్కువగా వుందనుకుంటూ గొంతుకదాకా పట్టించారు కాబట్టే నిజానికి రాత్రి గలభా యేమీ మీరు చెయ్యలేదు. యింకో విషయం. యూదు సారా దుకాణంవాడెవడయినా ఒక కప్పు వోడ్కా అయినా సరే కోసక్ లకు అమ్మాడంటే వాడిని కొరత వేయిస్తా. యిక, సోదరులారా! పదండి, మీ మీ పనులు నిర్వహించండి!"

ఈ విధంగా కొచెవాయ్ ఆజ్ఞలు జారీచేసాడు. అందరూ నడుములదాకా వంగి. అతనికి నమస్కరించారు. టోపీలు పెట్టుకోకుండానే వారివారి శకటాల దగ్గరకు, మకాములకు బయలుదేరారు. చాలాదూరం వెళ్ళిన తరవాతనే నెత్తిమీద టోపీలు పెట్టుకున్నారు. అందరూ తయారు కాసాగారు. పట్టాకత్తుల పదును పరీక్షించారు. సంచీలలోనుంచి తుపాకిమందు మందు

కొమ్ములలోకి ఎక్కించారు. వెనకకు తరలి, శకటాలు సిద్ధంచేసి, గుర్రాలను ఎంచుకున్నారు.

తన పటాలానికి తిరిగి వెళుతూ ఆంద్రీ ఏమయిపోయాడు అని తారాస్ ఆలోచించసాగాడు. అందరితోపాటు అతనూ పట్టుబడ్డాడా ? మెలకువ రాకముందే బంధించారా ? ఉహూఁ - ప్రాణం ఉండగా ఆంద్రీ ఖైదీగా పట్టుబడే మనిషికాదు. కాని హతులయిన కోసక్‌లలో ఆంద్రీ కనిపించలేదు. పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ ఈ ఆలోచనలలో మునిగిపోయాడేమో పేరుపెట్టి ఎవరో అతనిని పిలవడం చాలా సేపటికిగాని వినిపించలేదు.

"యెవరు ?" అని అడిగాడు తమాయించుకుని. "సర్ కలనల్ ? సర్ కలనల్ !" అతి ప్రాముఖ్యమయిన విషయం ఏదో వెల్లడిద్దామని కాంక్షిస్తున్నట్లు, తొందర తొందరగా తడబడుతూ అన్నాడు. ఆ యూదు. "నేను పట్నంలోకి వెళ్ళి వచ్చాను, సర్ కలనల్ !"

ఈ యూదు పట్నంలోకి ఎలా వెళ్ళి రాగలిగాడా అని ఆశ్చర్యపోతూ ఆతనివంక తారాస్ తేరిపారజూసాడు.

"అక్కడికి యెందుకు వచ్చా?"

"యీ నిమిషంలోనే చెపుతా" అన్నాడు యాంకెల్. "తెల్లవారుతుండగా కోసక్‌లు కాల్పులు సాగించిన గల్లంతు వినగానే నేను నా అంగరఖా తీసుకుని తొడుగుకోవడానికి కూడా ఆగకుండా అక్కడికి పరుగెత్తుకు వెళ్ళాను. ఆ గల్లంతు యెందుకో, కోసక్‌లు యెందుకు కాల్పులు సాగిస్తున్నారో తెలుసుకోవాలనే కుతూహలం కొద్దీ దారిలో చొక్కా చేతులు మాత్రం తగిలించుకున్నాను. పట్నంలోకి సేన ఆఖరి జట్టు

ప్రవేశిస్తుండగా కోటద్వారాం దగ్గరికి చేరుకున్నాను. సేన ముందు అశ్వికదళాధికారిగా బెన్ డోవిజ్ వున్నాడు. నాకు బాగా తెలుసు, అతను పెద్దమనిషి: నా దగ్గర వంద భైరోవ్స్ ట్లాలు అప్పు తీసుకున్నాడు. మూడేళ్ళయింది. యింత వరకు యివ్వలేదు. అప్పు అడగడానికి వచ్చిన వాడిలాగా అతని వెంటపడి అందరితోపాటు పట్నంలో ప్రవేశించాను."

"అట్లాగేం ? పట్నంలో ప్రవేశించి అప్పు అడగాలని చూచావ్." అన్నాడు బుల్కా. "కాని అతను నిన్ను అప్పటి కపుడు వురతీయంచలేదు గదూ?"

"ఉహూఁ - నను వురితీయించాలని అతనికేంలేదు!" అని జవాబిచ్చాడు యాంకెల్. "అతని పరివారంలో వాళ్ళు నన్ను పట్టుకున్నారు. మెడకి ఉరితాడు తగిలించారు. రక్షించమని బతిమాలుకున్నాను. అప్పుతీర్చడానికి ఎంతకాలం ఆగమంటే అంతకాలం ఆగుతానన్నాను. అంతేకాదు, తక్కిన యోధుల దగ్గర అప్పు వసూలు చేసుకోవడంలో నాకు సాయపడితే ఇంకా అప్పు పెడతానని మాట యిచ్చాను. ఆయనగారి జేబులో చిల్లిగవ్వనా లేదు. పల్లెలు, మిరాసిభూమి, క్లాదాకా మైదానం వున్నా జేబు ఖాళీ! యిపుడయినా బ్రెస్లా యూదును ఆయుధాలు అవీ యివ్వకపోతే యుద్ధానికి బయలు దేరే ఆస్కారం వుండేదికాదు. అందుకే శాసనసభకు వెళ్ళలేక పోయాడు."

"అయితే పట్నంలో యేం జేసొచ్చావ్ ? మనవాళ్లెవ రయినా కనిపించారా?"

"ఓ - అక్కడ మనవాళ్ళు చాలామంది వున్నారు. యిజాక్, రహూమ్, సామ్యుయల్, హాయివోలో, యూదు యిజారాదారు...."

"వాళ్ళ దుంపతెగ!" అని బొబ్బరించాడు తారాస్. "మీ యూదుజాతివాళ్ళు యెలాచస్తే నాకేం? మన జపరోజియే వాళ్ళసంగతి నాక్కావలసింది!"

"మన జపరోజియే వాళ్ళు కనిపించలేదు గాని ఆంద్రీ దొర కనిపించాడు."

"ఆంద్రీ కనిపించాడా?" అంటూ అరిచాడు తారాస్. "సరే, యెక్కడ కనిపించాడు. చీకటి కొట్లోనా? గోతిలోనా? అవమానించారా? బంధించారా?"

"మా దొరని బంధించడానికి యెవడికి దమ్ములున్నాయి. వొట్టు! గుర్తుపట్టలేకపోయాను. బంగారపు భుజకీర్తులు, బంగారపు పట్టీలు, బంగారపు కవచం, బంగారపు శిరస్త్రాణం! అంతెందుకు, నిలువెల్లా బంగారమే! వసంతకాలంలో పక్షులు కిచకిచలాడుతూ పాడేవేళ, పచ్చిగడ్డి తీయటి వాసన విరజిమ్మేవేళ సూర్యుడు ప్రకాశించినట్టు నిలువెల్లా బంగారంతో ఆంద్రీ ప్రకాశిస్తున్నాడు. పట్టణాధికారి వుత్తమమయిన తన స్వారీగుర్రాన్ని బహూకరించాడు, ఆ గుర్రమే చేస్తుంది రెండువందలు!"

బుల్బా భ్రమాన్పడిపోయాడు.

"యీ విదేశీ కవచం మొదలయినవి అంద్రీ యెందుకు ధరించాల్సివచ్చింది?"

"యెందుకా సొంపుగా వుంటాయి కాబట్టి. గుర్రంమీద స్వారీ చేస్తున్నాడు. తక్కినవాళ్ళు స్వారీ చేస్తున్నారు. అతను

వాళ్ళకి, వాళ్ళు అతనికి నేర్పుతున్నారు. పోలీస్ జమిందారు లాగా వున్నాడనుకోండి !"

"యిలా చేయమని యెవరు నిర్బంధించారు?"

"యెవరూ నిర్బంధించినట్లు లేదు. బుద్ధిపూర్వకంగానే వాళ్ళవేపుకు వెళ్ళాడని మీకు తెలియలేదా యేం?"

"యెవరు వెళ్ళిపోయారూ ?

"యెవరేమిటి ? ఆంద్రీ దొర!"

"యెక్కడికి?"

"వాళ్ళతో కలిసిపోయాడు. యిపుడు పూర్తిగా వాళ్ళ మనిషి!"

"అబద్ధాలాడుతున్నావు ! పందివెధవా!"

"అబద్ధా లెందుకు ఆడతాను ? అబద్ధా లాడేటంత తెలివితక్కువ మొద్దునా ? అబద్ధాలాడితే తల యెగిరిపోతుందని నాకు తెలీదూ ! దొరతో అబద్ధమాడిన యూదుణ్ని వురేస్తారని నాకు తెలియదనుకున్నారా?"

"నువు చెప్పిందాన్ని బట్టి చూస్తే, వాడు తన దేశాన్ని, మతాన్ని అమ్ముకున్నాడన్న మాట?"

"అమ్మేసాడని చెప్పలేను. వాళ్ళతో కలిసిపోయాడు. నేను చెప్పగలిగిందంతే!"

"అబద్ధా లాడుతున్నావు, పాపిష్టిముండావాడా ! యీ క్రైస్తవ ప్రపంచంలో అటువంటి దెన్నడూ జరగలేదు. అబద్ధా లాడుతున్నావు. కుక్కలకొడక!"

"నేను అబద్ధమాడితే, నా యింటిమీద జిల్లేళ్ళు మొలవా ! నావంశం తగలడా ! గట్టిగా చెప్పమంటే యెపుడు వెళ్ళి వాళ్ళతో కలిసిపోయాడో కూడా చెపుతా."

"ఓ - అక్కడ మనవాళ్ళు చాలామంది వున్నారు. యిజాక్, రహూమ్, సామ్యుయల్, హాయివోలో, యూదు యిజారాదారు...."

"వాళ్ళ దుంపతెగ!" అని బొబ్బరించాడు తారాస్. "మీ యూదుజాతివాళ్ళు యెలాచస్తే నాకేం? మన జపరోజియే వాళ్లసంగతి నాక్కావలసింది!"

"మన జపరోజియే వాళ్ళు కనిపించలేదు గాని ఆంద్రీ దొర కనిపించాడు."

"ఆంద్రీ కనిపించాడా?" అంటూ అరిచాడు తారాస్. "సరే, యెక్కడ కనిపించాడు. చీకటి కొట్లోనా? గోతిలోనా? అవమానించారా? బంధించారా?"

"మా దొరని బంధించడానికి యెవడికి దమ్ములున్నాయి, వొట్టు! గుర్తుపట్టలేకపోయాను. బంగారపు భుజకీర్తులు, బంగారపు పట్టీలు, బంగారపు కవచం, బంగారపు శిరస్త్రాణం! అంతెందుకు, నిలువెల్లా బంగారమే! వసంతకాలంలో పక్షులు కిచకిచలాడుతూ పాడేవేళ, పచ్చిగడ్డి తీయటి వాసన విరజిమ్మేవేళ సూర్యుడు ప్రకాశించినట్టు నిలువెల్లా బంగారంతో ఆంద్రీ ప్రకాశిస్తున్నాడు. పట్టణాధికారి వుత్తమమయిన తన స్వారీగుర్రాన్ని బహూకరించాడు, ఆ గుర్రమే చేస్తుంది రెండువందలు!"

బుల్బా బ్రమాన్పడిపోయాడు.

"యీ విదేశీ కవచం మొదలయినవి ఆంద్రీ యెందుకు ధరించాల్సివచ్చింది?"

"యెందుకా సొంపుగా వుంటాయి కాబట్టి. గుర్రంమీద స్వారీ చేస్తున్నాడు. తక్కినవాళ్ళు స్వారీ చేస్తున్నారు. అతను

వాళ్ళకి, వాళ్ళు అతనికి నేర్పుతున్నారు. పోలీస్ జమిందారు లాగా వున్నాడనుకోండి !"

"యిలా చేయమని యెవరు నిర్బంధించారు?"

"యెవరూ నిర్బంధించినట్లు లేదు. బుద్ధిపూర్వకంగానే వాళ్ళవేపుకు వెళ్ళాడని మీకు తెలియలేదా యేం?"

"యెవరు వెళ్ళిపోయారూ ?

"యెవరేమిటి ? ఆండ్రీ దొర!"

"యెక్కడికి?"

"వాళ్ళతో కలిసిపోయాడు. యిపుడు పూర్తిగా వాళ్ళ మనిషి!"

"అబద్ధాలాడుతున్నావు ! పందివెధవా!"

"అబద్ధా లెందుకు ఆడతాను ? అబద్ధా లాడేటంత తెలివితక్కువ మొద్దునా ? అబద్ధాలాడితే తల యెగిరిపోతుందని నాకు తెలీదూ ! దొరతో అబద్ధమాడిన యూదుణ్ని వురేస్తారని నాకు తెలియదనుకున్నారా?"

"నువు చెప్పిందాన్ని బట్టి చూస్తే, వాడు తన దేశాన్ని, మతాన్ని అమ్ముకున్నాడన్న మాట?"

"అమ్మేసాడని చెప్పలేను. వాళ్ళతో కలిసిపోయాడు. నేను చెప్పగలిగిందంతే!"

"అబద్ధా లాడుతున్నావు, పాపిష్టిముండావాడా ! యీ క్రైస్తవ ప్రపంచంలో అటువంటి దెన్నడూ జరగలేదు. అబద్ధా లాడుతున్నావు. కుక్కలకొడక!"

"నేను అబద్ధమాడితే, నా యింటిమీద జిల్లేళ్లు మొలవా ! నావంశం తగలడా ! గట్టిగా చెప్పమంటే యెపుడు వెళ్ళి వాళ్ళతో కలిసిపోయాడో కూడా చెపుతా."

"యెందుకు ?"

"ఆ పట్టణాధికారికి చిలకలాంటికూతురుంది. యేమందం, యేమందం !"

ఇక్కడ, అందం ఒలికేటట్టుగా ఆయూదు మొహం పట్టాడు. చేతులు జాపాడు. కళ్ళు కుంచించుకున్నాడు. మంచి రుచిఅయిన పదార్థం అప్పుడే చవిచూసినవాడిలా లొట్టలు వేయ సాగాడు.

"సరే, చిలకలాంటి కూతురువుంటే ?"

"యిదంతా ఆవిడకోసరమే, ఆవిడకోసరమే వాళ్ళల్లో కలిసిపోయాడు. ప్రేమలోపడ్డ మగాడు చెప్పు అట్టలాంటి వాడు. నానవేస్తే అట్ట యెటుపడితే అటు సాగుతుంది"

బుల్బా ఆలోచనలో మునిగిపోయాడు. మనోనిబ్బరంలేని ఆడవాళ్ళకు ఆకర్షణశక్తి ఎక్కువగా ఉంటుందనీ, వాళ్లు దిట్ట మయిన మగాళ్ళను అనేకమందిని నాశనం చేసారనీ, ఆమె ఆక ర్షణకులోనయి పోయే స్వభావం ఆంద్రీదనీ జ్ఞాపకం వచ్చింది. నేలకుఅంటుకునిపోయినట్టు చాలాసేపు చలనం లేకుండా నిలబడిపోయాడు.

"విను, దొరా! నా దొరకు అంతా చెప్పేస్తాగా" అన్నాడు ఆ యూదు. "ఆ గందరగోళం విని, పట్నం ద్వారం లోకి వాళ్లు వెళ్ళడం చూసి ముత్యాలహారం వకటి పుచ్చుకుని బయలుదేరాను. పట్నంలో అందమయిన ఆడవాళ్లు, గొప్ప యింటి ఆడవాళ్లు వున్నారు. నేను అనుకున్నాను, తింటానికి లేకపోయినా అందమయిన ఆడవాళ్లు, గొప్పయింటి ఆడవాళ్లు ముత్యాల హారాలు కొంటారు. నన్ను ఆ సేనాధికారి మను షులు వదిలిపెట్టగానే. ముత్యాలు అమ్ముకోవడానికి పట్టణాధి

కారి యింటి ఆవరణలోకి వెళ్ళా. అక్కడ సంగతంతా వక తాతారు యువతి వల్ల తెలుసుకున్నా. 'జపరోజియే వాళ్ళని తరిమేసిన మరుక్షణంలో పెళ్ళి అవుతుంది. మా దొర ఆండ్రీ జపరోజియే వాళ్ళని తరిమేస్తానని మాట యిచ్చాడు,''

"ఆమట్టున ఆ గాడిదకొడుకుని నరికేయలేకపోయావా?" అంటూ గర్జించాడు బుల్బా

"నరికేయడం దేనికి? బుద్ధిపూర్వకంగానే వాళ్ళ పక్షాన చేరాడు. అతను చేసిన తప్పేముంది? అతడికి అక్కడ వుండడమే మంచిది. అందుకే అక్కడికి వెళ్ళిపోయాడు''

"అయితే ముఖాముఖి వాడినిచూసి మాట్లాడావా ?''

"ఓ - చూసాను. మహాగొప్ప యోధుడులెండి! అందరికంటె వెలిగిపోతున్నాడు. నన్ను చూడగానే గుర్తు పట్టాడు. దగ్గిరికి వెళ్ళివెళ్ళగానే అన్నాడు -''

"యేమన్నాడేం ?''

"ఆయన అన్నాడు - ఉహుఁ - ముందుగా నన్నురమ్మని సైగచేసాడు. ఆ తరవాత 'యాంకెల్' అన్నాడు. యిక నేను 'యేందొరా?' అన్నాను. 'యాంకెల్! మా నాన్నతో, మా అన్నతో, కోసక్‌లతో, జపరోజియే వాళ్ళందరితో, యిక నాకు తండ్రిలేడు, అన్నలేడు, స్నేహితులు లేరు. అందరితో పోరాడదలచాను. వక్కడినీ వదిలిపెట్టను!' అనిచెప్పు అన్నాడు.''

"వెధవ అబద్ధాలూ నువ్వూ! '' అని తారాస్ మండిపడుతూ బిగ్గరగా అరిచాడు, "అబద్ధాలాడుతున్నావు గాడిదా! క్రీస్తుఅంతటి వాడిని కొరతవేసినవాళ్ళు గారు మీరూ! రాక్షసులు! నిన్ను చంపేస్తాను వుండు, శనివెధవ! ఛీ, పో. యిక

యిక్కడ నిలబడితే నీ ప్రాణం తీసేస్తాను," ఇలాఅంటూ తారాస్ కత్తిదూసి ఝళిపించాడు.

ఆ యూదు భయపడిపోయి వెనువెంటనే పిక్క బలం చూపాడు. వెనుతిరిగి చూడకుండా కోసక్ మకాం గుండా మైదానంలోకి చాలాదూరం చాలాసేపు పరుగెత్తాడు. మొదటగా తటస్థపడ్డ వాడిమీద మండిపడడంలోని పొరపాటు గ్రహించి బుల్బా వాడివెంట పడలేదు.

ఆ కిందటి రాత్రి ఆంద్రీ ఒక స్త్రీ కలిసి తిరగడం బుల్బాకు జ్ఞాపకం వచ్చింది. అంతటి సిగ్గుచేటయిన విషయం జరుగుతుందని నమ్మలేక పోయినా, తన స్వంత కొడుకు మతాన్నీ ఆత్మనూ అమ్ముకున్నందుకు నెరిసిన తల వంచుకున్నాడు.

చివరికి తన పటాలాన్ని తీసుకుని ఇంకా కొసక్‌లచేత దగ్ధం కాకుండా మిగిలిన అడవిలోకి తారాస్ మాయమయాడు. ఈలోపున జపరోజియేవారు, పదాతులు, అశ్వికులు మూడు ద్వారాలకు వెళ్లే మూడు రోడ్ల వెంబడే పురోగమించారు. ఒకటి తరవాత ఒకటిగా యుమాన్, పోపోవిచ్, కానివ్, స్టెబిలికివ్, నెజమాయ్, గుర్గుజ్. టిటరెవ్కా, టిమోషెవ్కా తండాలు నడక సాగించాయి. పెర్యెస్లావ్ తండా మాత్రం ఎక్కడా కనిపించలేదు. ఆ తండాలోని కోసక్‌లు వోడ్కా తప్పతాగి ఉన్న డబ్బంతా తగలేసుకున్నారు. కొంతమంది నిద్రలేచి చూసుకునేసరికి కాళ్లూ చేతులు బంధించబడి ఉన్నాయి. మరికొంతమంది అసలు నిద్ర నుంచి లేవనేలేదు. అలానే యమలోకానికి వెంచేసారు. ఇక

వారి నాయకుడు క్లిబ్ లేచి చూసుకునే సరికి పట్లాం లేదు. పై ఉడుపులు లేవు, శత్రుశిబిరంలో ఉన్నాడు.

శత్రు సంచలనం పట్టణంలోకి వినిపించింది. అంతా కోట గోడ మీద గుమిగూడారు. కోసక్‌లకు దివ్య మయిన దృశ్యం పొడగట్టింది. ఒకరికంటె ఒకరు అందమ యిన పోలిష్ యోధులు ప్రహారీమీద నిలబడి ఉన్నారు. హంస తెలుపు తురాయిలతో అలంకరించబడిన శిరోష్ణాలు వేయి సూర్యులలా వెలిగిపోతున్నాయి తక్కినవారు ఉపరి భాగాలు ఒకపక్కకు ఒరిగిన గులాబిరంగు లేక ఊదారంగు టోపీలు చిన్నవి పెట్టుకున్నారు. బంగారపు తీగలతోను, జలతారుతోను అలంకరించబడిన కోట్లు బుజాలవెనక వేలాడే చేతులవి ధరిం చారు. మంచి విలువగల రాళ్ళు పొదిగిన కత్తులు, తుపాకులు వారిలో చాలామందికి ఉన్నాయి. వాటిని చాలా ఖరీదుపెట్టి కొనిఉంటారు. అపరిమితమయిన ఆడంబరం కనవచ్చింది. అంద రికీ ముందు బంగారపుకుచ్చు ఎర్రటోపీ పెట్టుకుని బుడ్జాక్ సేనాని అహంభావంతో మిడిసిపడుతూనిలబడ్డాడు. భారీమనిషి. అందరికంటె పొడుగు, లావు, అతనిపై కోటు చాలా విలు వయినది, విశాలమయినది. కాని అది అతనికి చాలీ చాలకుండా ఉంది. పక్కద్వారంలో ఇంకో సేనాని నిలబడ్డాడు. మనిషిపొట్టి, ఆర్చుకుపోయాడు. చిన్న చిన్న చురుకుకళ్ళు, బొద్దుకనుబొమలు. కళ్లు తీక్షణంగా మెరిసిపోతున్నాయి. చాలాకీగా నలువేపులా తిరుగుతూ, ఎండిపోయిన సన్నటి చేతులతో చూపుతూ ఆజ్ఞలు జారీ చేస్తున్నాడు పొట్టివాడయినా యుద్ధ తంత్రంలో మంచి నైపుణ్యం గలవాడని స్పష్టమవుతూనే ఉంది. అతనికి అనతిదూరంలో సన్నగా పొడుగ్గా ఉన్న ఒక ఆశ్విక

దళాధికారి నిలబడ్డాడు. బొద్దుమీసాలు, మొహం కళ కళ లాడుతోంది. దీనినిబట్టి అతనికి మద్యమంటే మహా ఇష్టమనీ, అతను మాంచి హుషారు పురుషుడని స్పష్టమవుతూంది. అతని వెనక చాలామంది ప్రభువులు కనిపించారు. వారంతా స్వంత డబ్బుతోనో, ప్రభుత్వ ధనంతోనో, తాత ముత్తాతలు దాచి పెట్టిందంతా యూదులకు తాకట్టు పెట్టో ఆయుధాలు సంపాదించారు. డంబాచారులయిన సెనేటర్ల చుట్టూ ఇచ్చకాలమారి వాళ్ళు చాలామంది ఉన్నారు. ఆడంబరంగా వీరిని విందులకు తీసుకుని వెళితే మేజాల మీదనుంచి, అలమరాలలోనుంచి వెండికప్పులు దొంగిలించి విందు అవగానే వారి బగ్గీపెట్టెల మీదకు చేరుకునేవారు. అవును, అక్కడ వారిలో రకరకాల మనుషులు ఉన్నారు. కొందరి దగ్గర గుక్కెడు వోడ్కా కొనడాని కయినా డబ్బులేదు. కాని యుద్ధసన్నద్ధు లయారు.

ఇక కోసక్‌లు ప్రశాంతంగా గోడలముందు నిలబడ్డారు. వారి దుస్తుల మీద చిన్నం బంగారమయినా లేదు. అక్కడక్కడా కత్తులపిడుల మీద, తుపాకి గుర్రం మీద బంగారం కానవస్తోంది. విలువయిన సైనిక దుస్తులు ధరించడం కోసక్‌లకు గిట్టదు. వారి కవచాదులు నిరాడంబరంగా ఉంటాయి. ఎర్రకొనల నల్లగొర్రెచర్మపు టోపీలు యుద్ధరంగమంతటా చుక్క చుక్కలుగా ప్రకాశిస్తున్నాయి.

జపరోజియే శ్రేణులలోంచి ఇద్దరు కోసక్‌లు స్వారీ చేస్తూ ముందుకు వెళ్ళారు. వారిలో ఒకడు నవయువకుడు. రెండవవాడు పెద్దవాడు. ఇద్దరూ కత్తిలాగా మాట్లాడగల వాళ్లే. సాహస కృత్యాలలోకూడా ఎవరికీ తీసిపోయేవారు

కారు. వీరి పేర్లు ఒక్రిమ్‌నాషా, మికిటా గొలోకోపిటెంకో వారి వెనక డెమిడ్ పోపోవిచ్ గుర్రంమీద బయలుదేరాడు. బొద్దు పాటి మనిషి. గడీలో చాలాకాలం గడిపాడు, ఆంద్రియనోపుల్ యుద్ధంలో పోరాడాడు. కాకలుతీరిన యోధుడు. ఉరికంబానికి కట్టివేసి ఇతనిని బ్రతికి ఉండగానే దహనం చేయాలని చూసారు. ఎలాగో తప్పించుకుని బయటపడి గడీ చేరుకున్నాడు. కాని మొహంమాత్రం కాలి నల్లబడింది. మీసాలు కమిలిపోయాయి. పోపోవిచ్‌కి మళ్ళీ కండపట్టింది. జుట్టు మళ్ళీ ఉంగరాలు తిరిగింది. మీసాలు మళ్ళీ నల్లగా బొద్దుగా పెరిగాయి. ఇతనూ చురుక్కున గుచ్చుకునేట్లు మాట్లాడగలవాడే.

"హాహో ! పై బండారమే గాని లోపల లొటారం !"

"నా తడాఖా చూపిస్తా వుండు" అని అరిచాడు ఆ లావుపాటి సేనాధిపతి పైనుంచి. "మీ కందరికీ అరదండాలు తగిలిస్తా. బానిస వెధవల్లారా ! మీ తుపాకులు, గుర్రాలు వదిలేయండి, చూసారా మీవాళ్ళని యెలా బంధించానో ? హో, యెవరక్కడ ? ఆ జపరోజియే వాళ్ళని గోడమీదకు తీసుకు రండి, చూపిద్దాం !"

తాళ్ళతో బంధించబడిన జపరోజియే వారిని గోడమీదకు తీసుకువచ్చారు. వారి తండా నాయకుడు క్లిబ్ అందరికంటె ముందు ఉన్నాడు. పంట్లాం లేదు. పై దుస్తులు లేవు. తాగినిద్ర పోతున్నపుడు ఎలా పట్టుకున్నారో అలానే తీసుకువచ్చారు. తన కోసక్ సోదరుల ఎదట నగ్నంగా నిలబడవలసి వచ్చినందుకు నిద్రలో పట్టుబడ్డందుకు సిగ్గుపడుతూ క్లిబ్ తలవంచుకున్నాడు. ఒక్కరాత్రిలో అతని తల నెరిసిపోయింది.

"మరేం ఫరవాలేదు క్లిబ్! నిన్ను విడిపిస్తాంలే" అని కిందనుంచి కోసక్‌లు అరిచారు.

"మరేం ఫరవాలేదు" అన్నాడు బోరొడాటీ కూడా. ఇతనూ ఒక తండాకీ నాయకుడే "నిన్ను నగ్నంగా పట్టుకు వెళ్ళారంటే అది నీ తప్పేంగాదు. కష్టాలు యెవరికయినా వస్తాయి. కాని యిలా నగ్నంగా నిన్ను ప్రదర్శించి నవ్వులపాలు చేసినందుకు వాళ్ళే తలవంచుకోవాలి."

"నిద్రపోతున్న వాళ్ళతో పోరాడిన మహా ధైర్యస్తులు!" అని బిగ్గరగా అరిచాడు గొలోకోపిటెంకో తలఎత్తి గోడకేసి చూస్తూ.

"కాస్త తమాయించండి, సిగపాయలు తరిగేస్తాం" అని కేకపెట్టారు పైనున్నవారు.

"యేమాత్రం తరుగుతారో చూస్తాంగా?" అన్నాడు పోపోవిచ్, జీనుమీదనుంచే వెనకకు తిరిగి కోసక్‌ల వంక తేరి పారజూసి తిరిగీ అన్నాడు. "యెందుకు తరగలేరేం? బహుశా పోలిష్ వాళ్లు నిజం చెబుతున్నారేమో! ఆ బానకడుపు పెద్ద మనిషే గనక వాళ్ళకి నాయకత్వం వహించి నడిపిస్తే కావలసి నంత రక్షణ!"

"కావలసినంత రక్షణ అని యెలా చెప్పగలవు?" అని అడిగారు కోసక్‌లు. పోపోవిచ్ వెంటనే ఎదో కొక్కిరాయి మాట విసురుతాడని వారికీ గట్టిగా తెలుసు.

"యెలా యేమిటి?" సేన సేనంతా వాడి వెనకాల దాక్కోవచ్చు, బానపొట్టేమో మీ యీటె పోటులు వాళ్ళకి తగలనే తగలవు.

ఈ మాటలకు కోసక్ లంతా నవ్వారు. చాలమంది చాలాసేపు తలలు పంకించి అన్నారు. "బలే, బలే! పోపోవిచ్! మాటలకు - " కాని వాక్యం పూర్తిచేయడానికి వారికి వ్యవధి లేకపోయింది.

"గోడలకు దూరంగా పదండి పదండి" అని కేకవేశాడు కొచెవాయ్. పోలిసువారు ఆ కొక్కిరాయి మాటలు దిగమింగ లేకపోయారు, సేనాధిపతి చేయి ఊపాడు.

కోసక్ లు వెనకకు మళ్లారో లేదో గోడలమీదనుంచి తుపాకిగుళ్ళ వర్షం కురవసాగింది. ప్రహారీమీద అలజడి బయలు దేరింది. తలనెరసిన పట్టణాధికారి స్వయంగా గుర్రంమీద ప్రత్యక్షమయాడు. ద్వారాలు తెరుచుకున్నాయి. సేనలు బయ టకు వచ్చాయి. సేనాముఖంలో గుర్రపుదండు సమశ్రేణిలో బయలుదేరింది. దాని వెనక వరసగా సిపాయిలు, ఆ తరవాత కవచధారు లయిన బల్లెపు సిపాయిలు, తరవాత కంచు శిరో స్త్రాల సేన, వీరందరి వెనకా గొప్పగొప్ప ప్రభువులు ఎవరికి వారే విడి విడిగా స్వారీచేస్తూ వచ్చారు. ఎవరి అభిరుచికి తగిన దుస్తులు వారు వేసుకున్నారు. తలబిరుసు యోధులు తక్కిన వారితో కలవలేదు. పటాలం లేనివారు దూరంగా తమ పరివా రాన్ని వెంటబెట్టుకుని రాసాగారు. ఆ తరవాత మళ్ళీ సైనిక శ్రేణులు, వారి వెనక గుర్రం మీద ఆశ్వికసేనాధికారి, అతని వెనక ఇంకా సైనిక శ్రేణులు, గుర్రం మీద ఆ బొద్దుపాటి సేనాధిపతి, సేన వెనకభాగంలో ఆ పొట్టి సేనాధిపతి.

"వాళ్ళని వ్యూహం పన్ననీయకండి" అని కేకపెట్టాడు కొచెవాయ్. "అన్ని తండాలవారూ ఒక్కుమ్మడిగా వాళ్ళ మీద దాడిచేయండి. తక్కిన ద్వారాలు వదిలేయండి. టిట

రెవ్కా తండా కుడిపార్శ్వం మీద, డ్యాడ్కిన్ తండా యెడమ పార్శ్వం మీద దాడి చేయాలి. కుకుబెంకో, సాలి వోడాలు పృష్ఠభాగం మీద పడతారు. వాళ్ళ శ్రేణులను ఛేదించండి. చెదరగొట్టండి.'

కోసక్‌లు నలువైపులనుంచీ దాడిచేసి శత్రుశ్రేణులను చికాకు పరచి, ఛేదించుకుని వారిమధ్యకు చేరుకున్నారు. శత్రువులకు కాల్పులు చేయడానికి వ్యవధి ఈయలేదు. కత్తులు, ఈటెలు వీరవిహారం చేయసాగాయి. వారంతా ఒకచోటే గుమిగూడారు. ప్రతీవాడికీ తన శక్తి సామర్థ్యాలు ప్రదర్శించి చూపే అవకాశం చిక్కింది. డెమిడ్ పోపోవిచ్ ముగ్గురు సాయుధులయిన సైనికులను బల్లెంతో పొడిచిచంపాడు. ఇద్దరు గొప్ప ప్రభువులను గుర్రాలమీదనుంచి కింద పడదోసి, "బలే గుర్రాలు! యిటివంటి గుర్రాలమీద యెంతకాలంగానో మోజుగావుంది" అన్నాడు. గుర్రాలను దూరంగా తరిమివేసి, అక్కడ నిలబడి ఉన్న కోసక్‌లను ఉద్దేశించి, "వాటిని జాగ్రత్తగా చూస్తూ వుండండి" అని కేక వేసాడు. ఆ తరవాత తిరిగీ తలపడి గుర్రాల మీదనుంచి కిందపడ్డ ప్రభువులలో ఒకనిని చంపి రెండవవాని మెడకు ఉచ్చువేసి బిగించి జీనుకు కట్టేడు. ఖరీదయిన పిడిగల కత్తి, కాసివోకకు వేలాడుతున్న డబ్బుసంచీ తీసుకుని ఈడ్చుకుంటూ తీసుకువెళ్ళాడు.

కొబిటా అనే యువ కోసక్ పోలీషు యోధులలో అతి ధైర్యశాలి అయిన ఒకనితో తలపడి చాలాసేపు పోరాడాడు. ఇద్దరూ బాహీబాహీ పెనుగులాడజొచ్చారు. చివరికి కోసక్‌దే పైచేయి అయింది. కింద పడవేసి టర్కీ బాకుతో అతని వక్షంలో పొడిచాడు. కాని ఆ కోసక్‌కూడా చావు తప్పించు

కోలేకపోయాడు. సరిగ్గా ఆ సమయాన తుపాకి గుండు వచ్చి కణతకు తగిలింది. కొబిటాను మృత్యువాత పడదోసిన యోధుడు ప్రభువులలోకల్లా గొప్పవాడు, అందమయినవాడు. పురాణవంశ సంజాతుడు. బూరుగుచెట్టులా ఠీవిగా గుర్రంమీద అటూ ఇటూ పరవళ్ళు తొక్కుతూ శౌర్యపరాక్రమాలు ప్రదర్శించి అనేక సాహసకృత్యాలు చేసాడు. ఇద్దరు కోసక్‌లను చీల్చి చెండాడాడు. థియొడోర్ వోర్జు అనే కోసక్‌ను గుర్రంతో సహా నేల కూల్చాడు. గుర్రాన్ని తుపాకితో కాల్చాడు. గుర్రంకింద పడ్డ కోసక్‌ను ఈటెతో పొడిచాడు. ఈవిధంగా చాలా తలకాయలను నరికి పారేసాడు. ఇక ఇపుడు కొబిటాను తలమీద కాల్చాడు.

"యిటువంటి వారితో తలపడి నా శక్తి సామర్థ్యాలు చూపించాలి" అంటూ గర్జించాడు నెజమాయ్ తండా నాయకుడు కుకుబెంకో. గుర్రాన్ని అదిలించి చుట్టుపక్కల జనమంతా అదిరిపోయేటట్లు పొలికేక పెట్టుకుంటూ వెనకనుంచి శత్రువు మీదికి దూకాడు. ఇక ఆ పోలిషు సరదారు గుర్రాన్ని వెనకకు తిప్పి ఎదిరిద్దామని చూసాడు గాని కుకుబెంకో పెట్టిన పొలికేకకు అదిరిపోయి గుర్రం పక్కకు దుమికింది. కుకుబెంకో విడిచిన తుపాకుగుండు రొతు రెక్క ఎముకకు తగిలింది. అతను గుర్రం మీదనుంచి కింద పడిపోయాడు. కింద పడ్డా లొంగిపోలేదు. శత్రువు మీద తిరుగుదెబ్బ తీయాలని యత్నించాడు గాని కత్తిబరువు భరించలేక చేయి కిందకు వాలిపోయింది. అపుడు కుకుబెంకో రెండు చేతులతో పట్టాకత్తి పట్టుకుని పాలిపోయిన మూతిమీద కొట్టాడు. ఆ దెబ్బకు తెల్లటి పళ్ళు రెండు ఊడిపోయాయి, నాలుక రెండు వ్రక్క

లయింది? మెడ తెగిపోయింది. కత్తి నేలకు గుచ్చుకుంది. ఈ విధంగా ఆ యోధుని కుకుబెంకో నేలపాలు చేసాడు. నదీతీరం మీద పెరిగే గులాబీలాంటి ఎర్రని నెత్తురు చిమ్మిరి గొట్టంలా ప్రవహించింది. బంగారపు నగిషీ పచ్చనోటు నెత్తురు మరకలయ్యాయి. కుకుబెంకో అతనిని వదిలిపెట్టి తన పరివారంతో దోవచేసుకుని రంగభూమిలో ఇంకోచోట పోరాడడానికి వెళ్ళిపోయాడు.

"బలే విలువయిన అలంకారాలు వదిలేసి వెళ్ళిపోయాడా" అంటూ యుమాన్ తండా నాయకుడు బొరొడాటీ తన పరివారంతో కుకుబెంకో చేతిలో చచ్చి ఆ సరదారు చచ్చి పడి ఉన్న చోటుకు వచ్చాడు: "నా చేతులతో స్వయంగా యేడుగురు ప్రభువులను చంపాను. యెవరి శరీరం మీదా యిటువంటి అలంకారాలు లేవు."

బొరోడొటా అత్యాశకు పోయి ఆ శవం మీది విలువయిన కవచం ఊడదీయడానికని వంగాడు. రత్నాలు పొదిగిన బాకు తీసుకున్నాడు. నడుం పటకానుంచి డబ్బుసంచి ఊడతీసాడు. ఎదుర్రొమ్ముమనుంచి సన్నబట్టలతో, వెండి నాణేలతో, ప్రేమచిహ్నం - కన్య ఉంగరాలజుట్టుతో నిండిన సంచి తీసుకున్నాడు. కాని ఎర్రముక్కు సేనాధిపతి వెనకనుంచి మీదకు దూకటం కనిపెట్టలేకపోయాడు. బొరొడోటీ ఆ సేనాధిపతిని అంతకుపూర్వమే గుర్రంమీదనుంచి పడగొట్టి జన్మలో మరవకుండా చితకతన్నాడు. ఆ సేనాధిపతి బలం అంతా ఉపయోగించి కత్తి విదిలించి బొరొడోటీ మెడమీద ఒక్కటి పెట్టాడు. అత్యాశ చావుకు దారితీసింది. తల ఎగిరి ఎక్కడో పడింది.

నేల నలుమూలలా ర_క్తం చిందింది. ఆ కోసక్ కర్కశాత్మ
విచారంతో, కోపంతో అంత పెద్ద కాయంనుంచి అంత తొంద
రగా ఎగిరిపోతున్నందుకు ఆశ్చర్యపడుతూ అనంతకాలంలో లీన
మయిపోయింది.

ఆ సేనాధిపతి ఆ తండనాయకుని జుట్టు పట్టుకుని తన
జీనుకు కట్టుకుందామని చూస్తూండగా ప్రతీకారం తీసుకోవ
డానికి ఇంకో యోధుడు ప్రత్యక్షమయాడు.

ఆకాశంలో విహరించే డేగ రెక్కలాడించుకుంటూ
బ్రకాయి కొట్టి హఠాత్తుగా గాలిలో సమమట్టంలో వేలా
డుతూ కింది కోలంకి పిట్టమీదికి దూకినట్టే బుల్బా పెద్దకొడుకు
ఒస్టాప్ ఆ సేనాధిపతిమీదికి దూకి మెడకు ఉచ్చు తగిలించాడు.
ఉచ్చు బిగిస్తున్న కొద్దీ అతని మొహం ఊదా రంగుకు తిరిగింది.
అయితేనేం పిస్తోలు తీసుకుని ఒస్టాప్‌ని కాల్చాలని చూసాడు
గాని చేయి బిగిసుకుపోయింది. గురితప్పి గుండు దూరాన
ఎక్కడో పడింది. ఖైదీలను బంధించడానికని సేనాధిపతి జీనుకు
కట్టుకున్న పట్టుతాడు ఊడదీసి అతని కాళ్లు చేతులూ అతని
తాడుతోనే కట్టి ఈడ్చుకునిపోతూ ఆఖరిసారిగా మీ నాయకుని
గౌరవించడానికి రమ్మని యుమాన్ తండా వారిని పిలిచాడు.

తమ నాయకుడు మరిలేడని తెలియగానే యుమాన్
తండా కోసక్‌లు రణరంగంనుంచి వైదొలగివచ్చి శవంకోసం
పరుగెత్తారు. ఆలస్యం చేయకుండా ఎవరిని నాయకునిగా ఎన్ను
కుందామా అని ఆలోచించసాగారు. చివరికి "వివాదమెందుకు?
ఒస్టాప్ బుల్బా కన్న సమర్థు డెక్కడ దొరుకుతాడు. మనందరి

కన్నా చిన్నవాడన్నమాట నిజమేగాని పెద్దవారికున్నంత వివేకం వుంది''

ఒస్టాప్ టోపీ తీసివేసుకుంటూ తనను ఇలా గౌరవించినందుకు కోసక్ సోదరులకు కృతజ్ఞత ప్రకటించాడు. చిన్నవాడనని వంకపెట్టి నిరాకరించలేదు. వివేకంతో చూసాడు. యుద్ధకాలంలో నిరాకరించడం తగదని అతనికి బాగా తెలుసు. వెంటనే వారిని సూటిగా పోరాటానికి దూకించి నాయకుని ఎన్నుకోవడం వృధాకాలేదని నిరూపించాడు.

పోలండువారు తట్టుకోలేక పరుగెత్తుకుంటూ తిరోగమించసాగారు. యుద్ధభూమి అంచుకుచేరుకుని అక్కడ తిరిగీసన్నద్ధం కావాలని వారి ఆలోచన. ఇతర ద్వారాలకు దూరంగా నిలబడ్డ నాలుగు పటాలాలకు ఆపొట్టి సేనాధి పతి సైగ చేసాడు. అక్కడనుంచి కోసక్ మూకలమీద గుళ్ళువచ్చి పడసాగాయి. కాని ఆ గుళ్లు యుద్ధభూమిలో మేస్తున్న కోసక్ ఎద్దులకు తగిలాయి. ఎద్దులు భయంతో అరుస్తూ కోసక్ శిబిరాలకేసి తిరిగి శకటాలను ధ్వంస చేస్తూ కాళ్లకింద జనాన్ని నలిపివేస్తూ పరుగిడ జొచ్చాయి. కాని మాటునుంచి బుల్బా బయటకువచ్చి తన పటాలంతో వాటిదారికి అడ్డు వచ్చాడు. పశువులమంద ఆ అలజడికి అదిరిపోయి వెనకకు తిరిగి పోలిష్ పటాలాలమీద పడి అశ్వికులను నేల కూల్చింది. కాళ్లతో నలగ దొక్కి చిందరవందర చేసింది.

"బలే! బలే!" అంటూ జపరోజియేవారు ఆ ఎద్దులకు కృతజ్ఞత తెలిపారు. "దారిలో మాకు ఎంతో సేవ చేసాయి. యిపుడు యుద్ధభూమిలో కూడా చేసారు." ఇలాఅని ఇనుమడించిన బలంతో వారు శత్రువులమీదకు ఉరికారు.

శత్రుసేనలో చాలామంది హతులయినారు. మెటి లిట్స్యా, పిరో, పిసరెంకోలు ఉభయులు, ఒటజెంకో, మరి అనేకమంది కోసక్‌లు పేరు ప్రతిష్టలు గడించుకున్నారు. చుక్క ఎదురయిందని గ్రహించి పోలెండువారు జెండాపాతి ద్వారాలు తెరవమని కేకలు వేశారు. ఇనప తలుపులు కిర్రుమని చప్పుడు. చేసుకుంటూ తెరుచుకున్నాయి, అలిసిపోయి, మట్టికొట్టకున్న అశ్వికులు గొర్రెలమందలోకి గొర్రెలు చేరుకున్నట్టు పట్నం లోపలికి చేరుకున్నారు. జపరోజియేవారు కొంతమంది తాము కూడా లోపలికి జొరబడాలని యత్నించారు. గాని ఒస్టాప్ తన యుమాన్ తండాను ఆపి, "గోడలకు దూరంగా వుండండి! గోడలకు దూరంగా! దగ్గిరికి వెళ్ళడం మంచిదిగాదు" అని అరి చాడు. అతను చెప్పినది నిజంఅని ఋజువయింది. గోడలమీది శత్రుసైనికులు కాల్పులు మొదలుపెట్టారు చేతికి అందిందల్లా కిందికి విసిరివేశారు. దాడిచేస్తున్న కోసక్‌లు చాలామందికి దెబ్బలు తగిలాయి. అపుడు కొచెవాయ్ గుర్రంమీద స్వారీచేస్తూ వచ్చి, "కొత్త అయితేనేం, యెంతో కాలంనుంచి నాయకత్వం వహిస్తున్నవారిలా తండాను నడుపుతున్నాడు" అని ఒస్టాప్‌ను పొగడసాగాడు. ఈ కొత్తనాయకు డెవరో చూదామని ముసిలి బుల్బా వెనకకు తిరిగాడు. తిరిగి చూసేసరికి అతని కొడుకు ఒస్టాప్ యుమాన తండా ముఖంలో గుర్రంమీద కూర్చుని కనిపించాడు. టోపీ ఒక ప్రక్కకు వొరిగి వుంది, చేతిలో తండా నాయకుని అధికార దండం ఉంది. "బలే!" అని తారాస్ అరిచాడు కొడుకుకేసి తేరిపార జూస్తూ. ఈ ముసిలి కోసక్ సంతోషంతో ఉప్పొంగిపోయి తన కొడుకును పెద్దను

చేసి గౌరవించినందుకు యుమాన్ కోసక్‌లకు కృతజ్ఞత తెలిపాడు.

కోసక్‌లు తమ మకాములకు తిరిగి పోతుంటే పోలండు వారు తిరిగి కోటగోడ మీద ప్రత్యక్షమయారు. కాని వారి శరీరాల మీది పచ్చడాలు చిరిగిపోయి ఉన్నాయి. విలువగల కోట్లకు నెత్తురు మరక లయాయి. చక్కటి కంచు శిరోష్ణాలు దుమ్ము కొట్టుకొనిపోయి ఉన్నాయి.

"హే! మమ్మల్ని కట్టిపారేస్తామన్నారు గదూ! యేదీ?" అని హేళనగా కేకలు పెట్టారు కిందనుంచి జపరోజియేవారు.

"మా తడాఖా చూపిస్తాం వుండు" అని పైనుంచి బొద్దు సేనాధిపతి అరిచాడు, పూర్వంలాగానే బెదిరిస్తూ, తాడు ఒకటి అల్లల లాడిస్తూ.

దుమ్ము కొట్టి, అలసిపోయిన యోధులు ఒకరి నొకరు ఇంకా బెదిరించుకో సాగారు. ఉభయ పక్షాలలోని తలబిరుసు జనం ఒకరి నొకరు ఎగతాళి చేసుకున్నారు.

చివరకు అంతా యుద్ధం చాలించి ఎవరి మకాములకు వారు చేరుకున్నారు. యుద్ధం చేసీ చేసీ అలసిపోయిన కొంత మంది విశ్రాంతిగా పండుకున్నారు. తక్కినవారు గాయాలకు మట్టిపూసి తమచే హతులయినవారి శరీరాల మీది విలువయిన దుస్తులు, జేబురుమాళ్ళు చించి గాయాలకు కట్టుకున్నారు. ఎక్కువగా అలసిపోనివారు శవాలను పోగుచేసి ఆఖరిసారిగా గౌరవ వందనం అర్పించారు. పట్టాకత్తులతోను, బల్లాలతోను గోతులు తవ్వారు. మన్ను టోపీలతో, కోట్లతో ఎత్తి పార పోశారు. హతులయిన కోసక్‌లను గౌరవపురస్సరంగా సమాధి

చేసి, కాకులు గద్దలు పొడిచి తినకుండా కొత్తమట్టి కప్పారు. కాని పోలండువారి శవాలకు ఏమాత్రం గౌరవం చూపకుండా డజన్లకొద్దీ గుర్రాల తోకలకు కట్టి కొరడాలతో పక్కల మీద కొడుతూ తరిమి తరిమి మైదానంలోనికి కొట్టారు. నెత్తురు ముద్దలయి, మట్టిగొట్టుకున్న శవాలను నేలమీద బరబరా ఈడ్చుకుంటూ కొండలనక, గుట్టలనక, గోతులనక, కాలవలనక గుర్రాలు పిచ్చిగా పరుగెత్తసాగాయి.

ఆ తరవాత తండాలవారంతా వలయాకారంగా భోజనాలకు కూర్చున్నారు. తాము పాల్గొన్న పోరాటాలను గురించీ, తరతరాల వరకూ గానంచేయబడే తమ సాహస కృత్యాలను గురించీ రాత్రి పొద్దుపోయేవరకు ముచ్చటించుకున్నారు. అలా వారు చాలాసేపు కూర్చున్నారు. తారాస్ బుల్బాకూడా శత్రుయోధులలో ఆండ్రీ కనపడకపోవడంగురించి ఆలోచిస్తూ చాలాసేపు కూర్చున్నాడు. తన రక్త బంధువులతో పోరాడడానికి ఆద్రోహి సిగ్గుపడి రాకుండా మానుకున్నాడా? ఆ యూదు అబద్ధం చెప్పాడా? ఆంద్రీని బంధించి తీసుకువెళ్ళలేదుగదా? కాని ఆంద్రీమనసు తేలికగా స్త్రీల మాటలకు వశమయిపోతుందని జ్ఞాపకంవచ్చి వేదనతో హృదయం చీల్చుకుపోయింది. ఆంద్రీని సమ్మోహపర్చిన ఆ పోలండు యువతిమీద కసి తీర్చుకుంటానని బుల్బా ప్రతిజ్ఞ పట్టాడు. అతను తన ప్రతిజ్ఞను నెరవేర్చుకునేవాడే. ఆమె అందచందాలు చూసి దయ దలిచేవాడు కాదు. జడ పుచ్చుకుని కోసక్‌ల ముందుకు బరబరా లాగుకు వచ్చేవాడే. పర్వత శిఖరాలను ముంచెత్తే మంచుగడ్డలా తెల్లగా మెరిసిపోయే ఆమె వక్షోజాలు, బుజాలు నేలకు రాసుకుని రక్తంతో, దుమ్ముతో నిండిపోయేవే, లలితమూ రమణీ

యమూ అయిన ఆమె శరీరాన్ని ముక్కలు ముక్కలు కింద నరికేసేవాడే. కాని భగవంతుడు ఏమి జరగాలని వ్రాసిపెట్టాడో బుల్బాకి తెలియదు. నిద్రవచ్చింది పడుకుని నిద్రపోయాడు.

కోసక్‌లు తమలో తాము ఇంకా మాట్లాడుకుంటూనే ఉన్నారు. నిద్రమత్తుకు లోనుగాని పహారావాళ్లు నెగళ్ళచుట్టూ నిలబడి రాత్రంతా నలువైపులా అతిజాగ్రతగా కాపలా కాస్తు న్నారు.

# 8

సూర్యుడు నడినెత్తికి ఇంకా ఎక్కలేదు. జపరోజియే వారందరికీ సమావేశానికి రమ్మని పిలుపు వచ్చింది. గడీనుంచి తాజావార్తలు! కోసక్‌లు తేనిసమయం కనిపెట్టి తాతార్లు గడీని కొల్లగొట్టారు. దాచిన ధనరాసులు పైకి తీశారు. గడీలో ఉండిపోయిన వారిలో కొందరిని చంపివేశారు. కొందరిని ఖైదీ లుగా పట్టుకున్నారు. పశువుల మందలను, గుర్రపు మందలను తోలుకుని సరాసరి పెరెనోవ్‌కు బయలుదేరారు. మాక్సిమ్ గోలొడుకా అనే కోసక్ ఒక్కడుమాత్రం దారిలో తాతార్ల చేతులలోనుంచి తప్పించుకుని, మీర్జాను పొడిచివేసి, అతని కాసీ కొనకు వేలాడుతున్న డబ్బుసంచి ఊడదీసి, తాతారు దుస్తులు ధరించి, తాతారు గుర్రంఎక్కి రెండు అహోరాత్రులూ పరు గెత్తుతూనే ఉన్నాడు. పరుగెత్తలేక గుర్రం చచ్చింది. ఇంకో గుర్రం ఎక్కాడు. అదీ చచ్చింది. ఇంకోగుర్రం ఎక్కి జపరోజియే

వారు ఉబోన్నవద్ద ఉన్నారని దారిలో తెలుసుకుని వారిముకాం చేరుకున్నాడు. ఆపదవచ్చి పడిందనిమాత్రం చెప్పగలిగాడే గాని ఎలావచ్చిందీ, మిగిలిన జపరోజియేవారు కోసక్ అలవాటు చొప్పున తప్పతాగి పట్టుబడిందీ, సైన్యపు ధనరాసులను దాచిన స్థలం తాతార్లకు ఎలా తెలిసిందీ చెప్పలేక పోయాడు. శక్తి ఉడిగిపోయింది. శరీరమంతా ఉబ్బిపోయింది. మొహం గాలికి కమిలిపోయింది. నిలబడలేక కిందపడి అక్కడే నిద్రపోయాడు.

ఇటువంటపుడు తక్షణమే దోపిడీమూకను వెన్నంటి తరిమి, దోవలోనే వారిని తాకడం కోసక్‌ల నియమం. లేక పోతే బంధితులను ఆసియా మైనరు, స్మిర్నా, క్రిటాదీవులు, లోని బానిసబజార్లకు వెంటనే పంపించివేయవచ్చు. ఇందుమూలంగానే జపరోజియే వారిపుడు సమావేశ మయారు. ఆఖరి మనిషి వరకు నెత్తిమీదనుంచి టోపీలు తీసివేయకుండానే నిలబడ్డారు. నాయకులదగ్గరనుంచి ఆజ్ఞలు స్వీకరించడానిక్కాదు వారిపుడు సమావేశ మయింది. తమలో తాము సమాన ఫాయీలో సమాలోచనలు జరుపుకోవడానికి సమావేశ మయారు.

"ముందుగా పెద్దలు యేం సలహా యిస్తారో యివ్వనీండి" అని సమూహంలోనుంచి కొందరు కేకలుపెట్టారు.

"సలహా చెప్పు, కొచెవాయ్!" అన్నారు కొందరు.

కొచెవాయ్ టోపీ తీసివేసుకుని నాయకుడిలా కాకుండా స్నేహితునిలాగా మాట్లాడుతూ తనకీ గౌరవం ఇచ్చినందుకు కృతజ్ఞత తెల్పుతూ ఇలా అన్నాడు:

"సలహా చెప్పదగిన పెద్దలు, ప్రతిభావంతులు మనలో యెందరో వున్నారు. నన్ను సలహా చెప్పమని గౌరవించి నందున చెపుతున్నా వినండి: కాలం వృథా కానీకండి. తాతారువాళ్ళు యెలాంటివాళ్లో మీకు బాగా తెలుసు. అందుకని వాళ్ళని వెన్నంటండి. మనం వచ్చేదాకా వాళ్లు ఆగుతారా? దోచుకున్నదంతా కనురెప్పపాటు కాలంలో ఖర్చుపెట్టేసి ఆచూకీ కూడా తెలియనీయరు. అందుచేత నా సలహా తక్షణం బయలుదేరాలనే. యిక్కడ మనం తృప్తిగా యుద్ధం చేశాం. కోసక్ల తడాఖా పోలండువారికి తెలియ జేశాం. మన చేతనయిననంత వరకు మన మతానికి జరిగిన అపకారానికి ప్రతీకారం చేశాం. ఆకలితో అలమటిస్తున్న పట్నం మరిలాభంలేదు. అందుచేత నా సలహా బయలుదేరి వెళ్లాలనే!"

"సరే పదండి పోదాం" అని తండాలవారు మేఘ స్వనంతో.

కాని ఈ మాటలు తారాస్ బుల్బాకు ఏమాత్రం సంతృప్తి కలిగించలేదు. కోపంతో, ముడుచుకున్న తెల్లటి కనుబొమలు ఇంకా ముడుచుకున్నాయి. ఎత్తయిన పర్వత శిఖరం మీద పెరుగుతూ మంచుతో తడిసిన నల్లటి పొదలు లాగా ఉన్నాయి ఆ కనుబొమలు.

"ఉహుఁ - నీ సలహా యేం బావుండలేదు" అన్నాడు బుల్బా. "అలా అనడానికి వీల్లేదు. పోలండువారి చేతుల్లో మన వాళ్ళంతా ఖైదీలుగావున్నారనేసంగతి మరిచేపోయినట్లున్నావు. అతి పవిత్రమయిన, ప్రప్రథమ దర్మం సహచర ధర్మం, దానికి

వ్యతిరిక్తంగా నడుపుదామని చూస్తున్నావు. మన సోదర కోసక్‌లను వారి ఖర్మానికి వారిని వదిలేస్తే శత్రువులు వారిచర్మం వొలిచేస్తారు. యుక్రెయిన్‌లో కోసక్ సేనానాయకులను, రష్యన్ యోధులను చీల్చి చండాడి బళ్ళమీద గ్రామగ్రామాన వూరేగించినట్లు వూరేగిస్తారు. మనం పవిత్రమని తలచిందంతా అపవిత్రం చేసింది చాలదా? మనం యెటువంటివాళ్ళం? అడుగుతున్నా చెప్పండి. ఆపదలోవున్న సహచరులను వదిలేసి కుక్కలలాగా విదేశాలలో చావనిచ్చే కోసక్ ఒక కోసకేనా? గౌరవానికి విలువ యివ్వకుండా మొహంమీద వుమ్మేసి అదమాయిస్తూంటే మిన్నకుండె పరిస్థితే వస్తేసరే, నన్ను అని పనిలేదు. నేను ఒంటరిగా యిక్కడే వుండిపోతా!"

జపరోజియేవారంతా తటపటాయించారు.

"తాతార్ల చేతుల్లోకూడా మన సహచరులు వున్నారనే విషయం మరిచేపోయినట్లున్నావు" అన్నాడు కొచెవాయ్. "వెంటనే గనక మనం వాళ్ళని రక్షించకపోతే జీవితాంతం బానిసగా పోషండులకు విక్రయింపబడతారు. అంతకన్న కుక్కచావు చావడం మెరుగు. రక్తం ధారపోసి సంపాదించిన ధనరాసులు వారివశమయినాయని మరిచేపోయావా?

ఏమనాలో తెలియక ఈ విషయం కూడా కోసక్‌లు ఆలోచించసాగారు. నెత్తిమీదకు అపకీర్తి చేతులారా తెచ్చుకోవడం ఎవరికీ ఇష్టంలేదు. జపరోజియే సేనలోకల్లా ముసలివాడయిన కాస్యాగ్‌బోల్‌డ్సుగ్ ముందుకు వచ్చాడు. అతనంటే కోసక్‌లందరికీ గౌరవమే. రెండుసారులు అతనిని కొచెవాయ్‌గా ఎన్నుకున్నారు. యుద్ధంలో ఎవరికీ తీసిపోయే

ఘటం కాదు. వృద్ధాప్యంతో పండిపోయాడు. దండయాత్రల్లో పాల్గొనడం ఎన్నడో మానుకున్నాడు. సలహా ఇవ్వడం కూడా అతనికి ఇష్టం ఉండేది కాదు. కోసక్ వర్గాల మధ్య ఒత్తిగిలి పండుకుని యుద్ధగాథలు, సాహస గాథలు వినడం అతనికెంతో ప్రీతి. వారి సంభాషణలో ఎన్నడూ పాల్గొనేవాడు కాదు. ఒక్క ముక్కకూడ విడిచిపెట్టకుండా తినేవాడు ఇరవయి నాలుగు గంటలూ పైపు నోట్లో పెట్టుకుని వేలితో పైపు లోని బూడిద నొక్కుతూండేవాడు. కళ్ళు సగం మూసుకునీ ఈ విధంగా గంటలకు గంటలు గడిపేవాడు. నిద్రపోతున్నాడో, కథలు వింటున్నాడో కోసక్కులకు తెలిసేది కాదు. ఇదివరలో దండయాత్రలకు బయలుదేరకుండానే ఇంటిపట్టున ఉండిపోయాడు. కాని ఈ తడవ ఇంటిపట్టు నిలవలేక పోయాడు. కోసక్ సాంప్రదాయాను సారంగా చేయిఊపి," యేమవుతుందో అవుతుంది. నేను వస్తాను, కోసక్ రాజ్యానికి నేనూ యింకా వుపయోగపడవచ్చు" అని బయులుదేరాడు.

సభవారి ముందుకు కాస్త్యాన్ వచ్చేసరికి అంతా నిశ్శబ్దంగా నిలబడ్డారు. అతని ప్రసంగం విని చాలాకాల మయింది. ఏం చెపుతాడో వినాలని అందరికీ కుతూహలం కలిగింది.

"సోదర మహాజనులారా! మీ అభిప్రాయ మేమిటో తెలియజేయవలసిన సమయం వచ్చింది. వినండి, బిడ్డలారా, యీ ముసిలివగ్గు మాటలు నాలుగు వినండి. కోసక్ సెనానాయకుడుగా మిమ్ములను, మీ ధనరాసులను రక్షించవలసిన కొంచెవాయ్ అంతకంటే వేరే ఎలా మాటాడుతాడు? అంతే! నే చెప్పదలచిన మొదటి మాట యిదే యిక రెండోమాట కలనల్ తారాస్ చెప్పిందాంట్లోకూడా యెంతో సత్యంవుంది. చల్లగా

వేయేళ్ళు వర్ధిల్లును గాక! యిటువంటి యోధులు మన యుక్రె యిన్‌లో యెందరో జన్మిస్తారుగాక! కోసక్‌ల ప్రధమ ధర్మం. ప్రధమ గౌరవం సహచర ధర్మానికి కట్టుబడి వుండడం. యింత కాలమయింది. నా జీవితంలో కోసక్ తన సహచరుడిని పరిత్యజించడంగాని ద్రోహం చేయడంగాని యెరగను. యిక్కడి కోసక్‌లు, అక్కడ గడీలోని కోసక్‌లు అందరూ మన సహచరులే! ఒకచోట యెక్కువమంది వున్నారు, ఒకచోట తక్కువమంది వున్నారనే ప్రసక్తేలేదు. అందరూ మన సహచరులే, అందరూ మనకు ప్రియతమమయిన వారే. అందుచేత నేచెప్పేదేమిటంటే తాతార్ల చేతుల్లో చిక్కినవారిని ప్రేమించేవారంతా తాతార్ల వెంటబడండి. పోలండు వారిచేతుల్లో చిక్కినవారిని ప్రేమించేవారు. న్యాయానికి కట్టుబడి వుండదలచినవారు యిక్కడ వుండిపోండి. కొచెవాయ్ సగంమందికి నాయకత్వం వహించి తాతార్ల వెంట బడి తన విధ్యుక్త ధర్మాన్ని నెరవేర్చాలి. తక్కిన సగంమంది కొచెవాయ్‌ని యెన్నుకోవాలి. తల నెరసిన యీ ముదుసలి మాట వినండి కొచెవాయ్‌గా తారాస్ బుల్బా కంటె తగినవాడింకొకడు లేడు. శౌర్యపరాక్రమాలలో యెవరూ అతనికి సరిరారు."

ఇలాచెప్పి కాస్యాన్ ఊరుకున్నాడు. ఆ ముదుసలి కోసక్ చెప్పిన ఈ సలహాకి అందరూ సంతోషించారు. అంతా తమతమ టోపీలు తీసి పారవేసి, "బాట్కో! చాలాకాలంగా నువ్వు నోరు మెదపలేదు. యెలాగయితేనేం యిపుడు మాట్లాడావు. కోసక్ రాజ్యానికి యేదో విధంగా వుపయోగపడతానడం వృధా పోలేదు. అలా జరిగింది కృతజ్ఞులం" అని అరిచారు.

"అయితే యిందుకు మీరంతా అంగీకరించి నట్లేనా?" అని అడిగాడు కొచెవాయ్.

"ఆ-అంగీకరించాం" అని అరిచారు కోసక్‌లు.

"అలాఅయితే రాడా ఆఖరయినట్లేనా?"

"ఆఁ-" అని మళ్ళీ అరిచారు కోసక్‌లు.

"బిడ్డలారా! యిక నా ఆజ్ఞలు వినండి." అన్నాడు కొచెవాయ్. ముందుకువచ్చి టోపీ పెట్టుకున్నాడు. జపరొజియే వారిలో ప్రతిఒక్కడూ ఆచారప్రకారం నెత్తిమీది టోపీలు తీసి వేసుకుని నేలమీదనే నిలకడగా దృష్టి నిలుపుతూ నిలబడ్డారు. యిక రెండుగా చీలిపొండి. వెళ్ళదలచినవాళ్ళు కుడివైపుకి, వుండిపోదలచినవాళ్ళు యెడమవైపుకి వెళ్ళి నుంచోండి. తండాలో యెక్కువమంది యెటువెళితే వారి నాయకుడుకూడా అటే వెళ్ళాలి. తక్కినవారు యితర తండాలలో చేరిపోవాలి."

కొందరు కుడివైపుకి, కొందరు ఎడమవైపుకి వెళ్ళి, నిలబడ్డారు. తండాలో ఎక్కువభాగం ఎటువెళ్ళితే ఆ తండా నాయకుడు అటువెళ్ళాడు. తక్కినవారు ఇతర తండాలలో చేరి పోయారు. తీరాచూస్తే రెండువైపులా సమంగానే జనం ఉన్నారు. నెజమాతు తండావారు, యుమాన్, కానీవ్ తండాల వారు, పోపోవిచ్, స్టెబ్లికివ్, టిమొషెన్కా తండాలవారిలో అధికభాగం ఉండిపోవడానికే నిశ్చయించుకున్నారు. తక్కినవారంతా తాతార్ల వెంటపడడానికి నిశ్చయించుకున్నారు. ఇరుపక్షాలలోనూ బలపరాక్రమవంతులు చాలామంది ఉన్నారు. తాతార్లను వెంబడించడానికి నిశ్చయించుకున్నవారిలో చెరెవాటీ, పొకోటిపోల్సే, లెమిష్, నోమ్రాప్రొనొప్రొవిచ్‌లు ఉన్నారు.

బెరవాటీ మంచివాడు, ముదుసలి, డెమిడ్ పొపొవిచ్ కాలు నిలకడలేని మనిషి. ఎక్కువకాలం ఒకచోట నిలవలేడు. అందు కని అతనూ వీరితో చేరాడు. పోలండువారితో పోరాడాడు, ఇక తాతార్లను ఢీకొనాలని అతని కోరిక. నాస్టుగన్, ప్రొక్రిష్టా, నెలిలఖీ మొదలయిన తండా నాయకులు కూడా ధైర్యవంతులు. సుప్రసిద్ధులు. వీరుకూడా తాతార్లతో తలపడి తమ బల పరాక్రమాలు, కత్తి తడాఖా చూపాలని ఉవ్విళ్లూ రారు. వెనక ఉండిపోదలచినవారితో కూడా తండా నాయ కులు డెమిట్రోవిచ్, కుకుబెంకో, వెర్టిక్యోస్ట్, బాలబాన్, ఒస్టాప్ బుల్బా వంటి ఉత్తమయోధులు, వోవ్టుజెంకో, బెరివిబెంకో, స్టెపాన్‌గుస్కా, ఒక్రిమ్‌గుస్కా, మికొలాగుస్కా, జడరోజ్ని, మిటెలిట్సాయా, ఇవాన్, జక్రుటిగుబా, మోసయిబిలో, డెగట్యారెంకో, సిడొరెంకో, పిసరెంకో త్రయంలాంటి ప్రఖ్యా తులు స్థూలకాయులూ చాలామంది ఉన్నారు. వీరంతా దేశ దేశాలూ తిరిగినవారే. అంటోలియన్ తీరాల వెంబడీ, క్రిమియా చవిటి భూములలో మైదానాలలో, నీపర్ నదిలోకి వచ్చిపడే చిన్నా పెద్దా నదుల వెంట, కయ్యాల వెంట దీవుల వెంట, దిమ్మరిలినవారే. మోల్డేవియా, వాలాచియా, టర్కీలను సందర్శించారు. రెండు చుక్కానుల కోసక్ పడవల మీద నల్ల సముద్ర మంతా తిరిగి వచ్చారు. యాభై పడవలతో పెద్ద పెద్ద నావలమీద దాడిచేసారు. టర్కీ నావలు చాలా ముంచివేశారు. వారి జీవితకాలంలో వారు కాళ్ళులకు ఉపయోగించిన మందు ఇంతా అంతా కాదు. మాంచి ఖరీదయిన పట్టు, మొఖమల్లు వస్త్రాలు చించి అనేకసార్లు మేజోళ్లుకింద వాడారు. నడుం పటాకలకు వేలాడే సంచులు బంగారు నాణేలతో నింపేవారు.

తాగుడుకు, విందులకు వారు వెచ్చించిన ధనం ఎంతో లెక్కించడం ఎవరికీ సాధ్యంకాదు. ఆ ధనంతో ఇతరులు జీవితమంతా హాయిగా గడపవచ్చు. నిజమయిన కోసక్ సాంప్రదాయాను సారం ప్రపంచమంతా సంతోషించాలని, అందరినీ ఒకేవిధంగా సమాదరిస్తూ, పాటకులను పిలిపించి, పాడిస్తూ ఆ ధనమంతా దుబారా చేసేవారు. ఇప్పటికీ, దురదృష్టవశాత్తూ తాతార్లు గడీమీద పడితే, కప్పులు, వెండిగిన్నెలు, గాజులు మొదలయిన ద్రవ్యరాసులు వారికంట పడకుండా నీపర్ నది దీవుల మీది రెల్లులో చాలామంది దాచి ఉంచారు. కోసక్‌లే వాటిని ఎక్కడ పాతిపెట్టిందీ మరిచిపోయినపుడు ఇక తాతార్ల చేతికి ఎలా చిక్కుతాయి? అక్కడనే ఉండిపోయి విశ్వాసపాత్రు లయిన సోదరులకు, క్రైస్తవ మతానికి జరిగిన అవమానానికి ప్రతీకారం తీసుకోదలచిన కోసక్‌లు ఇలాంటివారు!

ముదుసలి కోసక్ కాస్యాన్ వారితోపాటు అక్కడే ఉండిపోవడానికి నిశ్చయించుకుని అన్నాడు :

"నాకు వృద్ధాప్యం వచ్చేసింది. తాతార్లను తరిమికొట్టే శక్తిలేదు. కోసక్ వీరులు చనిపోవడానికి తగినస్థలం యిదే. నాకు ఆయుర్దాయం సరిపోయినపుడు క్రైస్తవమత రక్షణకు యుద్ధంచేస్తూ చనిపోయే అదృష్టం పట్టించమని చాలాకాలంగా భగవంతుడిని ప్రార్థిస్తున్నాను. అలాగే తటస్థించింది. ముసలి కోసక్‌కి యిక్కడ మరణించడంకంటె కీర్తి వేరేవుండదు."

"అందరూ విడిపోయి తండాలవారిగా రెండు వరుసలుగా బారులు తీరగానే కొచెవాయ్ వారిమధ్యగా నడుస్తూ, సోదరు లారా! సంతృప్తిగా వుందా?" అని అడిగాడు.

"ఓ-సంతృప్తిగానే వుంది బాబ్కో!" అని కోసక్‌లు జవాబిచ్చారు.

"అలాఅయితే ఒకరినొకరు ముద్దిడుకొని శెలవు పుచ్చుకోండి, తిరిగి కలుసుకుంటారోలేదో యేం తెలుస్తుంది! మీనాయకుని మాట వినండి. కాని తగిన పనిచేయండి. కోసక్ గౌరవం నిలబెట్టండి !"

అక్కడఉన్న కోసక్‌లంతా ఒకరి నొకరు ముద్దిడుకున్నారు. మొదట నాయకులు ప్రారంభించారు. నెరసిన మీసాలు తడుముకొని ఒకరి చెక్కిల్లు ఒకరు ముద్దిడుకున్నారు. ఒకరి చేతులు ఒకరు చాలాసేపు పట్టుకున్నారు. 'సోదరా! మనంతిరిగి కలుసుకుంటామా ?" అని ఒకరి నొకరు అడగాలని కాంక్షించారు. కాని మాట్లాడకుండా ఊరుకున్నారు. ముందు చేయవలసిన పని ఎంతో ఉందనే పరిజ్ఞానంతో ఇలా ఒకరిదగ్గర ఒకరు శెలవు పుచ్చుకుంటూంటే తల నెరసిన పెద్దలు ఆలోచనా నిమగ్నులయినారు. కాని కోసక్ సేన తగ్గిపోయిందనే విషయం పోలండువారికి తెలియకుండా చేయడానికని వెంటనే విడిపోకుండా చీకటిపడేవరకూ ఆగాలని నిశ్చయించుకున్నారు. ఆ తరవాత మధ్యాహ్న భోజనాల నిమిత్తం ఎవరి మకాంలకు వారు వెళ్ళిపోయారు.

మధ్యాహ్న భోజనానంతరం రోడ్డుపట్టి వెళ్ళవలసిన వారు అటువంటి సురక్షిత ప్రదేశంలో సుఖంగా నిద్రపోవడం ఇదే ఆఖరిసారి అని ముందుగా గ్రహించిన వారిలాగా పండుకుని ఒడలు తెలియకుండా చాలాసేపు నిద్రపోయారు. సూర్యాస్తమానం అయేవరకు అలాగే నిద్రించారు. సూర్యుడు అస్త

మించి, చీకటి పడగానే బళ్లకు తారువేయడం ప్రారంభించారు. అంతా సిద్ధమయిన తరవాత ముందుగా బళ్ళను పంపించి, మళ్లీ ఇంకోసారి టోపీలుతీసి ఆడించి తమ సోదరులవద్ద శెలవు తీసుకుని మెల్లగా బళ్ళవెనక నడవసాగారు. పదాతుల వెనక ఆశ్విక దళం కేకలు పెట్టకుండా, చివరికి ఈలలుకూడా వేయకుండా మెల్లగా కదం తొక్కుకుంటూ సాగిపోయి అంధకారంలో ఐక్యమయిపోయింది, గుర్రాల డెక్కల టకటక ధ్వని, చీకటిలో సరిగా తారువేయకపోవడం వల్లనో ఎందుచేతనో సరిగా తిరగని బండిచక్రాల కిర్రుతప్పితే మరి ఏమాత్రం చడీచప్పుడూ కావడం లేదు.

చీకటిలో ఏమీ గోచరించకపోయినా వెనక దిగబడిపోయినవారు చాలాసేపువరకు చేతులు ఆడిస్తూనే ఉన్నారు. వెనుదిరిగి తమతమ స్థావరాలకు వెళ్ళి తళతళా మెరిసే నక్షత్రాల కాంతిలో సగంబళ్ళు, చాలా మంది సోదరులు వెళ్ళిపోవడం గమనించేసరికి వారి హృదయాలు విచారంతో నిండిపోయాయి. అందరూ ఆలోచనా నిమగ్నులయి తలలు వాల్చేసుకున్నారు.

కోసక్ శ్రేణులు విచారంలో పడిపోవడం, ఆ విచారం వారిని కుంగదీసేయడం తారాస్ గమనించాడు. కాని గొడవ చేయలేదు. సోదరుల ఎడబాటుకు కలిగిన విచారానికి వారు అలవాటు పడిపోయేటట్టు చేయాలనీ, యుద్ధ నినాదానికి ఆవేశం ఉత్సాహం కలిగి ఇనుమడించిన శక్తితో పోరాడడానికి వారిని సన్నద్ధం చేయాలని బుల్బా సంకల్పం. ఇదంతా విశాలమయిన, శక్తివంతమయిన స్లావ్ ప్రకృతిసాధ్యం. తక్కినవారికీ వీరికీ సముద్రానికి, పిల్లకాలవకి ఉన్నంత అంతరం ఉంది. తుపాను వీచినపుడు సముద్రం గర్జిస్తుంది. ఉరుముతుంది.

కెరటాలు ఆకాశం ఎత్తున లేస్తాయి. ఇదేదీ పిల్లకాలవకి సాధ్యం కాదు. కాని గాలి స్తంభించి ప్రశాంతంగా ఉన్నపుడు దరిలేని ఉపరితలం తళతళలాడుతూ నదికంటె స్వచ్ఛంగా కనుల పండువగా ఉంటుంది.

విడిగా పడిఉన్న శకటంమీది సరుకు ఊడదీయమని బుల్బా సేవకులను ఆజ్ఞాపించాడు. కోసక్ శకటాలలోకల్లా ఇది పెద్దది, బరువయింది, చక్రాలు భారీవి. రెండు ఇనపకట్టల మధ్య అమర్చబడ్డాయి. దానిమీద సరుకు పూర్తిగా ఉంది. సరుకు మీద గుర్రం చర్మం, ఎద్దు చర్మం కప్పి తారు పూసిన పగ్గాలతో బిగించి కట్టారు. బుల్బా నేలమాళిగలో చాలాకాలంగా పడిఉన్న మంచి పాత ద్రాక్ష సారాతో నింపిన పీపాలు, డబ్బాలు దానిమీద వేసాడు. ఏదోఒక మహత్తర సమయంలో ఉపయోగపడుతుందనే ముందు ఆలోచనతో ఈ సారాకూడా తెప్పించాడు. తరతరాలవరకూ కీర్తింపబడే యుద్ధంలో పాల్గొనవలసి రావచ్చు. అటువంటపుడు అటువంటి మహత్తర సమయంలో మహత్తర భావాలు రేకెత్తేందుకు కోసక్‌లు ఆఖరివాడివరకు ప్రతిఒక్కరూ ఈ అమూల్యమయిన మద్యం సేవించవచ్చు. బుల్బా ఇచ్చిన ఆజ్ఞలు వినగానే అతని సేవకులు శకటం దగ్గరకు గబగబా పరుగెత్తుకు వెళ్ళి పగ్గాలు కోసివేశారు. దళసరి ఎద్దుచర్మాలు గుర్రపు చర్మాలు చించిపారేశారు. డబ్బాలు, సీసాలు, కిందకు దింపారు.

"అన్ని తీసుకోండి" అన్నాడు బుల్బా. "వున్నవన్నీ తీసుకోండి. యేది దొరికితే అది - తెడ్డులు, గుర్రాలకు నీళ్ళ

పెట్టే బొక్కెనలు, హస్తకవచాలు, టోపీలు - తీసుకోండి. యివేవీ దొరక్కపోతే పురుషుళ్ళు పట్టండి"

అక్కడ ఉన్న కోసక్‌లు అంతా తెడ్డో, బొక్కెనో. హస్తకవచమో, టోపీయో, ఏది దొరికితే అది తీసుకున్నారు. ఏదీ దొరకనివారు పురుషుళ్లు పట్టారు. బుల్బా సేవకులు వారిమధ్యగా తిరుగుతూ డబ్బాలలోనుంచి, పీపాలలోనుంచి సారా పోయసాగారు అందరూ కలిసి ఒకేసారి తాగడానికి తాను సంజ్ఞ చేసేవరకూ ఎవరూ త్రాగరాదని తారాస్ ఆజ్ఞాపించాడు. ముందుగా ఏదో మాట్లాడాలని అతని ఉద్దేశం నిలవ సారా ఎంత ఘాటుదయినా ఎంత ఉత్సాహం రేకెత్తించ గల్గిందైనా దానితోపాటు తూచితూచి ఒక్కమాట మాటాడితే ఆ సారా ఘాటు, ఉత్సాహం ఇనుమడిస్తాయని తారాస్‌కు బాగా తెలుసు.

"సోదర మహాజనులారా!" అంటూ ప్రారంభించాడు బుల్బా. "నన్ను మీ నాయకుడిగా యెన్నుకున్నారని కాదుగాని, మన సహచరులనుంచి విడిపోతున్నామని కాదుగాని - యింకో సమయంలో అయితే యీరెండూ తగినవే - కాని యిది తగుసమయం కాదు, అయినా మీకు విందు చేయదలిచాను. యిక ముందుముందు యుద్ధాలలో మనం చెమటోడ్చవలసి వుంది. శౌర్యపరాక్రమాలు ప్రదర్శించవలసి వుంది. సహచరులారా! అందరమూ కలిసి ముందుగా, మన సనాతనమతం వర్ధిల్లాలని, అది ప్రపంచమంతటా వ్యాపించే సుముహూర్తం సమీపించాలని, ప్రపంచమంతటా ఒకేఒక పవిత్రమతం వర్ధిల్లాలని, పాషండులంతా క్రైస్తవులుగా మారాలని మద్యం సేవిద్దాం. ఆ తరవాత మన గడీ పాషండుల గుండెలకు బెదు

రుగా వర్ధిల్లాలనీ, సంవత్సరం సంవత్సరం ఒకరికంటె ఒకరు వుత్త ములు, సౌందర్యవంతులు శౌర్యపరాక్రమోపేతులూ అయిన యోధులను వుద్భవింపజేయాలని మద్యం సేవిద్దాం పట్టండి. అటు తరవాత మన పేరుప్రతిష్టలు వర్ధిల్లాలని, సహచరులకు ద్రోహం చేయనివారు స్నేహితులను ఆపదలో విడనాడనివారు ఒకపుడు వుండేవారని మన మనమలు,ముని మనుమలు చెప్పుకోవాలని మద్యం సేవిద్దాం. మనమతం వర్ధిల్లాలి. సోదర మహాజనులారా! మనమతం వర్ధిల్లాలని తాగుదాం పట్టండి !"

"మనమతం వర్ధిల్లాలి" అని సమీప శ్రేణులలో నిలబడ్డ వారు చెవులు గింగురు మనేటట్టు అరిచారు.

"మనమతం వర్ధిల్లాలి" అని వెనక శ్రేణులలోనివారు, ముసిలి ముతకా, అంతా అరిచి మద్యం సేవించారు.

"గడీ వర్ధిల్లాలి !" అని తారాస్ చేయి తలకు పైగా ఎత్తాడు.

"గడీ వర్ధిల్లాలి ! అని తిరిగీ అరిచారు ముందు శ్రేణుల లోనివారు ఖంగుమని ప్రతిధ్వనించే కంచుగొంతులతో. "గడీ వర్ధిల్లుగాక !" అన్నారు వృద్ధులు మెల్లగా తెల్లటి మీసాలు మెలి వేసుకుంటూ. ఇక యువ కోసక్‌లు డేగ పిల్లలలాగా ఆవేశంతో వృద్ధులవెనక "గడీ వర్ధిల్లాలి !" అని అరిచారు.

ఎక్కడో దూరంగా ఉన్న మైదానంలోకి కోసక్‌లు తమ గడీకి వందనం సమర్పించడం వినిపించింది.

"సహచరులారా ! మన పేరు ప్రతిష్ఠలు వర్ధిల్లాలని, యీ భూమ్మీద నివసించే క్రైస్తవు లందరూ వర్ధిల్లాలని ఆఖరి గుక్క తాగుదాం!"

యుద్ధరంగంలోని కోసక్‌లు ఆఖరివాడి వరకూ వారి పేరు ప్రతిష్ఠలు వర్ధిల్లాలని, భూమి మీది క్రైస్తవు లందరూ వర్ధిల్లాలని ఆఖరి గుక్క తాగారు." భూమ్మీది క్రైస్తవులంతా వర్ధిల్లాలి!" అనే కేక తండా శ్రేణులలో ప్రతిధ్వనించింది.

కప్పులు ఖాళీ అయాయి. కాని కోసక్‌లు చేతులు ఇంకా పైకెత్తుకునే నిలబడ్డారు. ద్రాక్షసారాయి సేవించడం మూలంగా వారి నేత్రాలు ఆనందంతో తళతళలాడాయి. యుద్ధంలో లూటీచేసిన ధనం కొల్లగొట్టాలని వారిపుడు ఆలోచించడంలేదు. డకెట్లు, విలువయిన ఆయుధాలు, నగిషీ చెక్కిని అంగరఖాలు, కర్కేషియా గుర్రాలు సంపాదించే అదృష్టం ఎవరికి పడుతుందా అని ఆలోచించడంలేదు. నిమ్నోన్నతా లయిన పర్వతాగ్రాల మీద కూర్చుని, అంతు పొంతూ లేని సముద్రం మీదుగా, చిన్న చిన్న పక్షులు ఓడలు నావలు రక రకాల పడవలు చుక్కలు చుక్కలుగా కనవచ్చే సముద్రం మీదుగా, ఈగల్లాగా గోచరించే పట్టణాలతో ఎత్తుగా పెరగని గడ్డి తోపులతో కనిపించీ కనిపించని తీరాల సముద్రం మీదుగా చూసే రాబందులలాగా మైదానం మీదుగా తేరిపార జూశారు. విధివ్రాత దూరాన మసక మసకగా గోచరించింది. ఆ మైదానమంతా రోడ్లు బంజర్లతో సహా వారి ఎముకలతో నిండిపోయే కాలం, వారిరక్తంతో తడిసిపోయే కాలం, విరిగిపోయిన శవాలతో, కత్తులు కటార్లతో నిండిపోయేకాలం వస్తుంది. నెత్తురుతో తడిసి జడ అల్లుకుపోయిన శిఖర శిరసులు వాలిపోయే మీసాల శిరసులు నలుమూలలా పడి ఉంటాయి. రాబందులు రివ్వున కిందకు దిగివచ్చి వారి కళ్ళను ముక్కుతో పొడిచి గోళ్ళతో పీకుతాయి. కాని నలుమూలలా

వ్యాపించిన ఆ మృత్యుశిబిరం కీర్తి అంతింతనరానిది. సాహసో పేతమయిన వారి కృత్యాలలో ఏ ఒక్కటీ పేరు మాసిపోదు. కోసక్‌ల కీర్తి తుపాకి గొట్టంలోనుంచి వెలువడే మందు పిసరు లాగా నశించిపోదు. తల నెరిసిన వీధి గాయకులు తెల్లటిగడ్డాలు వక్షాలమీద వేలాడుతుండగా తంబురా మీటుతూ పండిన మహో త్సాహంతో ప్రవక్తలలా ఉద్రేకంతో, గంభీరమయిన శక్తివంత మయిన పదజాలంతో వారిని కీర్తిస్తారు వారికీర్తి ప్రపంచమం తటా మారుమోగిపోతుంది. ఆ తరవాత జన్మించే వారంతా వారిని గురించే చెప్పుకుంటారు. కంచుతో నికారసయిన నాణ్య మయిన వెండి కలిపి పోతపోసిన గంట జనులందరినీ ప్రార్థనలకు రమ్మని దూరదూర పట్టణాలకు, పల్లెలకు రాజభవనాలకు గుడిసె లకు వినిపించేటట్టు దివ్యంగా మోగుతుందో, అలానే శక్తివంత మయిన పదజాలం దూరదూరాలకు వ్యాపించి మారుమోగు తుంది.

# 9

జపరోజియేవారిలో సగంమంది తాతార్లను వెన్నంటి వెళ్ళారని పట్టణంలోవారెవరికీ తెలియదు. పురమందిర గోపురం మీదనుంచి పహారావారు శకటాలలో కొన్నింటిని జపరోజియే వారు అడవిలోకి తోలుకువెళ్ళడం గమనించారు. కాని కోసక్‌లు మాటునుంచి అకస్మాత్తుగా దాడిచేయడానికి సన్న ద్ధులు అవుతున్నారని భావించారు. ఫ్రెంచి ఇంజనీరుగా ఇలాగే అభిప్రాయపడ్డాడు. కొచెవాయ్ మాటలు అతురాలా

నిజమయినాయి. ఆ పట్టణంలోనివారంతా కరువును ఎదుర్కో వలసి వచ్చింది. సేనలు తమ అవసరాలను తప్పుడు అంచనాలు వేసుకోవడం అనాదినుంచీ మామూలే. ఇప్పుడూ అలాగే జరి గింది. కోటలోని సేన అకస్మాత్తుగా బయటికి వచ్చి దొమ్మీ యుద్ధానికి దిగింది. కాని ఉద్దండులు సగంమందిని కొసక్‌లు ఊచకోత కోశారు. తక్కినవారు వట్టిచేతులతో పట్టణంలోకి తిరిగి పోవలసివచ్చింది. ఈ దొమ్మీ యుద్ధాన్ని అవకాశంగా తీసుకుని యూదులు సకల విషయాలు ఆచూకీ తీశారు. జపరోజియేవారు ఎక్కడికి, ఎందుకు వెళ్ళింది, ఏ యే నాయ కులు కూడా వెళ్ళింది, ఏ యే తండాలు వెళ్ళింది, ఎంత మంది వెళ్ళింది, ఎంతమంది వెనక దిగబడి పోయింది, వారు ఏ ఏ ఎత్తుల మీద ఉన్నదీ, కొద్ది నిమిషాలలో పట్టణంలోని వారందరికీ తెలిసిపోయింది. సేనానులు ధైర్యం తెచ్చుకుని యుద్ధానికి సిద్ధమయారు, పట్టణంలోని గందర గోళాన్నిబట్టి సంగతంతా గ్రహించి తారాస్ తక్షణమే చర్యలు తీసుకున్నాడు. కోసక్‌లకు ఆజ్ఞలు, ఆదేశాలు జారీ చేశాడు. తండాలను మూడు ముఠాలుగా చీల్చి వారిచుట్టూ కాట్రగడ లాగా శకటాలను నిలిపాడు. ఈ యుద్ధతంత్రం మూలంగా కోసక్‌లు తరుచు అజేయులుగా తయారయేవారు. రెండు తండాలవారిని మాటునుండి అకస్మాత్తుగా దాడి చేయమని బుల్బా ఆజ్ఞాపించాడు. యుద్ధభూమి కొంతభాగంలో మొన చెక్కినవాడి కర్రముక్కలు పాతించాడు. విరిగిపోయిన తుపా కులు, బల్లాలు విరజిమ్మించాడు. సాధ్యమయితే శాత్రవ అశ్విక దళాలను ఇందులోకి తరమాలని అతని ఉద్దేశం. పనులన్నీ సంతృప్తికరంగా జరిగిన తరవాత తారాస్ కోసక్‌లను ఉద్దే

శించి ప్రసంగించాడు. అయితే వారిని ఉత్సాహ పరుద్దామని కాదు, తన హృదయంలోనిదంతా వెళ్ళగక్కాలనే అతని అభి ప్రాయం. తన ప్రసంగంతో నిమిత్తం లేకుండానే వారంతా ఉత్సాహంగా ఉన్నారని అతనికి తెలుసు.

"మహాజనులారా! మన సహచరధర్మం అంటే యేమిటో మీకు చెప్పదలిచాను. మనదేశం ఎంత గౌరవ పాత్రమయిందో మీకు మీ తండ్రులు, తాతలు చెప్పేవుంటారు. మనదేశం సంగతి గ్రీకులకు బాగా తెలియజేశాం. కాన్‌స్టాంటినోపుల్ నుంచి కప్పం పుచ్చుకున్నాం. మన పట్టణాలు చాలా భాగ్య వంతమయినవి. మనకూ దేవాలయాలున్నవి. మనకూ సంస్థా నాధీశులు ఉన్నారు. కాని మన సంస్థానాధీశులు రష్యన్ జాతి వారు. కాథలిక్కులలా పాషండులు కారు. యిదంతా మనల నుంచి దోచుకున్నారు. అంతా నశించిపోయింది. మనమొక్క రమే అనాధులలాగా మిగిలాం. మనదేశం సమర్థమయిన భర్తను గోల్పోయిన స్త్రీలా విలపిస్తోంది. అటువంటి సమ యంలో, సహచరులారా! మనం సోదర ధర్మంతో చేతులు కలుపుకున్నాం. యిదీ మన సహచరధర్మానికి ప్రాతిపదిక. సహచర ధర్మం కంటే పవిత్ర బంధనం లేదు. తల్లీ తండ్రీ తమ సంతానాన్ని ప్రేమిస్తారు. సంతానం తమ తలి దండ్రులను ప్రేమిస్తారు. కాని అది వేరే విషయం. అడవి మృగాలు కూడా తమ సంతానాన్ని ప్రేమి స్తాయి. ఒక్క మానవుడికే రక్తబంధుత్వం కాక ఆత్మ బంధుత్వం తెలుసు. యితర దేశాలలో కూడా సోదర ధర్మం వుంది. కాని రష్యన్ గడ్డమీదలాగా యెప్పుడూ ఎక్కడాలేదు. మీలో చాలా మంది విదేశాలలో సంవత్సరాల కొలదీ

గడిపి వుంటారు. మీలాంటి భగవత్సేవకులను ఆయా దేశాలలో మీరు చూసి వుంటారు. మీ స్వజనులతో మాట్లాడినట్లే వారితోనూ మాట్లాడి వుంటారు. హృదయ పూర్వకంగా చెప్పాలంటే వారు తెలివిగలవారే అయి వుండవచ్చు. కాని వారు మీలాంటి మనుషులు కారు. ఉహుఁ - సోదరులారా! రష్యన్ మానవాత్మ ప్రేమించినట్లు - హృదయంతోనే కాదు, తదితరమయిన వాటితోనే కాదు, భగవంతుడు యిచ్చినదాని అంతటితో సర్వస్వంతో ప్రేమించడం" ఇంతవరకు చెప్పి తారాస్ చేయి ఊపి, నెరిసిన తల ఆడించి, మీసాలు మెలితిప్పి తిరిగీ సాగించాడు. "ఉహుఁ- యింకెవరూ ఆ మాదిరిగా ప్రేమించలేరు. మనభూమిమీద కపటం వేళ్లూనిందని నాకు తెలుసు. తమ గోధుమ బస్తాలు, గడ్డివాములు' గుర్రపు మందలను గురించి మాత్రమే కొందరు ఆలోచిస్తున్నారు. కొందరు తమనేల మాళిగాలలోని సారా డబ్బాలను గురించి మాత్రమే ఆలోచిస్తున్నారు. పాషండుల ఆచారాలను అనుకరిస్తున్నారు. మాతృభాషను యేవగించుకుంటున్నారు. మన దేశస్తులు ఒకరితో ఒకరు మాట్లాడుకోవడం మానేసారు. నడిబజారులో ఆత్మంటూ లేని పశువులను అమ్మినట్టే స్వదేశస్తులను అమ్ముతున్నారు. విదేశీ రాజులు - ఉహుఁ - రాజులుకూడా కాదు, బూట్లకాళ్ళతో మూతిమీద తన్నే పోలిష్ ప్రభువుల అనుగ్రహం వారికి సోదరధర్మం కంటె యెక్కువ ప్రియమయినది. కాని యీ దుర్మార్గులలో దుర్మార్గుడికికూడా, అతడు యెంతగా పతనమయిపోయినా, రష్యన్ భావాకణాలు రగులుతునే వుంటాయి. యేదో ఒక రోజున అవి ప్రజ్వరిల్లుతాయి. అపుడు ఆ దౌర్భాగ్యుడు చేతులు నలుపుకుంటూ, జుట్టు పీక్కుంటూ,

వ్యర్థజీవితాన్ని బిగ్గరగా తిట్టుకుంటూ, యెన్ని బాధలకయినా లోనయి తమ అప్రతిష్టను తొలగించుకోవడానికి సిద్ధమవుతారు. మనరష్యన్‌గడ్డమీది సహచరధర్మం అంటే యేమిటో వారు తెలుసుకొందురుగాక! యిక చావడానికి - చావడానికి మనం సిద్ధమయినట్లుగా వారిలో యే ఒక్కడూ సిద్ధం కాలేదు. ఉహుం - ఒక్కడూ సిద్ధంకాడు. వారి పిరికిగుండెలు వారిని అందుకు పాల్పడనీయవు!"

అటామన్ ఈ విధంగా ప్రసంగించాడు. ప్రసంగించి ఊరుకున్న తరవాతకూడా సాహస కృత్యాలతో నెరసిన తల ఆడిస్తూనే ఉన్నాడు. అక్కడ నిలబడి విన్నవారంతా అతని మాటలకు చలించిపోయారు. ఆమాటలు వెళ్ళి వారి హృదయాలను సూటిగా తాకాయి. శ్రేణులలోని వృద్ధులు కదలకుండా నిలబడి తలలు వంచుకున్నారు. కళ్ళు నీళ్ళతో నిండిపోయాయి. చొక్కా చేతులతో వాటిని తుడుచుకున్నారు. ఆ తరవాత అందరూ ఒక్కుమ్మడిగా చేతులు ఊపారు, తలలు ఆడించారు. బాధల మూలంగా, శ్రమమూలంగా ధైర్య సాహసాల మూలంగా జీవిత కష్టాల మూలంగా తెలివిమీరిన మానవుల హృదయాలలో నసించే ప్రియతమ భావాలను, ఆ భావాల వాసనే తెలియక, ముదుసలి తండ్రులకు నిత్యసంతోషం కలిగేలాగా యవ్వనోత్సాహంతో నిర్మల యువ హృదయాలతో ఆకాంక్షించే భావాలను వారిలో ముదుసలి బుల్బా రేకెత్తించాడు.

ఈలోగా శత్రుసేనలు పట్టణం బయటికి వచ్చిపడసాగాయి. ఢంకాలు మారుమోగాయి. బాకా ధ్వనులు చెలరేగాయి. అసంఖ్యాక పరివారంతో నడుంమీద చేతులు వేసుకుని ప్రభువులు గుర్రాల మీద స్వారిచేసుకుంటూ వచ్చారు. బొద్దు

పాటి సేనాధిపతి ఆజ్ఞలు జారీచేశాడు. భయపెడుతూ ఆయుధాలు పైకెత్తి, తుపాకులు బారుచేసి, నిప్పులు కక్కుతూ కంచుకవచాల తళతళలతో కొసక్ మకాంల మీద ఒక్కుమ్మడిగా వచ్చిపడ్డారు.

కోటకు తుపాకి దూరంలోకి శత్రువులు రావడం చూసి కోసక్ యోధులు తుపాకి గుళ్లు వర్షం కురిపించాయి. విడుపు లేకుండా కాల్పులు సాగించారు. ఆ తుపాకి ధ్వనులు ఉరుములలాగా నలుదిక్కులా ప్రతిధ్వనించి ఒకేఒక ఉరుముగా మిళితమయినాయి. ఆ మైదానమంతా పొగ కప్పివేసింది. ఊపిరి పీల్చుకోవడానికయినా ఆగకుండా జపరోజియేవారు కాల్పులు సాగించారు. వెనక ఉన్నవారు ముందు ఉన్నవారికి గుళ్ళు కూరి తుపాకులు అందించారు. కోసక్‌లు తిరిగి గుళ్ళు కూరకుండా ఎలా కోసక్‌లు కాల్పులు సాగిస్తున్నదీ అర్థంగాక శత్రువులు దిగ్భ్రమ చెందారు. ఉభయ సేనలను పొగ కమ్మివేసింది. కన్ను కనిపించడం లేదు. ఒకరి తరవాత ఒకరు ఎలా రణరంగంలో కూలిపోతున్నదీ ఎవరికీ కనిపించలేదు. కాని పోలండువారికి కోసక్ తుపాకిగుళ్ళ తడాఖా తెలిసివచ్చింది. వ్యవహారం ఎంతగా విషమించింది కూడా గ్రహించారు. పొగ నుంచి తప్పించుకోవడానికి వెనకడుగు వేసి చూసుకునే సరికి వారి జనం చాలామంది కనిపించలేదు. కోసక్‌లలో నూటికి ఒకరిద్దరు మాత్రమే హతులయినారు. అయినా వారు ఒక్క నిమిషం కూడా వ్యవధి ఈయకుండా కాల్పులు సాగిస్తూనే ఉన్నారు. ఆ విదేశీ ఇంజనీరు సైతం కోసక్ యుద్ధ తంత్రానికి చకితుడయి పోయాడు. అతని జన్మలో ఎన్నడూ ఇలాంటి యుద్ధ తంత్రం చూసి ఎరగడేమో అప్పటి కప్పుడు అన్నాడు:

"యీా జపరోజియే వాళ్ళు మహా ధైర్యస్తులు. యీా పరదేశా లలో కూడా యీా విధంగానే యుద్ధాలు జరగాలి!" వెంటనే ఫిరంగులను కోసక్ మకాంల మీదికి తిప్పవలసిందిగా సలహా ఇచ్చాడు. పోతఇనుప ఫిరంగులు గర్జించాయి. భూమి వణికి పోయింది. దూరదూరాల పెళ పెళమంది. పొగ మైదాన మంతటా ఇంకా దట్టంగా కమ్మింది. మందు పొగ వీధులలోకి చౌకులలోకివ్యాపించింది. కాని ఫిరంగులు అమిత ఎత్తుగా బారు చేయబడ్డాయేమో వేడి వేడి గుళ్ళు మరీ పెద్దవంపు తిరిగాయి. భయంకర నినాదంతో అవి కోసక్ల తలల మీదుగా భూమి లోకి చొచ్చుకు పోయాయి. భూమి బద్దలయి మట్టి పెళ్ళలు రివ్వున పైకి ఆకాశం ఎత్తున లేచాయి. నేర్పులేమికి జుట్టు పీక్కుని ఆ ఫ్రెంచి ఇంజనీరు చుట్టూ కోసక్ తుపాకీలు నిప్పులు కురిపి స్తున్నా లెక్కచేయకుండా స్వయంగా ఫిరంగులు బారుచేసి పేల్చడానికి పూనుకున్నాడు.

దూరాన్నుంచే తారాస్, నెజమాయ్, స్టెబ్లికివ్ తండాలు ప్రాణాపాయంలో చిక్కుకోవడం చూసి, ఉరుము ఉరిమినట్లు, "తక్షణమే శకటాలకు దూరంగా తొలగి గుర్రాలు యెక్కండి!" అని కేక పెట్టాడు. కాని కోసక్లకు ఈ రెండు పనులు చేయ డానికి వ్యవధి చిక్కకపోయేదేగాని ఇంతలో ఒస్టాప్ గుర్రాన్ని దౌడుతీయిస్తూ శత్రువుల మధ్యకి ఉరికాడు. ఆరుగురు ఫిరంగి వాళ్ళ చేతులలో నుంచి అగ్నిదండాలను ఎగరగొట్టివేశాడు. ఇంకా నలుగురి దగ్గరకు చేరుకునేవాడేగాని పోలండువారు వెనకకి తరిమారు. ఇంతలో ఫ్రెంచి ఇంజనీరు కోసక్లు ఇంత వరకు ఎన్నడూ చూడనంతటి పెద్దఫిరంగిని పేల్చే నిమిత్తం అగ్ని దండం చేతబట్టాడు. ఆ ఫిరంగి మూతి మహా భయంకరంగా

మృత్యుదేవతకు నిలయంగా ఉంది. ఆ ఫిరంగి ఉరుములా ఉరిమింది. ఇంకా మూడు ఫిరంగులు దానిని అనుసరించాయి. ఈ నాలుగు ఫిరంగుల తీవ్ర గర్జనకు భూమి అదిరిపోయింది. ఎంత నాశనం కోసక్‌లకు తెచ్చిపెట్టిందో చెప్పలేం. బొమికలు కనిపించే చేతులతో ఎండిపోయిన గుండెలు కొట్టుకుంటూ ఎంత మంది తల్లులు తమ సంతానం హతమయి పోయినందుకు విల పిస్తారో! గ్లుఖోవ్, నిమిరోవ్, చెర్నిగోవ్ పట్టణాలలో ఎంత మంది స్త్రీలకు వైధవ్యం ప్రాప్తించిందో! పాపం! దురదృష్ట వంతులయిన ఆ స్త్రీలు ప్రతిరోజూ బజారువెళ్ళి దోవపోయే ప్రతివ్యక్తిని పట్టుకుని వారిలో తమకు ప్రియతమమయిన వారున్నారేమోనని వారి కళ్ళల్లోకి తేరిపారజూస్తారు. ఆ పట్టణాలగుండా చాల చాల సేనలు వెళ్ళినా తమకు ప్రియతమమయిన వారు ఆ స్త్రీలకు కనిపించరు.

నెజమాయ్ తండాలో సగం హతమయిపోయింది. బంగారు నాణేలలాగా మెరిసిపోయే కంకెలు తుపానుగాలికి నేలకు ఒరిగినట్లు కోసక్‌లూ నేలకు ఒరిగారు.

కోసక్‌లు రౌద్రమూర్తులయి పోయారు. హుమ్మని ముందుకు ఒరిగారు. తన తండాలో సగంమంది ఉత్తములుహాతమయిపోవడం చూసి కుకుబెంకో కోపంతో ఉడికిపోయాడు. మిగిలిన సగం మందిని వెనుకవేసుకుని కనురెప్పపాటులో శత్రుశ్రేణులనుచీల్చుకుంటూ మధ్యకుచేరుకున్నాడు.ఆకోపంలో మొదట తారసిల్లిన వాడి తలను కాబేజిని తరిగినట్లు ముక్కలు ముక్కలుగా నరికేశాడు. బల్లేలతో పొడిచి చాలామంది దేహాలను, అశ్వాలను నేలగూల్చాడు. ఇలా నరుక్కుంటూ ఫిరంగుల దగ్గరకు వెళ్ళి ఒక ఫిరంగిని వశంచేసుకున్నాడు. అక్కడ

యుమానె తండానాయకుడు ఒస్టాప్, స్టెపానిగుస్టాలు అన్నిటి కంటె పెద్ద ఫిరంగిని వశంచేసుకోబోతూండడం చూశాడు. వారిని అక్కడే వదలి తన కోసక్‌లతో ఇంకో శత్రు సందోహం వేపుకు గిర్రున తిరిగాడు. నెజమాయ్ కోసక్ ఎక్కడ తిరిగితే అక్కడల్లా పీనుగులగుట్టలే! పోలిష్ శ్రేణులు పల్చబడిపోయాయి. కుప్పలు కుప్పలుగా రాలిపోయారు. శకటాల సమీపంలో వొష్ట్ జెంకో పోరాడాడు. ముందుచెరెవిచెంకో, ఇంకా దూరాన డెగ్ట్యారెంకో, అతని వెనక తండానాయకుడు వెర్గికివిస్కీ శత్రువులతో తలపడ్డారు. డెగ్ట్యారెంకో ఇద్దరు ప్రభువులను బల్లెంతో పొడిచి మూడోవాడిమీదపడ్డాడు. ఈ మూడో ప్రభువు శత మొండి, చురుకయినవాడు, బలిష్టుడు. మంచి విలువయిన కవచం ధరించి, యాభై మంది పరివారంతో దాడి వెడలాడు. డాగ్ట్యారెంకోను కోపోద్రేకంతో వెనకకు తరిమి, నేలమీద పడ వేసి కత్తి తిప్పుతూ "కోసక్‌కుక్కల్లారా! నాతో పోరాడడానికి యెవడికి దమ్ములున్నాయిరా?" అని బిగ్గరగా కేకవేశాడు,

"యిదిగో, నాకు దమ్ములున్నాయిరా!"అంటూ మోసీ పిలో ముందుకు ఉరికాడు, పిలో మాంచి కండపుష్టిగల కోసక్. చాలాసార్లు నావికాదళ నాయకుడుగా పనిచేశాడు. రకరకాల కష్టాలకు తట్టుకున్న వ్యక్తి. ఒకమాటు అతనిని అతని కోసక్ లను ట్రెబిజాండ్ వద్ద టర్కీవాళ్ళు పట్టుకుని బానిసలను చేశారు. కాళ్ళుచేతులకు బేడీలు వేశారు. రోజుల తరబడీ తిండిపెట్టలేదు. తాగడానికి ఉప్పునీళ్లు ఇచ్చారు. కాని ఆ బానిసలు ససేమిరా లొంగలేదు. బాధలకు ఓర్చుకున్నారేగాని తమ సనాతన మత మును విడనాడలేదు. ఆటమాన్ మోసీపిలో అట్టేకాలం ఓర్చు కోలేక పోయాడు. పవిత్ర గ్రంథమును కాలితో మట్టగించి,

పాపం చుట్టుకున్న తలకు వెధవపాగాచుట్టి పాపాకి నమ్మిన బంటు, జానిసలమీద పెత్తందారూ అయాడు. తాళాలు అతని స్వాధీనంలోనే ఉండేవి. తమ మనిషేగనక తమ మతాన్ని విడ నాడి పీడకులతో చేరితే అతను చేసే హింసాకాండ భరింపశక్యం గాదని పాపం! ఆ జానిసలకు తెలుసు. సరిగా అలానే జరిగింది కూడా. మోసీపిలో ముగ్గురిని ముగ్గురిని చొప్పున కొత్త గొలు సులతో కట్టించి చర్మం చిట్లి బొమికలదాకా కోసుకుపోయేటట్లు తాళ్ళలో కొట్టించాడు. నిర్దాక్షిణ్యంగా మూపులమీద బాధిం చాడు. ఇటువంటి నమ్మకమయిన సేవకుడు దొరికినందుకు సంతో పిస్తూ టర్కీవారు విందుచేసుకున్నారు. తాగరాదనే చట్టాన్ని విస్మరించి తప్పతాగారు. ఈ అదునుచూసుకుని పిలో అరవయి నాలుగు తాళంచేతులు జానిసలకు పంచిపెట్టారు. ఆ జానిసలు ఆ తాళాలతో బేడీలు ఊడదీసుకుని సముద్రములో పారవేసి కత్తులుదూసి టర్కీవారందరినీ నరికివేశారు. కోసక్‌లకు ధన రాసులు లభించాయి. పేరు ప్రతిష్టలు సంపాదించుకుని మాతృ భూమికి తిరిగి వెళ్ళారు. మోసీపిలో కీర్తిని వీధిగాయకులు చాలాకాలం గానంచేశారు. కొచెవాయ్‌గా అతనిని ఎన్నుకునే వారే. కాని అతను విడ్డూరపుమనిషి. ఒక్కొక్కప్పుడు ఎంతటి ప్రతిభావంతుడికీ సాధ్యంకాని పనులుచేసేవాడు. ఒక్కొక్క ప్పుడు బుర్ర బండబారిపోయేది. చేతిలో ఉన్నదంతా పెట్టి తాగి తందనాలాడేవాడు. విందులకు వ్యయంచేశేశాడు. చివరికి గడీలోనిప్రతిఒక్కడికి బాకీపడ్డాడు. వీటన్నిటికి మించిమామూలు దొంగలాగా ఒకనాటి రాత్రి ఇంకో తండానుంచి కోసక్ ఉపకరణాలన్నీ దొంగిలించి సారాదుకాణంలో తాకట్టుపెట్టాడు. ఈ సిగ్గుమాలినపని చేసినందుకు అతనిని బజారులో ఒక స్తంభా

నికి కట్టివేసి అతనిపక్క ఒక బడితె పెట్టారు. దారినపోయేవా రంతా బలంకొద్దీ ఆ బడితెతో కొట్టాలి. కాని అతను పూర్వం చేసిన సేవ తలుచుకుని ఒక్క జవరోజయేవాడయినా అతనిమీద బడితె ఎత్తలేదు. అటువంటి కోసక్ మోసీపిలో!

"కుక్కలారా! యిక్కడ యెవడుబడితేవాడు మిమ్మల్ని చితకతన్నగలరు!" అని అరిచాడు సవాలుచేసిన ప్రభువుమీదకి ఉరుకుతూ.

ఒహో! ఎలా పోరాడారని! భుజకీర్తులు, రొమ్ము కవచాలు వారి దెబ్బలకు వంగిపోయాయి. ఒక పోలిషు వెధవ పిలో కవచాన్ని భేదించాడు. కత్తి శరీరంలోకి దిగిపోయింది. ఆ కోసక్ చొక్కా రక్తంతో ఎర్రబారింది. కాని ఏమాత్రం లక్ష్యపెట్టకుండా కండపుష్టిగల చేతిని పైకెత్తి హఠాత్తుగా దెబ్బతీశాడు. ఆ దెబ్బకు శత్రువుకు దిమ్మెత్తిపోయింది. కంచు శిరస్త్రాణం ముక్క ముక్కలయింది. తూంకింద పడిపోయాడు. దిమ్మెత్తిపోయిన శత్రువును పిలో ముక్కలు ముక్కలుగా నరికివేశాడు. శత్రువును త్వరగా చంపేసెయ్, ఆలశించకు, కోసక్ వీరుడా, వెనుదిరిగిచూడు! ఆ కోసక్ వెనుదిరిగి చూడ లేదు. ఆ హంతుని పరివారంలో ఒకడు పిలో మెడలో కత్తి దించేశాడు. పిలో వెనుదిరిగాడు. హంతకుని సమీపించ బోయాడు. కాని వాడు తుపాకి మందు పొగలో అదృశ్య మయి పోయాడు. నలుదిక్కులనుంచీ తుపాకుల మోత విని పించింది. పిలో తూలిపోయి గాయం ప్రాణంతీస్తుందని గుర్తిం చాడు. నేలమీదపడి గాయాన్ని చేతితో ఒడిసిపట్టి తన సహా చరులతో "శెలవు! సోదర మహాజనులారా! సహచరులారా పవిత్ర రష్యన్ భూమి చిరకాలం వర్ధిల్లుగాక! చిరకాలం గౌర

వింప బడుగాక!" అని మనక కమ్మిన కళ్ళుమూసుకున్నాడు. అతని ఆత్మ భయంకరమయిన కాయాన్ని విడిచి ఎగిరిపోయింది!

కాని జడీరోజ్నీ ఇంకా తనవారితో కలిసి స్వారీ చేస్తు న్నాడు. వెర్టిక్విస్టి పోలిష్ శ్రేణులను చెదరగొట్టు తున్నాడు. బలశాన్ శాత్రవ శౌర్యాగ్ని మధ్యకు దూకుతున్నాడు.

"ఒహో సోదరులారా?" అన్నాడు తారాస్ తండా నాయకులను పిలుస్తూ" మందు కొమ్ములలో మందు యింకా అయిపోలేదు. కోసక్ శక్తి యింకా వుడిగిపోలేదు. కోసక్‌లు లొంగిపోరు!"

"బాట్కో మందు కొమ్ములలో మందు యింకా అయి పోలేదు. కోసక్ శక్తి యింకా వుడిగిపోలేదు. కోసక్‌లు లొంగి పోరు!"

కోసక్‌లు తిరిగి శత్రువుల మీద పడి వారి శ్రేణులను కలతపెట్టారు. పొట్టిసేనాధిపతి అందరినీ సమావేశం కమ్మని చాటించి మైదానమంతటా చెల్లాచెదరయిన తన సైనికులను సమీకరించేందుకు ఎనిమిది వర్ణపతాకాలను ప్రతిష్ఠింపజేశాడు. పోలండు సైనికు లందరూ జెండా దగ్గరకు పరుగెత్తారు. కానీ వారు శ్రేణులుగా ఏర్పడకముందే కుకుబెంకో నెజమాయ్ కోసక్‌లతో వారి కేంద్రం మీద దాడిచేసి సేనాధిపతితో తల పడ్డాడు. ఆ సేనాధిపతి కుకుబెంకోను ఎదిరించి నిలవదొక్కుకో లేక గుర్రాన్ని వెనకకు తిప్పి దౌడుతీయిస్తూ పారిపోయాడు, కుకుబెంకో అతనిని చాలాదూరం వెన్నాడి సేననుండి అతనిని వేరుపర్చాడు. పార్శ్వభాగంలో తన తండాతో ఉన్న స్టెపాన్ గుస్కా ఇది గమనించి సేనాధిపతిని అడ్డగించడానికి, చేతిలో ఉచ్చు పట్టుకుని, గుర్రం మెడమీద తలవాల్చి బయలుదేరాడు.

యూఅదనుచిక్కగానే సేనాధిపతి మెడకి ఉచ్చుతగిలించాడు.ఇంకే ముంది సేనాధిపతి మొహం నల్లబడిపోయింది. రెండు చేతుల తోను ఉచ్చుతాడు గట్టిగా పట్టుకుని తెంపివేయాలని యత్నిం చాడు. కాని ఇంతలో బలియంగా బల్లెం వచ్చి పొట్టలో పొడు చుకుంది. నేలకు అంటుకుపోయాడు. అయితే గుస్కా కూడా చావు తప్పించుకోలేక పోయాడు. అతనికి తెలియకుండానే నాలుగు ఈటెలు వచ్చి నిలవరించినాయి. పాపం! "మన శత్రువులంతా నశించుదురుగాక! మన రష్యన్ భూమి యెల్ల పుడూ పరమానందం పొందునుగాక!" అని అనడానికి మాత్రమే వ్యవధి చిక్కింది.

కోసక్‌లు చుట్టూ తేరిపార జూశారు. ఒకపక్క మెటె లిట్స్యా ఒక్కొక్క పోలండు సైనికుని శిరస్త్రాణంమీద దిమ్మ తిరిగేటట్టు దెబ్బలు వడ్డిస్తున్నాడు. ఇంకోపక్క అటామాన్ నెవెచ్కి అతని సహచరులతో కలిసి దాడిచేస్తున్నాడు. శక టాల పక్కన జాక్రుటిగుబా శత్రువులపని పట్టిస్తున్నాడు. దూరంగా ఉన్న శకటాలదగ్గర మూడో పిసరెంకో ఒక శత్రు దళాన్ని దళాన్ని తిప్పికొడుతున్నాడు. ఇంకా దూరానకూడా తలపడి శకటాలమీద బాకుబాపి పెనుగులాడుతున్నాడు.

"ఓహో సోదరులారా!" అంటూ తారాస్ అరిచాడు. వారిముందు గుర్రాన్ని దౌడుతీయించుకుంటూ వచ్చి. "మందు కొమ్ములలో ఇంకా మందు అయిపోలేదు! కోసక్ శక్తి ఇంకా వుడిగిపోలేదు! కోసక్‌లు లొంగిపోరు!"

"మందుకొమ్ములలో ఇంకా మందు అయిపోలేదు. బాట్కా! కోసక్‌శక్తి యింకా వుడిగిపోలేదు! కోసక్‌లు లొంగి పోరు!"

బావడ్యుగ్ శకటంమీదనుంచి కిందకు పడిపోయాడు. గుండువచ్చి గుండెకాయకింద తగిలింది. ఆఖరిసారి ఊపిరిపీలుస్తూ "యీ ప్రపంచం విడిచివెళ్ళిపోతున్నానని నేను దుఃఖించడం లేదు. అందరికీ భగవంతుడు యిటువంటి మరణం ప్రసాదించుగాక! రష్యన్‌భూమి యెల్లప్పుడూ కీర్తింప బడుగాక!" అన్నాడు. ఈలోకం విడిచి ఎన్నడో వెడలిపోయిన వృద్ధులకు రష్యన్ భూభాగం మీద ఎంత ఇదిగా తాము పోరాడుతున్నదీ, పవిత్ర మతంకోసం ఎంత ఇదిగా మరణిస్తున్నదీ తెలియజేయాడానికా అన్నట్టు బావ్‌డ్యుగ్ హంస ఎగిరిపోయింది.

ఆ మరుక్షణంలో తండా నాయకుడు బాలాబాన్ నేల కూలాడు. ప్రాణంతీసే మూడు గాయాలు, ఒకటి బల్లెం వల్ల ఒకటి తుపాకిగుండు వల్ల పట్టాకత్తి వల్ల ఒకటీ తగిలాయి. అతను మహా పరాక్రమశాలి. చాలా సముద్ర దండయాత్రలకు నాయకత్వం వహించినవాడు. అనటోలియాతీరం మీది దాడి అన్నిటికంటె ఘనమయింది. ఆదాడిలో చాలా బంగారు నాణేలు, విలువయిన సరుకు, వస్త్రాలు స్వాధీనం చేసుకున్నారు. కాని తిరుగుప్రయాణంలో టర్కీవారి ఫిరంగులకు ఆహుతి అయిపోయారు. టర్కీ ఫిరంగి కాల్పులకు వారి పడవలలో సగం పడవలు గిర గిరా తిరిగి తలకిందులయాయి. చాలా మంది కోసక్‌లు మునిగిపోయారు. పక్కలకు కట్టిన తుంగ మూలంగా పడవలు మునిగిపోలేదు. టర్కీవారికి కనిపించకుండా ఎదురు ఎండలో తొందర తొందరగా తెడ్లు వేసుకుంటూ బయలుదేరాడు. రాత్రంతా బొక్కెనలతోను టోపీలతోను పడవలోకి చేరిన నీళ్ళను తోడివేసి, తుపాకి గుళ్ళకు పడ్డ రంధ్రాలను పూడ్చివేశారు. విశాలమయిన కోసక్

పంట్లాములను తెరచాపలుగా ఉపయోగించి పూర్తి వేగంతో జోరుగా పడవ నడిపిస్తూ టర్కీవారి నావను దాటారు. ఏ ఆపద లోనూ చిక్కుకోకుండా సురక్షితంగా ఇంటికి చేరుకోవడమే కాకుండా కీవ్‌లోని మెజ్జిగోర్స్కి మఠానికి బంగారు నగిషీల అంగరఖాను, జపరోజియేలోని మేరీమాత చర్చికి నికారసు వెండి చట్రాన్ని తెచ్చి సమర్పించారు. ఈ కోసక్‌ల అదృష్టాన్ని వీధి గాయకులు చాలాకాలంపాటు కీర్తించారు. ఇక ఇపుడు మరణ వేదన పడుతూ బాలబాన్ తలవంచి మెల్లగా అన్నాడు: "సోదర మహాజనులారా! నేను గొప్పచావు చస్తున్నాననే అను కుంటున్నాను. యేడుగురిని నరికేశాను, తొమ్మిదిమందిని పొడి చేశాను. చాలామందిమీదుగా గుర్రాన్ని స్వారీ చేయిస్తూ తుపా కీతో వెళ్ళాను. యెంతమందిని తుపాకితో కాల్చి చంపానో నాకే జ్ఞాపకంలేదు. మన రష్యన్‌భూమి చిరకాలం వర్ధిల్లుగాక!" ఇలా అంటూండగానే అతని ప్రాణాలు ఎగిరిపోయాయి.

కోసక్‌లారా! కోసక్‌లారా! మీ వీరపుంగవులను విడ నాడకండి! కుకుబెంకోను అపుడే శత్రువులు చుట్టుముట్టారు. నెజమాయ్ తండాలో లెక్కకు పదుగురే మిగిలారు. వారిబలం కూడా ఉడిగిపోతోంది. కుకుబెంకో దుస్తులు రక్తసిక్తమయి పోయాయి.

కుకుబెంకో అవస్థచూసి అతనిని రక్షించడానికని తారాస్ గబగబా చక్కావచ్చాడు. కాని కోసక్‌లు అరుదెంచే లోపలే ఒక బల్లెంవచ్చి కుకుబెంకోగుండెకాయకింద గుచ్చుకుంది.కోసక్ ల చేతిలో వాలిపోయాడు. అతని యువరక్తం చిమ్మిట గొట్టంలో నుంచిలాగా ధారకట్టింది. ఇది ఎలాఉందంటే నేలమా ళిగలోనుంచి మంచి నాణ్యమయిన ద్రాక్ష సారాయిని గాజు

సీసాలో సేవకులు అజాగ్రత్తగా తీసుకువస్తూ గుమ్మంలో తూలితే సీసా కిందపడి ఆఖరి చుక్కవరకు సారా ఒలికిపోయినట్టుంది. ఇక యజమాని పరుగెత్తుకుంటూ వచ్చి జరిగిందంతా చూసి జుట్టు పీక్కుంటాడు పాపం! ముసలితనంలో చిన్ననాటి మిత్రు డెవరయినా కనిపించితే అతనితో చిన్ననాటి విషయాలు ముచ్చ టిస్తూ తాగే సుదినంకోసం ఆ ద్రాక్ష సారాను పదిలపర్చి ఉంచాడు. కుకుబెంకో గుడ్లు గిర్రునతిప్పి "మీ కళ్ళముందు మరణం ప్రాప్తించినందుకు భగవంతునికి వందనా లర్పిస్తు న్నాను. మన తరవాత పుట్టేవారంతా మనకంటె గొప్పవాళ్ళ వుతారుగాక! క్రీస్తు ప్రభువు ప్రేమించే మన రష్యన్ భూమి చిరకాలం రమణీయంగా వర్ధిల్లుగాక!" అన్నాడు.

ఆ యువకుని ఆత్మ లేచిపోయింది. దేవతలు దానిని తమ చేతులలోకి తీసుకుని సరాసరి స్వర్గానికి తీసుకువెళ్ళారు. అక్కడ సుఖంగా జీవిస్తాడు. "నా కుడిచేతి వేపున కూర్చో, కుకుబెంకో!" అంటూ క్రీస్తు ప్రభువు ఆహ్వానిస్తాడు. "సహచరు లకు నీవు ద్రోహం చేయలేదు. నీచమైనపని నీవేదీచేయలేదు. ఆపదలోనున్న మనిషి నెవరినీ విడనాడలేదు. నా చర్చిని సంరక్షించి భద్రంగా నిలిపావు!"

కుకుబెంకో మృతికి అందరూ విచారించారు. కోసక్ శ్రేణులు పలచబడసాగాయి. చాలా చాలా మంది ధైర్యస్తులు కానరావడంలేదు. అయినప్పటికీ వెనుదీయకుండా దృఢంగా నిలబడ్డారు.

"ఓహో సోదరులారా!" అంటూ తారాస్ తక్కిన తండా నాయకులను సంబోధించాడు. "మందుకొమ్ములలో

మందు ఇంకాఅయిపోలేదు! మీ కత్తులు యింకా వాడితగ్గ లేదు. కోసక్ శక్తి యింకా క్షీణించి పోలేదు. కోసక్‌లు లొంగిపోరు!"

"యింకా కావలసినంత మందు వుండదు. బాట్కో! మా కత్తుల వాడి యింకా తగ్గలేదు! కోసక్ శక్తి యింకా క్షీణించి పోలేదు! కోసక్‌లు లొంగిపోరు!"

నష్టమేమీ వాటిల్లనట్టు ఇంకొకమారు వారు ముందుకు దూకారు. ఇక ముగ్గురు తండా నాయకులే మిగిలి ఉన్నారు. ఎక్కడపడితే అక్కడ రక్తం ఎర్రగా కాలవలు కట్టింది. కోసక్ శవాలు కుప్పలుకుప్పలుగా పడి ఎత్తు వంతెనలులాగా ఉన్నాయి. తారాస్ ఆకాశం వంక పారజూశాడు. ఆకాశంలో డేగలు బారులు బారులుగా విహరిస్తున్నాయి వాటికి దివ్యమయిన విందు దొరికింది! బల్లెంతో గుచ్చి మెటెలిట్స్యాయాని పైకి లేపారు. రెండో పిసరెంకో తల నేలమీద దొర్లుతోంది. కనురెప్పలు కొలు కొంటున్నాయి.ఇంకోవేపున ఒక్రిమ్‌గుస్కా నాలుగుతుండాలయి ఎగిరి కిందపడ్డాడు, "ఓ-"అంటూ తారాస్ రుమాలు ఆడించాడు. ఒస్టాప్ ఈ సంజ్ఞను గ్రహించి, మాటున ఉన్న వాడల్లా రివ్వున వచ్చిపడి శత్రువు గుర్రం మీద విపరీతమయిన దెబ్బకొట్టాడు. పోలండువాళ్ళు వెనకడుగు వేయక తప్పలేదు. ఆ దెబ్బకు ఒస్టాప్ వారిని సరాసరి వాడికొయ్యలు, బల్లాలు పాతిన స్థలానికి వారిని తరిమి తరిమి కొట్టాడు. గుర్రాలు కాళ్ళు జారి కింద పడ్డాయి. రౌతులు వాటి తలల మీదుగా ఎగిరి పడ్డారు. సరిగ్గా ఆ సమయంలో దూరంగా శకటాల వెనక నిలబడిఉన్న కోసక్‌లు శత్రువులు తుపాకివేటు దూరంలోకి రావడం కనిపెట్టి హఠాత్తుగా తుపాకు

లను పేల్చారు. పోలండువారు కంగారు పడ్డారు. పూర్తిగా మతిపోయింది. కోసక్‌లకు ధైర్యం వచ్చింది. "జయంమనిదే!" అంటూ నలువైపులనుంచీ జపరోజియేవారు కేకలు పెట్టారు. బాకాలు ఊది విజయ పతాకం ఎగరవేసారు. పరాజితులయిన పోలండువారు పరుగెత్తుతూ ఎక్కడ వీలయితే అక్కడ దాగుకో సాగారు.

"ఉహుఁ-మనకింకా విజయం లభించలేదు." అన్నాడు తారాస్ పట్టణ ద్వారాలకేసి చూస్తూ. నిజం! అతని మాటే యథార్థమయింది. ద్వారాలు తెరుచుకున్నాయి. అశ్వికదళంలో కల్లా మచ్చుతునకవంటి పటాలం ఉరుక్కుంటూ వచ్చింది. ప్రతి రౌతూ బాదంరంగు గుర్రంమీద ఎక్కాడు. ఆ గుర్రాలు భారీవి, మాంచి వడిగలవి. వాటిముందు మహా ధైర్యశాలి అయిన చక్కని యోధుడొకడు దౌడు తీస్తున్నాడు. కంచు శిరోష్ణం వెనక నల్లటిసిగ అల్లల లాడుతోంది. అతిలోక సౌందర్యవతి ఎవరో అల్లిన రుమాలు చేతిమీద అటుఇటూ ఊగుతోంది. ఆ వ్యక్తి ఆంద్రీ అని గుర్తించి తారాస్ ప్రమాన్పడిపోయాడు. చేతిదండకు కట్టుకున్న చిహ్నానికి అర్హుడనని ఋజువు చేసుకోవాలనే ఆదుర్దాతో భీషణ యుద్ధంలో తల మునకలు వేస్తున్నాడు ఆంద్రీ. నేర్పరులయిన వేటగాళ్ళు ఉసిగొలపగా మాంచి సొగసయిన, వడిగల వేటకుక్కలు ఉరికినట్టు ఉరికాడు. సరళ రేఖలో కాళ్ళు కోసుగా శరీరంపెట్టి మంచుగడ్డను ఛేదించుకుంటూ కుందేలును వెంటాడిపట్టుకోడానికి రేసుకుక్క ముందుకు దూకినట్టు దూకాడు. ముసలి తారాస్ ఆగి, ఆంద్రీ సేనను చీల్చుకుంటూ ముందున్నవారిని చెదరగొడుతూ, నేల కూలుస్తూ, ఇరుపక్కలా దెబ్బతీస్తూ పురోగమించడం కనిపెట్టి చూశాడు.

ఆ దృశ్యాన్ని చూసి భరించలేక తారాస్, "యేమిటీ! నీ సహచరుల్నే! నీ సహచరుల్నే హతమారుస్తావా? వెధవ నాగన్నా!"

కాని ఆంద్రీ ముందున్నది శత్రువులో మిత్రులో గమనించడంలేదు. అతని కంటిముందు తారాడుతున్నదల్లా ఉంగరాల జుట్టు. హంసతెలుపు వక్షస్థలం, మంచుతెలుపు మెడ, బుజాలు, పిచ్చిగా, ఆవేశంతో ముద్దిడుకోవడానికే సృజింపబడినట్లున్న శరీరం!

"ఓహో! బిడ్డలారా! వాడిని యెలాగయినా వంచించి ఆ అడవిలోకి తీసుకువెళ్ళండి" అని తారాస్ కేకపెట్టాడు. మెరుపులుగా ముప్పయిమంది కోసక్‌లు అతని ఆజ్ఞలను పాలించడానికి గుర్రాల మీద బయలు వెడలారు. శిరసుల మీద టోపీలు గట్టిగా అణచిపెట్టుకుని రౌతులను కలుసుకోవడానికి దౌడుతీశారు, బాగా నుంచున్నవారిమీద పార్శ్వదాడిచేసి, గందరగోళపరిచి, వెనక శ్రేణులనుంచి వారిని వేరుచేసి గట్టి దెబ్బ తీశారు. గొలోకోపిటెంకో ఆంద్రీ వీపుమీద కత్తి అడ్డంగా తిప్పి ఒక్కటివేశాడు. ఆ తరవాత కోసక్ లందరూ వాయువేగంతో పారిపోయారు. ఆంద్రీకి కోపంతో ఒళ్ళుతెలియలేదు. రక్తం ఉడికెత్తిపోయింది. గుర్రపు డెక్కలకు పదునయిన తట్టుడుముల్లు గుచ్చి కోసక్‌ల వెనక మహావేగంతో బయలుదేరాడు. వెనకకు తిరిగిచూడలేదు. అనుచరులు ఇరవయిమంది మాత్రమే తనను అనుసరించి రాగలుగుతున్నారని గమనించలేదు. కోసక్‌లు అమిత వేగంతో దౌడుతీస్తూ అడవిలో ప్రవేశించారు. ఆంద్రీ గుర్రంమీద రివ్వున వెళ్ళి గొలోపిటెంకోను కలుసుకోబోతుండగా ఎవరో అతని గుర్రం కళ్లెం

గట్టిగా పట్టేశారు ఆంద్రీ గిర్రున వెనకకు తిరిగాడు. ముందున్న దెవరు? తారాస్ బుల్బా! నిలువల్లా వణికిపోయాడు. మొహంలో నెత్తురుచుక్క కనిపించలేదు !

కొంటెతనానికి సహాధ్యాయినిని అవమానించినందుకు రూళ్ళబద్దతో మొహంమీద దెబ్బతిని, ఒళ్లు తెలియని కోపంతో చీల్చి చెండాడుదామని అసలే భయంతో వణికిపోయే సహాధ్యాయిని వెంటాడడానికి లేచి, ఉపాధ్యాయుడు గుమ్మంలో తారసిల్లగా హఠాత్తుగా పిచ్చిఆవేశాన్ని కోపాన్ని అణచుకున్న విద్యార్థిలాగా ఒక్క క్షణంలో ఆంద్రీకోపం మటుమాయ మయింది. భయంకరంగా తండ్రి కనిపించాడు.

"సరే, యిపుడేంచేద్దాం ?" అన్నాడు తారాస్ కొడుకు కళ్ళల్లోకి సూటిగా చూస్తూ'

ఆంద్రీకి ఏంచెప్పాలో తోచలేదు. నేలమీద దృష్టి నిలిపి మాటాడకుండా నిల్చున్నాడు.

"సరే, నాన్నా ! వాళ్ళు నీకేం వోలక బెట్టారు ?"

ఆంద్రీ జవాబీయలేదు.

"ఊఁ- ద్రోహం చేస్తావా ? నీ మతానికీ, నీ సహచరులకూ ద్రోహం చేస్తావా ? సరే గుర్రం దిగు !"

చంటిపిల్లవాడిలాగా ఆంద్రీ గుర్రందిగి తారాస్ ముందు శవంలాగా నిలబడ్డాడు.

"నిలకడగా నుంచో. కదలబోకు నేను నిన్ను కన్నాను. నేనే నిన్ను చంపుతాను !" అని తారాస్ వెనకకు అడుగువేసి బుజంమీదనుంచి తుపాకి తీశాడు.

తెల్లటి కాగితంలాగా ఆంద్రీ నిలబడి మెల్లగా ఒక పేరు ఉచ్చరించాడు. అది అతనిదేశం పేరుగాదు, తల్లిపేరుగాదు, సోదరుల పేరుగాదు, అది ఆ సుందరమైన పోలిష్ యువతి పేరు. తారాస్ తుపాకి పేల్చాడు.

కొడవలి కోతకు కిందపడే గోధుమకంకెలాగా, గుండె కాయలో కటారి గుచ్చుకున్న గొర్రెపిల్లలాగా తల వాల్చివేసి మాట్లాడకుండా పడిపోయాడు.

ఆ పుత్రహంతకుడు కదలకుండా నిలబడి ప్రాణంలేని కట్టెకేసి చాలాసేపు తేరిపారజూశాడు. ప్రాణం పోయినా ఆంద్రీ ఇంకా అందంగానే ఉన్నాడు. కొద్దిసేపటిక్రితం వరకు అధికారదర్పంతో ప్రతిఘటించలేని ఆకర్షణతో పురుషత్వంతో తొణికిసలాడే అతని మొహం ఇంకా ఎంతో రమణీయంగానే ఉంది. నల్లటి కనుబొమలు వెల్లదనాన్ని కప్పిపుచ్చుతున్నాయి.

"యెటువంటి కోసక్ గా తయారయేవాడు!" అన్నాడు తారాస్. "ఆజానుబాహువు, నల్లటి కనుబొమలు, సౌమ్య ముఖం, యుద్ధంలో దిట్ట! హతమారిపోయాడు! పుచ్చుకుక్క లాగా చచ్చిపోయాడు!"

"యేంపని చేశావ్ బొటోక్క! నువేనా వాడిని చంపింది?" అన్నాడు ఒస్టాప్ సమయానికి గుర్రంమీద స్వారీ చేస్తూ వచ్చి.

తారాస్ ఆమోద సూచకంగా తల పంకించాడు.

ఒస్టాప్ అపేక్షతో జీవంలేని కళ్ళల్లోకి తేరిపారజూశాడు. విచారంలో మునిగిపోయి "శత్రువులు అగౌరవ పర్చకుండా, పక్షులు పీక్కుని తినకుండా సమాధిచేదాం పట్టు, బొటోక్క!"

"మనమక్కర్లేకుండా వాళ్లే సమాధి చాస్తార్లే. పడియేడ్చే వాళ్ళు చాలామంది వున్నారు" అన్నాడు తారాస్.

నక్కలపాలు చేదామా లేక వీరత్వానికి గౌరవిద్దామా అని ఒకటి రెండు నిమిషాలు తారాస్ ఆలోచించాడు. ధైర్యశాలులు ఎవరిలో ఉన్నా వీరత్వాన్ని గౌరవించడం ధర్మంగా భావిస్తారుగదా! ఇంతలో గొలోకోపిటెంకో దాడు తీసుకుంటూ రావడం చూశాడు.

"ఘోరం! బాట్కో! పోలండువాళ్లు బలపడ్డారు వారిని రక్షించడానికి కొత్తపటాలాలు వచ్చాయి."

గొలోకోపిటెంకో ఈ ముక్కను చెప్పాడో లేదో కోప్టుజెంకో దాడుమీద వచ్చి "ఘోరం! ఆటామాన్! కొత్తసేన వచ్చేసింది!" అన్నాడు.

కోప్టుజెంకో ఈ ముక్కలు చెప్పాడో లేదో పిసరెంకో పరుగెత్తుకుంటూ వచ్చి,

"యెక్కడున్నావు, బాట్కో? కోసక్‌లు నీకోసం వెతుకుతున్నారు. అటామాన్ నెవిలిచ్కా, జడరోజ్నీ, చెరెవిఛెంకో చనిపోయారు! కాని కోసక్‌లు మాత్రం గట్టిగా నిలబడ్డారు. నీ దర్శనంచేసుకుని చావదలుచుకోలేదు. చివరి ఘడియలో నువు వారిని చూడాలని కోరుతున్నావు."

"ఒస్టాప్, పద!" అని అరిచి ఇంకోమారు వారిని చూడడానికి, చివరిఘడియలో వారు తమ నాయకుని దర్శించుకోడానికీ వీలుగా తారాస్ బయలుదేశాడు.

కాని అడవిని దాటేలోపున శత్రుసేన నాలుగువేపులా వారిని చుట్టుముట్టింది. చెట్లు చెట్లూ మధ్య బల్లాలు, కత్తులు పుచ్చుకుని రౌతులు గుర్రాలమీద ప్రత్యక్షమయారు.

"ఒస్టాప్! ఒస్టాప్! లొంగిపోవద్దు!" అని అరిచి తారాస్ ఒరనుంచి కత్తిమూసి వీరవిహారం చేయసాగాడు.

ఆరుగురు రౌతులు హఠాత్తుగా ఒస్టాప్‌మీద వచ్చి పడ్డారు. కాని దుర్ముహూర్తంలో వచ్చిపడ్డారేమో ఒకడి తల ఎగిరిపోయింది, ఒకడు తలకిందులుగా పడ్డాడు. ఒకడి డొక్కలో బల్లెం గుచ్చుకుంది. నాలుగోవాడు సాహసించి తుపాకివేటు తప్పించుకున్నాడు గాని వాడి గుర్రం గుండెకు గుండు తగిలింది. ఆగుర్రం బెదిరిపోయి ముందుకాళ్ళు ఎత్తి కింద పడిపోయింది. దానికిందపడి రౌతు అణగారిపోయాడు.

"బలే! నాన్నా! బలే! బలే! ఒస్టాప్?" అని అరిచాడు తారాస్. "యీ విధంగానే తక్కినవాళ్ళనీ హతమూరుస్తాను!"

శత్రువులను తరిమి తరిమి కొట్టసాగాడు. ఒస్టాప్‌మీదనే దృష్టినిలిపి ఇరువైపులా నరుక్కుంటూ పైనున్నవారి తలలు బడితపూజ చేశాడు. అప్పుడు ఎనిమిదిమంది పైచిలుకు ఒస్టాప్‌ను చుట్టుముట్టడం చూశాడు.

"ఒస్టాప్! ఒస్టాప్! లొంగిపోవద్దు."

కాని అప్పటికే వారు ఒస్టాప్‌ని లొంగదీశారు. మెడకు ఉచ్చు తగిలించారు. చేతులు కాళ్ళు కట్టివేసి తీసుకుపోతున్నారు.

"ఒస్టాప్! ఓ ఒస్టాప్!" అని అరిచాడు తారాస్ కొడుకును చేరుకోవాలని పోరాడుతూ, అడ్డం వచ్చినవారినల్లా తుత్తునియలు చేస్తూ, "ఒస్టాప్! ఓ ఒస్టాప్!"

కాని ఎవరో పెద్దరాతితో కొట్టినట్టు అతనినే కొట్టారు అతని కళ్ళముందు గిరగిరా తిరగసాగింది. ఒక క్షణంసేపు అతని

కళ్ళముందు తలలు, బల్లాలు, పొగ, నిప్పురవ్వలు, ఆ తరువాత పచ్చని కొమ్మలు తారాడాయి. మొదలు నరికిన తరువులాగా నేలకూలాడు. కళ్ళను మంచుతెర కప్పివేసింది.

# 10

"అబ్బ! యెంతసేపు నిద్రపోయాను?" అన్నాడు తారాస్ తాగి మొద్దునిద్రపోయి లేచి చుట్టూ ఉన్న వస్తువులు గుర్తుపట్టడానికి యత్నించేవాడిలాగా. చెడ్డనీరసం అతని అవయవాలను పట్టేసింది. ఒక అపూర్వమయిన గది గోడలు మూలలు అతని కళ్ళముందు మసక మసకగా నృత్యంచేశాయి. ఎలాగయితేనేం చివరకు టోవకాచ్ తనముందు ఊపిరి పీల్చడం వింటూ కూర్చోవడం కనిపెట్టాడు.

"ఓ-" అనుకున్నాడు టోవకాచ్. "శాశ్వతంగా నిద్ర పోయేవాడివే!" కాని పైకి ఏమీ అనకుండా మాట్లాడవద్దని వేలు ఆడించాడు.

"యిపుడు యెక్కడ వున్నావో చెపుదూ?" అని అడిగాడు తారాస్ ఆలోచనలు కూడగట్టుకోవాలనీ, ఏం జరిగిందీ జ్ఞప్తికి తెచ్చుకోవాలనీ యత్నిస్తూ.

"మాట్లాడవద్దు" అంటూ గట్టిగా ఆదేశించాడు అతని సహచరుడు. "యింతకంటే వేరే యేం తెలుసుకోవాలి? మీరు పూర్తిగా వోడిపోయారని గ్రహించాలా! ఊపిరి పీల్చుకోవడాని కయినా ఆగకుండా నీతో మేమూ గుర్రాలను

దాడు తీయించాలి. నీకు జ్వరం వచ్చి పిచ్చి పిచ్చిగా మాట్లా డావు. ప్రశాంతంగా నీవు నిద్రపోవడం యిదే మొదటిసారి. మాట్లాడకుండా పడుకో, లేకపోతే చేటుమూడుతుంది."

కాని తారాస్ ఆలోచనలను కూడగట్టుకోవాలనీ ఏం జరిగిందీ జ్ఞప్తికి తెచ్చుకోవాలనీ ఇంకా యత్నించాడు.

"పోలండు వాళ్లు నన్ను చుట్టుముట్టారు. పట్టుకో బోయారు. ఆ గుంపులో పోరాడడానికి వీలే లేకపోయింది!"

"నోరుమూయ్, వెధవనాగన్న!" అని అరిచాడు టోవ ఖాచ్ కోపంతో, ఓర్పు నశించిన దాది అల్లరి పిల్లవాడిని అది లించినట్టు. "నువు యెలా తప్పించుకున్నదీ చెపితే నీకు వచ్చే లాభమేమిటి ? నువు తప్పించుకున్నావు. అంతే, నిను విడనాడని జనం వున్నారు, నువు తెలుసుకోదగింది అంతే. మనమింకా చాలా రోజులు కష్టపడి ప్రయాణం చేయాలి, నువేం మామూలు కోసక్ వా ! నిన్ను పట్టుకుని వప్పగిస్తే రెండువేల డకెట్లు బహుమతీ యిస్తారట!"

"యింతకీ ఒస్టావ్ గతి యేమయిందీ?" అని హఠా త్తుగా తారాస్ అరిచాడు. లేవాలని తంటాలు పడ్డాను. వెను వెంటనే ఒస్టాప్ యెలా పట్టుబడిందీ, తన కళ్ళముందరే యెలా కట్టివేసిందీ జ్ఞాపకంవచ్చి ఇపుడు పోలండువాళ్ళ చేతిలో బందీగా ఉండి ఉంటాడని తలచాడు.

ఆ ముదుసలి మనసు దుఃఖంతో నిండిపోయింది. గాయాలకట్లు ఊడపెరికి దూరంగా విసిరి పారేశాడు. ఏదో చెప్పాలని ఉంకించి పిచ్చిగా మాట్లాడడం మొదలుపెట్టాడు. మళ్లీ జ్వరం, సంధి అతనిని లొంగదీశాయి. అర్థం పర్థంలేకుండా అదేపనిగా వాగజొచ్చాడు. బుల్బామీద అతని సహచరునికి

భక్తి విశ్వాసాలు ఎక్కువ. ఒట్లు పెట్టుకుంటూ, కఠినంగా మందలిస్తూ కాళ్ళు చేతులూ పట్టుకుని చంటిపిల్లవానిని పొదువు కున్నట్లు పొదువుకున్నాడు. గాయాలకు తిరిగీ కట్లుకట్టి, ఎద్దు చర్మం చుట్టివేసి, తాళ్ళతోకట్టి, జీనుకు కట్టుకుని దౌడు లంకించుకున్నాడు.

"నువు బతికివుంటే నిన్ను ప్రాణాలతో అక్కడికి చేరుస్తాను. లేదా. నీ శవాన్నయినా చేరుస్తాను. అంతేగాని ఆ పోలండువాళ్ళు కోసక్ రక్తమాంసాలను అవమానించనీను. నిన్ను ముక్కలు ముక్కలుగా నరికి నదిలో పారేయనీను. రాబందులే గనక నీకళ్ళు పొడుచుకు తినడం అంటూవస్తే మన మైదానపు రాబందులే తిననీ. అంతేగాని పోలిష్ రాబందులును, పోలండునుంచి యెగిరివచ్చే రాబందులను పొడిచి తిన నీయను. నువు బతికివుంటే నిన్ను ప్రాణాలతో యుక్రెయిన్ చేరుస్తాను. లేదా నీ శవాన్నయినా చేరుస్తాను."

విశ్వాసపాత్రుడయిన ఆ సహచరుడు ఇలా చెప్పి విశ్రాంతి తీసుకోవడానికి ఒక నిమిషమయినా ఆగకుండా రాత్రింబవళ్లు గుర్రంమీద దౌడుతీస్తూ గడీకి బుల్బాను చేర్చాడు. అప్పటికీ బుల్బాకి స్మారకం రాలేదు. విసుగుకోకుండా ఓషధు లతో ద్రావకాలతో చికిత్స చేశాడు. మంచి సామర్థ్యంగల ఒక యూదు యువతిని తీసుకువచ్చాడు. ఆమె నెలరోజులపాటు బుల్బాచేత రకరకాల మందులు తాగించింది. చివరకు ఎలా గయితేనేం తారాస్ కోలుకోసాగాడు. మందులవల్ల అయితేనేం, కాయశరీరం కావడంవల్ల నయితేనేం నెలా నెలాపదిహేను రోజులు అయేసరికి కాళ్ళమీద లేచి నిలబడగలిగాడు. గాయాలు మానిపోయాయి. కత్తిగాట్లు మాత్రం ఇంకా కనిపిస్తూ ఎంత

దారుణంగా గాయాలు తగిలాయో తెలియజేస్తున్నాయి. కాని మనోవ్యాకులం, దుఃఖం అతనిలో పెంపొందినట్లు స్పష్టంగా కనిపించింది. నుదురుమీద శాశ్వతంగా మూడుముడతలు పడ్డాయి. ఎవరికోసమో వెతుకుతున్నట్టు చంచలంగా చూడసాగాడు. గడీ అంతా కొత్తగా ఉంది. పూర్వ సహచరులంతా చనిపోయారు. న్యాయం కోసం, మతం కోసం, సోదరధర్మం కోసం నడుం బిగించిన వారిలో ఒకడూ లేడు. కొచెవాయ్‌తో కలసి తాతార్ల వెంటబడ్డవారు కూడా ఎన్నడో మాయమయారు. అందరూ తలలు ఒడ్డి హతమారిపోయారు. కొంతమంది యుద్ధంలో, కొంతమంది ఆకలితో మాడి క్రిమియా చిత్తడి నేలమీద, మరికొందరు ఖైదీలుగా పట్టుబడి చనిపోయారు. మాజీ కొచెవాయ్, పూర్వ సహచరులు ఇక లేరు. కోసక్ శక్తిని ఉడికెత్తించేచోట ఇపుడు జిల్లేళ్లు మొలిచాయి. గొప్ప విందు జరిగినట్టు అతనికి అనిపించింది. పళ్ళాలు ముక్కలు ముక్కలు అయిపోయాయి. ఒక్క చుక్కకూడా ద్రాక్షసారా మిగలలేదు. అతిథులు, నౌకర్లు విలువయిన కప్పులు గిన్నెలు దొంగిలించారు. ఇక ఇపుడు ఈ గృహమేధి విచారంతో నిలబడి 'యీ విందు జరగకుండా వుంటే బావుండిపోయేది' అని అనుకోసాగాడు. ఇటువంటి ఆలోచనలనుంచి మనసును మళ్ళించి తారాస్‌ను హుషారు గొలపాలని యత్నించారుగాని లాభంలేక పోయింది. తెల్లటి పొడుగు గడ్డాల వీధి గాయకులు ఇద్దరు ఇద్దరు, ముగ్గురు ముగ్గురు చొప్పున వచ్చి అతని సాహస కృత్యాలను కీర్తించి వెళ్ళారు గాని ప్రయోజనం కలగలేదు. నిరాశా నిస్పృహలతో ప్రతిదానికేసీ శూన్య దృష్టితో తేరిపార జూడసాగాడు. మొద్దు మొహంమీద

మధ్యమధ్య తిరని దుఃఖం కనపించద. మెల్లగా తలవాల్చి "కొడకా! ఒస్టాప్!" అని మూలుగుతూ వాపోయేవాడు.

జపరోజియేవారు సముద్రంమీదుగా దాడికి బయలు దేరారు. నీపర్ నదిమీద రెండువందల పడవలు వదిలారు. తలలు గొరిగించుకుని పొడుగాటి పిలకలతో తీరస్థ ప్రాంతాలను అగ్నికి, కత్తికి, ఆహుతి చేస్తుంటే ఆసియామైనరు వారంతా చూశారు. నేలరాలే అసంఖ్యాకమయిన పూవులలాగా రక్తసిక్త రణరంగంలో, ఆసియా మైనరువారి తలపాగాలు చెల్లాచెదరుగా పడిఉండడం చూశారు. తీరం వెంబడే నీటిమీద తేలియాడడం చూశారు. తారు అంటిన జపరోజియే పంట్లాంలో, నల్లటి కోసక్ కొరడాలు పట్టిన మొద్దుచేతులు చూశారు. జపరోజియేవారు ద్రాక్షపండ్లు తినివేసి తోటలు నాశనం చేశారు. మసీదులలో పేడకుప్పలు పెట్టారు. తమమీది కోటులకు నజ్జుగుడ్డగా పర్షియా శాలువలు ఉపయోగించారు. చాలాకాలం గడిచిన తరవాత ఆ ప్రాంతాలలోవారి చిన్న చిన్న పైపులు కనిపించాయి. హుషారుగా తిరిగి ఇంటికి బయలుదేరారు. తోవలో పది ఫిరంగుల టర్కీనావ తారసిల్లి ఒక్క దెబ్బతో పక్షుల్లాంటి వారి పడవలను ఎగరగొట్టి వేసింది. వారిలో మూడో వంతు మంది సముద్రగర్భంలోకి మునిగి పోయారు. తక్కినవారు తిరిగికలుసుకుని పన్నెండుపీపాలబంగారు నాణేలతో నీపర్ నదీ ముఖద్వారం చేరుకున్నారు. కాని ఇవేవీ అతని మనిసును ఆకర్షించలేదు. వేటాడదలచిన వాడిలాగా మైదానం మీదికి వెళ్లేవాడు. కాని తుపాకీలో గుళ్ళు అలాగే ఉండిపోయేవి. కాని తుపాకి కిందపెట్టి సముద్రపుటొడ్డున ఒంటరిగా కుమిలిపోతూ కూర్చునేవాడు. తల వంచుకుని 'ఒస్టాప్! ఒస్టాప్!' అని జపంచేస్తూ చాలాసేపు కూర్చుండి

పోయేవాడు. ముందు నల్లసముద్రం విస్తరించుకుని తళతళా మెరిసిపోతుండేది. ఎక్కడో దూరాన తుంగలో నీటికాకి కీచుమని అరిచేది. అతని తెల్లమీసాలు వెండిలాగా మెరిసి పోయేవి. ఒకొక్క చుక్క చొప్పున కన్నీరు కారేది.

తారాస్ ఇక ఏమాత్రం భరించలేకపోయాడు. "యేమ యినా సరే, వెళ్ళి వాడి గతి యేమయిందో తెలుసుకుంటాను. బతికేవున్నాడా ? చనిపోయాడా ? చనిపోతే సమాధి చేశారా లేదా ? యేమి మూడినాసరే, వెళ్ళి తెలుసుకుంటాను."

వారం రోజులకల్లా ఆయుధాలు ధరించి గుర్రం ఎక్కి యుమాన్ చేరుకున్నాడు. బల్లెం, కత్తి, జీనుకుకట్టి ఫ్లాస్కు, అంబల కుండ, తూటాలు, కళ్ళాలు మొదలయిన సరంజామా కూడా తీసుకువెళ్ళాడు. సరాసరి ఒక గుడిసె చేరుకున్నాడు. ఆ గుడిసె అసహ్యాం గొలుపుతోంది. చిన్నచిన్న కిటికీలు కనిపించీ కనిపించడంలేదు. పొగచూరి నల్లగా ఉన్నాయి. పొగగొట్టంనిండా చింపిరి గుడ్డలు కుక్కారు. పైకప్పునిండా బెజ్జాలే, పిచ్చుకలే. గుమ్మంముందు చెత్తా చెదారం కుప్పగాపడి ఉంది. ఒక కిటికీలోనుంచి చూస్తే ఒక యూదువనిత తల కనిపిం చింది. ఆ తలకు రంగు వెలసిన ముత్యాలు కుట్టిన పాగా ఉంది

"మీ ఆయన యింట్లో వున్నాడా ?" అని అడిగాడు బుల్బా, గుర్రంమీదనుంచి దిగి, గుమ్మానికి ఉన్న కొక్కానికి గుర్రం కళ్లెం ముడివేస్తూ.

"యింట్లోనే వున్నారు" అంటూ ఆ యూదుయువతి గుర్రానికి గోధుమలు, ఆ యోధుడికి బీరుసీసా తీసుకుని బయ టకు వచ్చింది.

"యింతకీ మీ ఆయన యేడీ ?"

"అదిగో ఆ గదిలో ప్రార్థన చేసుకుంటున్నారు." అని జవాబిచ్చింది ఆ యూదు యువతి వంగివంగి నమస్కరిస్తూ. బుల్బా సీసా పెదవుల దగ్గర పెట్టుకున్నాడు.

"యిక్కడే వుండి నా గుర్రాన్కి నీరు, హారం పెట్టు. నేను లోపలికి వెళ్ళి మాట్లాడతాను. ఆయనతో నాకు పని వుంది."

ఆ యూదు ఎవరో కాదు యాంకెల్ ! అప్పటికే ఇజారాదారుగా, సారాదుకాణాదారుగా అక్కడ స్థిరపడి పోయాడు. క్రమ క్రమంగా అక్కడి జమీందార్లను, వారి బంట్లను గుప్పిడిలో పెట్టుకున్నాడు. డబ్బంతా పీల్చేశాడు. ఆ ప్రాంతంలో యూదు ఉనికి ఫలితాలను తీవ్రంగా అనుభవించేటట్లు చేశాడు. మూడు మైళ్ళ కైవారంలో ఒక గుడిసె కూడా సరయిన స్థితిలో లేదు. ప్రతీదానికీ కాలంతీరిపోయింది. పాడుపడిపోతోంది. అంతా తాగుడుకింద వ్యయం అయిపోతోంది. దారిద్ర్యం, చింపిరిబట్టలు మాత్రం మిగిలాయి. ప్లేగు వ్యాధి వల్లనో అగ్నివల్లనో నాశనమయినట్టు ఆ ప్రాంతమంతా నాశనమయి పోయింది. యాంకెల్ గనక ఇంకో పది సంవత్సరాలు అక్కడ ఉంటే ఆ పరగణా నంతటినీ నాశనంచేసి మరీ వదిలేవాడు.

తారాస్ గదిలోకి అడుగుపెట్టాడు. ఆ యూదు మాసిపోయిన కండువా తలకు చుట్టుకుని ప్రార్థన చేస్తున్నాడు. ఆచారం ప్రకారం ఆఖరిసారి ఉమ్మివేయడానికి తలతిప్పాడు.

తిప్పేసరికి హఠాత్తుగా బుల్బా అతని దృష్టిలో పడ్డాడు. బుల్బా తల కొట్టివేస్తే ఇస్తామన్న రెండువేల డకెట్లు అతని కళ్ళముందు తళుక్కుమన్నాయి. కాని కలిగిన దురాశకు సిగ్గుపడి ధన వ్యామోహాన్ని అణచివేసుకోవాలని యత్నించాడు. నిజానికి యూదుల మనసును ధనాశ పురుగులాగా మెలి వేసుకుని ఉంటుంది.

"యాంకెల్ ! విను" అని తారాస్ అనగానే ఆయూదు వంగి నమస్కరించాడు. ఇద్దరూ కలసి ఉండడం ఎవరికంటా పడ రాదనే ఉద్దేశంతో తారాస్ వెళ్ళి గట్టిగా తలుపు గొళ్ళెం పెట్టి వచ్చాడు." ఒకపుడు నీ ప్రాణం రక్షించాను. లేకపోతే జపరోజియే వాళ్ళు నిన్ను కుక్కలులాగా ముక్కలు ముక్కలుకింద చీల్చేసే వాళ్ళు, యిపుడు నీవంతు వచ్చింది. నాకు వుపకారం చేయాలి."

ఆ యూదు మొహం కొద్దిగా ముడతలు పడింది

"యేమిటా వుపకారం ? చేయగలిగిందయితే చేస్తా నీకేం ?"

"మాటలతో కాలయాపన చెయ్యకు. వార్సా తీసుకు వెళ్ళు."

"వార్సాకా ? వార్సాకి యెలా తీసుకెళ్ళడం ?" అన్నాడు యాంకెల్. కనుబొమలు, బుజాలు ఆశ్చర్యంతో ఎగర వేశాడు.

"మాటలతో కాలయాపన చెయ్యకు. వార్సాకి తీసుకు వెళ్ళు. యేమి మూడినాసరే, ఒక్కమాటు వాడిని చూడాలి. ఒక్క మాటయినా మాట్లాడాలి?"

"యెవరితో మాట్లాడాలి?"

"వాడితో, అదే నా కొడుకు ఒస్టాప్‌తో."

"యిదివరకే దొరకు తెలియదా యేం...."

"అంతా నాకు తెలుసు. నా తలకొట్టితెస్తే రెండువేల డకెట్లు బహుమతి యిస్తామని ప్రకటించారు. దాని విలువ ఆ వెధవలకి తెలుసు! నేను అయిదువేలు యిస్తాను. యివిగో రెండువేలు" తోలుసంచిలోనుంచి రెండువేల డకెట్లు కింద పారపోశాడు." తక్కింది తిరిగివచ్చింతరవాత యిస్తాను."

తక్షణమే ఆ యూదు తువాలా తీసుకుని వాటిమీద కప్పాడు.

"బలే నాణేలు! బలే నాణేలు!" అంటూ పొగడ సాగాడు, వేళ్ళతో ఒకనాణెం తిప్పుతూ, కళ్ళతో పరీక్షిస్తూ. తమ యీ డకెట్లు యెవరిదగ్గరనుంచి గుంజుకున్నారో అతడు ఒక్క గంటకూడా ఆగకుండా సరాసరి వెళ్ళి నదిలోపడి చచ్చి పోయి వుంటాడు"

"నీ సహాయం అపేక్షించకుండా ఒంటరిగానే వార్సా వెళ్లేవాడినేగాని ఆ వెధవ పోలండువాళ్ళు నన్ను గుర్తుపట్టి పట్టుకోవచ్చు, తంత్రాలూ గింత్రాలూ నాకు చేతగావు. అందులో మీయూదులు ఘటికులు. మీరు దేవుళ్ళనీ దెయ్యాల్నీ కూడా మోసగించగలరు. నువు జిత్తులమారివి. అందుకే నీదగ్గ రికి వచ్చాను. అంతేకాకుండా ఒంటరిగా వెళ్ళి నేను చేయగలి గిందేమీ లేదు. యిక వెళ్ళి నీ బండీ సిద్ధంచేసి నన్ను అక్కడికి చేర్చు."

"నేను వెళ్ళి గుర్రాన్ని బండికి కట్టి 'చల్ చల్' మని తోలగలనంటూరా ? తమరిని దాయకుండా యిలాగా తీసుకు వెళ్ళడం సాధ్యమవుతుందంటూరా?"

"సరే; అలా అయితే నన్ను దాచేయి ఖాళీపీపాలో దాస్తానంటావా, దాచేయి."

"ఒహో! పీపాలో దాచేయగలననే అనుకుంటున్నారా? పీపాలో వోడ్కా వుందని అందరూ అనుకుంటారని తమకి తెలీదూ?"

"సరే, వోడ్కా వుందని అనుకుంటే అనుకోనీయి,"

"యేవిఁటీ ? వోడ్కా అనుకుంటే అనుకోనీయనా?" అని ఆ యూదు రెండు చేతులతోను జులపాలు పట్టుకుని పైకి ఎగతోసుకున్నాడు.

"అంతెందుకూ, ప్రతీమనిషీ తాగడానికి భగవంతుడు వోడ్కా సృష్టించాడని తమకు తెలియదా యేం ? అక్కడి జనానికి భోగాలమీద మక్కువ యెక్కువ. తీపి పదార్థాలంటే పడి చస్తారు. పీపా వెనకకు నౌకర్లు పరుగెత్తి గంటలకొలది రంధ్రం పొడుస్తారు. వోడ్కా ఒకచుక్కయినా కారకపోయేసరికి 'యూదులు ఖాళీ పీపాలు వేసుకురారు. యేదో గొడవ వుంది. యూదుని పట్టుకోండి, కట్టేయండి, వున్న డబ్బంతా లాగేయండి, జైలులో పారేయండి' అని కేకలు పెడతారు. యెక్కడ తప్పొచ్చినా అది యూదుల నెత్తిమీద రుద్దడం పరిపాటేగా ? యూదులను కుక్కలను చూసినట్లు చూస్తారు. యూదు అయితేసరి వాడు మనిషి కాదనే వాళ్ళ అభిప్రాయం.

"అలాఅయితే బండినిండా చేపలువేసి వాటిమధ్య దాచు"

"ఉహుఁ- వీల్లేదు. దొరా వీల్లేదు! పోలండులో జనం ఆకలితో మాడిపోతున్నారు. చేపలన్నిటినీ యెత్తుకుపోతారు. అపుడు తమగుట్టు కాస్తా బయట పడుతుంది."

"ఊఁ- అలాఅయితే నీ యిష్టం. యెలాగయినా సరే, అక్కడికి చేర్చు."

"అయితే వినండి, దొరా." అన్నాడు ఆ యూదు చోక్కా చేతులు పైకి మడచి చేతులు జాపుకుంటూ "యిలా చేదాం. యెక్కడపడితే అక్కడ కోటలు, దుర్గాలు కడుతున్నారు. ఫ్రాన్సునుంచి యింజనీర్లు వచ్చారు. అందుకని బోలెడన్ని యిటికలు, రాళ్లు తోలుతున్నారు. బండిలో పడుకోండి. మీద యిటికలు పేరుస్తాను. మీరు బాగా ఆరోగ్యంగా పుష్టిగా వున్నారు. కాబట్టి కాస్త బరువయినా మరేమీ మూడదు. అడుగున రంధ్రంపెట్టి దానిగుండా ఆహారం 'ఘస్తుంటాను."

"సరే, నీ యిష్టంవచ్చినట్టు చెయ్యి. నన్నక్కడికి చేర్చు, అంతేచాలు."

ఒకగంట తరవాత ఇటికలు వేసుకుని రెండు బక్క చిక్కిన గుర్రాలు కట్టినబండి యుమాన్‌నుంచి బయలుదేరింది. ఆ గుర్రాలలో ఒకదానిమీద మైలురాయిలాగా పొడుగ్గా యాంకెల్ కూర్చున్నాడు. గుర్రంమీద ఎగిరి పడుతూంటే నెత్తిమీది టోపీ కింద పొడుగాటి వంపుల జులపాలు అల్లల లాడజొచ్చాయి.

# 11

ఈ సంఘటనలు జరుగుతున్న సమయంలో ప్రజలను, భీతావహులను జేసే సుంకశాలాధికారులు గాని పహారావాళ్లు గాని సరిహద్దులలో లేరు. ఎవరికి ఇష్టంవచ్చింది వారు తీసుకు పోవచ్చు. ఎవరయినా తనిఖీగాని సోదాగాని చేశారంటే అది వారి వేడుక కోరకే. అందులోనూ ముఖ్యంగా కంటికి నచ్చిన వస్తువులు శకటంలో ఉండడంమీద, తనిఖీ చేసేవారి చేతిలో ఉండే అధికార ప్రపత్తులమీద ఆధారపడి ఉంటుంది. కాని ఇటి కలు ఎవరినీ ప్రలోభ పెట్టలేదు. అందుకని ఏ అడ్డంకీ లేకుండా బుల్బా ఉన్న శకటం నగర ప్రధానద్వారం దాటి లోపలికి ప్రవే శించింది. ఆ ఇరుకు బోనులో ఉన్న బుల్బాకి వీధిలోని గందర గోళం, ఛోదకుల అరుపులూ తప్ప ఏమీ వినిపించలేదు. మురికి కొట్టుకున్న పొట్టిగుర్రంమీద కిందికీ మీదికి ఎగిరి పడుతూ ఆచూకీ తెలియనీయకుండా జాగ్రత పడుతూ చీకటి కోణం లాంటి సందులోకి యాంకేల్ శకటాన్ని తోలుకుని వెళ్ళాడు. వార్సాలో ఉన్న యూదులంతా ఆ సందులోనే నివసిస్తూండడం వల్ల దానికి మురికి వీధి లేక యూదు వీధి అని పిలిచే వారు. ఇది అడ్డంతిప్పిన దొడ్డిలా ఉంది. ఎండ ఎక్కడా పడుతున్నట్లు లేదు. ఎన్నడో నల్లబడ్డ కొయ్య ఇళ్ళు, కిటికీల నుంచి పొడుచుకు వస్తున్న కొయ్యకోలల మూలంగా మరింత

చీకటి ఉంది. అక్కడక్కడా ఇళ్ళ మధ్య ఎర్ర ఇటిక గోడలు కనిపిస్తున్నాయి. కాని అవికూడా చాలాచోట్ల నల్ల బారాయి. ఎక్కడోగాని గచ్చువేసిన గోడలు పైన ఎండలో మెరిసిపోవడంలేదు. ఆ సందులో ప్రతీదీ - పొగ గొట్టాలు, చింపిరిగుడ్డలు, చెత్తా చెదారం పారవేసిన కుండలు, మూకుళ్ళు కంటికి ఏవగింపుగా ఉన్నాయి. పసికిరానివన్నీటినీ, వీధిలోకి గిరాటువేసి దోవనబోయేవారి పంచేంద్రియాలకు బాధ కలిగిస్తు న్నారు. వీధిమీదుగా ఒక ఇంటిపైనుంచి ఇంకో ఇంటిమీదికి వేసిన వాసంమీది మేజోళ్లు, పొట్టి ఇజార్లు, పొగబారిన బాతులు గుర్రంమీద కూర్చుని చేయి ఎత్తితే అందుతాయి. అపుడపుడు రంగుమాసిన పూసలు అలంకరించుకుని పాతకిటికీగుండా తొంగి చూసే అందమయిన బాలిక మొహం కానవస్తుంది. ఉంగరాల జుట్టు యూదు కుర్రకుంకలు చినిగిన దుస్తులు వేసుకుని, బుర దలో పడి దొర్లుతూ అరుస్తుంటారు. పిచ్చికగుడ్డులా మచ్చల మొహం యూదు ఒకడు రాగిజుట్టు వేసుకుని కిటికీగుండా చూస్తున్నాడు. యాంకెల్ కంటపడగానే కీసరబాసర ఏదో మాట్లాడసాగాడు. యాంకెల్ శకటాన్ని పెరడులోకి తోలు కొని వెళ్ళాడు. వీధివెంట బోయే ఇంకో యూదు ఆగి వారి సంభాషణలో పాల్గొనజొచ్చాడు. ఇటికిల కిందనుంచి బుల్బా పాక్కుంటూ బైటపడేసరికి అ ముగ్గురు యూదులు అమితో త్సాహంతో మాట్లాడుకుంటున్నారు.

యాంకెల్ బుల్బా కేసి తిరిగి అంతా సవ్యంగానే జరు గుతుందనీ, ఒస్టాప్ పట్టణ జైలులో ఉన్నాడనీ, కావలావాళ్ళని ఒప్పించడం కష్టమయినా ఏదోవిధంగా తంటాలుపడి ఒస్టాప్‌ను కలుసుకునేటట్టు చేయగలననే ధైర్యం ఉందనీ తెలియజేశాడు.

బుల్బా ఆ ముగ్గురు యూదులతోను కలిసి ఒక గదిలోకి వెళ్ళాడు.

ఇతరులకు అర్థంకాని భాషలో ఆ ముగ్గురు యూదులు తిరిగీ మాట్లాడుకోసాగారు. తారాస్ ఆ ముగ్గురిలో ప్రతి ఒకరికేసీ చూశాడు ఏదో అతనిని తీవ్రంగా ఉద్రేకపరిచింది. మోటు మొహం మీద ఆశాజ్యోతి దివ్యంగా ప్రకాశించింది. విపరీతమయిన నిరాశకు లోనయిన మానవునికి మధ్య మధ్య ఇలాంటి ఆశే కలుగుతూంటుంది యువకుని గుండెవలే ఆ ముదుసలి గుండె కొట్టుకోసాగింది.

"వినండి, యూదులారా!" అన్నాడు బుల్బా. అతని స్వరంలో ఆనందం ధ్వనించింది. "మీరు చేయలేనిదంటూ లేదు. సముద్రం నీరుకూడా తోడేయగలరు. తలుచుకుంటే యూదు తనది తానే దొంగిలిస్తాడు. నా ఒస్టాప్‌ని విడిపించండి! అ రాక్షసుల చేతుల్లోంచి తప్పించుకోవడానికి సాయపడండి. వీడికి పన్నెండు వేలడకెట్లు యిస్తానని మాట యిచ్చాను. యింకో పన్నెండు వందలు తీసుకోండి. ఖరీదయిన గిన్నెలు, పాతిపెట్టిన బంగారం, నా ఇల్లు, నా దుస్తులు ఒకటేమిటి నా సర్వస్వమూ మీకు అర్పిస్తాను. బతికి వున్నంతవరకు యుద్ధాలలో నేను గెల్చుకున్నదాంట్లో సగంపాలు యిస్తాను."

"ఉహుం- మావల్లగాదు, దొరా, మా వల్లగాదు" అని అన్నాడు యాంకెల్ నిట్టూరుస్తూ. ఉహుం మావల్లకాదన్నాడు ఇంకో యూదు.

ఆ ముగ్గురు యూదులూ ఒకరికేసి ఒకరు చూసుకున్నారు.

"అయినా ప్రయత్నిస్తే యేంపోయింది" అన్నాడు మూడో యూదు తక్కిన ఇద్దరివంకా భయం భయంగా చూస్తూ. భగవంతుడు మనకు చేయూత యివ్వొచ్చు."

ఆ ముగ్గురు యూదులూ జర్మన్ భాషలో మాట్లాడడం మొదలుపెట్టారు. బుల్బా చెవులు ఎంత నిక్కపొడుచుకుని విన్నా ఒక్క మాటకూడా అర్థం కాలేదు. మర్దోహాయ్ అనే మాటమాత్రం తరుచు వినిపించింది.

"విను దొరా!" అన్నాడు యాంకెల్." ఒకరితో సంప్రదించాల్సి వుంది. అతను యెటువంటివాడనుకున్నారు! ప్రపంచంలోనే అటువంటివాడు లేడంటే నమ్మండి. "హోవహో! సాలమన్ అంతటి తెలివిగలవాడు. అతనివల్ల గానిపని భూమ్మీద యెవడివల్లా కాదనుకోండి, యిక్కడే కూర్చోండి యిదిగో తాళంచెవి. యెవరినీ లోనికి రానీకండి"

ఆ యూదులు ముగ్గురూ వీధిలోకి వెళ్ళిపోయారు.

తారాస్ తలుపు గడియ వేసుకుని చిన్న కిటికీగుండా ఆ మురికివీధి చూశాడు. ఆ ముగ్గురు యూదులూ వీధిమధ్యలో నిలబడి మహా ఉద్రేకంతో మాట్లాడుకుంటున్నారు. కొద్దిసేపటికి ఇంకో యూదు, ఆ తరవాత మరొక యూదు వచ్చి చేరారు. ఆ యూదులు వీధి చివరవంక చూడసాగారు. ఇంతలో యూదు చెప్పులు వేసుకున్న యూదు పాదం, యూదు కోటు అంచులు మూలనున్న పాడుఇంటి వెనకాలనుంచి ప్రత్యక్షమయాయి. "ఆఁ-మర్దోహాయ్, మర్దోహాయ్!" అని ఆ యూదులు ఒక్కసారే కేకలు పెట్టారు. బక్కచిక్కిన ఒక యూదువారిని సమీపించాడు, అతడు యాంకెల్ కన్న కురచ. అయినా ఇంకా

ఎక్కువ ముడతలు పడ్డాయి. పై పెదవి పెద్దది. ఆ యూదులు ముగ్గురూ ఒకరితో ఒకరు పోటీపడుతూ వారి వ్యవహారమంతా అతనికి చెప్పారు. మార్డొహాయ్ కిటికీకేసి తడవతడవకి చూడ సాగాడు. దానినిబట్టి తననుగురించే వారు మాట్లాడుకుంటున్నా రని తారాస్ గ్రహించాడు, మార్డొహాయ్ చేతులు ఊపుతూ, వింటూ, వారి మాటలకు మధ్యమధ్య అడ్డు తగులుతూ తరుచు ఉమ్మివేస్తూ, మురికి వాసన కొట్టే ఇజారు కనిపించేటట్టు కోటు అంచులు పైకెత్తి జేబులోనుంచి చిన్న నగ ఒకటి పైకితీశాడు చివరికి వీరిగోల ఎక్కువయేసరికి పహరా ఇస్తున్న యూదు గోల చేయవద్దని హెచ్చరించవలసి వచ్చింది. తారాస్ తనకు అపాయం సంభవిస్తుందేమోనని భయపడ్డాడు. యూదులు వీధిలో తప్ప మాట్లాడరనీ వారిమాటలు ఎవరికీ అర్థం కావనీ జ్ఞాపకంవచ్చే సరికి ఆరాటం అణగారిపోయింది.

ఒకటి రెండు నిమిషాల తరవాత ఆ యూదులు కలిసి కట్టుగా బుల్బాఉన్న గదిలో ప్రవేశించారు. మర్డొహాయ్ బుల్బా దగ్గరకువెళ్ళి బుజంమీద తట్టి అన్నాడు. "మేమూ, భగ వంతుడూ యేదయినా ఒకపని చేయాలని సంకల్పించామంటే, నెరవేరి తీరుతుంది."

సాటిలేని ఈ సాలమన్‌వంక చూసేసరికి తారాస్‌కి కొత్త ఆశ అంకురించింది. ఆ యూదు వాలకమే విశ్వాసాన్ని రగు ల్కొల్పుతుంది అతని పై పెదవి బ్రహ్మాండంగా ఉంటుంది. దానిమందం పెరుగుదల అతని అధీనంలో ఏమాత్రంలేదు. ఈ సాలమన్ గడ్డానికి ఓ డజను వెంట్రుకలుకన్నా ఎక్కువలేవు. అవయినా ఎడమపక్కన ఉన్నాయి. సాహస కృత్యాలలో తగి

లిన దెబ్బల మచ్చలు మొహంనిండా కనిపిస్తున్నాయి. బహుశా ఎన్ని మచ్చలు పడ్డాయోకూడా మరిచేపోయి, వాటిని పుట్టు మచ్చలులాగా పరిగణించసాగాడు.

మర్దొహాయ్ తన అనుచరులతో కలిసి వెళ్ళిపోయాడు. వారూ అతని తెలివితేటలకు ఆశ్చర్యచకితు లయారు. బుల్బా ఒంటరిగా మిగిలిపోయాడు. అతను ఒక విచిత్రమయిన, అపూర్వ మయిన పరిస్థితిలో చిక్కుకున్నాడు. ఎన్నడూ ఎరగనంత ఆదుర్దాతో మనసు నిండిపోయింది. గుండె ఉడికిపోయింది. ఇపుడు అతను పూర్వపు బుల్బాకాదు. పూర్వపు బుల్బా సిందూరపు మానులాగా బలీయుడు; తలవంచని వీరుడు, ధైర్యశాలి. ఇపుడు గుండె నిబ్బరం తగ్గింది బలం క్షీణించింది. చప్పుడయితే చాలు, వీధిచివర యూదురూపం కంటపడితే చాలు బెదిరిపోతున్నాడు. ఈ విధమయిన అవస్థలో రాత్రంతా గడిపాడు. ఏమీ తినలేదు, తాగలేదు. కిటికీనుంచి దృష్టి మళ్ళించలేదు. చివరికి సాయం కాలం కావస్తుండగా మర్దొహాయ్, యాంకెల్ వచ్చారు. బుల్బా గుండె ఆగిపోయేటంత పనయింది.

"యేమిటి? అంతా సవ్యంగా జరిగేనా?" అని వారిని ప్రశ్నించాడు, అడవిగుర్రంలాగా ఏమాత్రం తాలిమి లేకుండా.

జవాబు చెప్పడానికి ధైర్యాన్ని కూడగట్టుకుంటూం డగా, అసహ్యంగా మర్దొహాయ్ టోపీ కిందనుంచి ఉంగరాలు తిరుగుతూ వేలాడే చెంపవెంట్రుకలు మాయమయినాయని బుల్బా గమనించాడు. అతనేదో చెప్పదలచినట్లు కనిపించాడు. కాని ఏదో కీసర బాసరగా వాగేవాడేగాని తారాస్‌కు ఒక

మాటా అర్థంకాలేదు, రొంపతో బాధపడుతున్న వాడిలాగా నోటిమీదనుంచి చేయి తీయనేలేదు.

"ఓ దొరా! మహామంచి దొరా!" అంటూ ప్రారంభించాడు యాంకెల్. "యిక మావల్లగాదు! దేవుడిసాక్షి మావల్ల గాదు! వాళ్ళు వట్టి చెడ్డముండాకొడుకులు! మొహం మీద వూసినా పాపంలేదు! మర్దొహాయ్‌ని అడిగితే యీ ముక్కే అంటాడు. యెవడూ యెన్నడూ తంటాలు పడనంతగా మర్దొహాయ్ తంటాలు పడ్డాడు. కాని మన సంకల్పం నెరవేరాలని భగవంతుడు యిచ్ఛగించడంలేదు. యిక్కడ మూడువేలమంది సైనికుల్ని పెట్టారు. రేపు ఖైదీలందరినీ చంపేస్తారు."

తారాస్ ఆ యూదుల కళ్ళల్లోకి చూశాడు. కాని ఆ చూపులో తొందరగాని కోపంగాని ద్యోతకం కాలేదు.

"ఆయనగారిని దొర చూడాలనుకుంటే రేపువుదయాన్నే పొద్దుపొడవక ముందే చూడాలి. కాపలా మనుషులు అంగీకరించారు. వార్డన్ ముఖ్యులలో ఒకడు మాటకూడా యిచ్చాడు. వాళ్ళు నరకానపడా! ఓ - అబ్బ! యెంత దురాశాపరులనుకున్నారు! మా అందరికంటె కూడా దురాశపరులనుకోండి, ఒక్కొక్కడికీ యాభై యేసి డకెట్లు యిచ్చాను. ఆ వార్డనుకి-"

"సరే మంచిది. వాడి దగ్గిరికి నన్ను తీసుకువెళ్ళు!" అన్నాడు తారాస్ దృఢనిశ్చయంతో, పూర్వమంత గుండె నిబ్బరంతో.

అపుడే దిగిన విదేశీ జమీందారులాగా వేషం వేసుకోవాలనే యాంకెల్ సూచనకు తారాస్ అంగీకరించాడు. ఆయూదు

దూరదృష్టి గలవాడుగదూ, కావలసిన దుస్తులు సంపాదించి తెచ్చాడు

అప్పటికే చీకటి పడింది. ఆయింటి యజమాని - ఆరాగి జుట్టు, ఒక్కపలచని యూదు నారచాప కప్పిన సన్నటి పరుపు బయటికిలాగి ఒక బల్లమీదవేసి బుల్బాను పండుకోమన్నాడు. యాంకెల్ అలాంటి పరుపే నేలమీద పరుచుకుని పడుకున్నాడు. రాగిజుట్టు యూదు ఒకకప్పు కషాయం తాగి, కోటు విప్పాడు. ఆ చెప్పులు, ఆ మేజోళ్లు అతను అచ్చంగా కోడిపిల్లలాగా ఉన్నాడు. భార్యతో ఒక విధమయిన బీరువాలాంటి దానిలోకి చక్కాబోయాడు. కాని తారాస్ బుల్బాకి నిద్ర పట్టలేదు. రాతిబొమ్మలా కదలకుండా కూర్చుని చేతివేళ్ళతో బల్లమీద దరువు వాయించసాగాడు. పైపు నోటిలో పెట్టుకుని తాగుతూ పొగ వదిలాడు. ఆపొగ ఘాటుకు నిద్రలో యాంకెల్ తుమ్మి మొహంమీదికి దుప్పటి లాగుకున్నాడు. అరుణరేఖలు ఆకాశంలో కనిపించీ కనిపించక ముందే బుల్బా యాంకెల్‌ను పాదంతో తోసి లేపాడు.

"లే ! లేచి ఆ జమీందారు దుస్తులు యిలా పడెయ్."

ఒక్క నిమిషంలో జమీందారు వేషం వేసుకోవడం పూర్తి అయింది. మీసాలకు కనుబొమలకు నల్లరంగు వేశాడు. నెత్తిమీద నల్లటి టోపీ పెట్టుకున్నాడు. బాగా ఎరిగిఉన్న కోసక్‌లుకూడా అతనిని ఈ వేషంలో గుర్తు పట్టలేరు. వయసు ముప్ఫయి ఏళ్ళకంటె ఎక్కువ అనిపించదు. చెంపలు ఎర్రగా మెరిసిపోతున్నాయి. గాయపు మచ్చలు ఎందువల్లనో అతనికి ఠీవిని ఒనగూర్చాయి. బంగారం తాపిన దుస్తులు బాగా అతికి పోయాయి.

వీధులలో ఎక్కడా అలికిడిలేదు. వ్యాపారస్థుడు ఒకడ యినా బుట్ట పట్టుకుని కనిపించలేదు. గూర్చున్న కొంగలాగా ఉన్న ఒక భవంతి దగ్గరకు తారాస్, యాంకెల్ చేరుకున్నారు. ఆ భవంతి చాలా కిందుగా, విశాలంగా నల్లబడి ఉంది. ఒక వేపున పైకెత్తిన కొంగమెడలాగా పొడుగాటి సన్నటి గోపురం ఉంది. ఆ గోపురం మీద ఒక ఇంటి పైకప్పులో కొంతభాగం కనిపించింది. ఈ భవంతి రకరకాల పనులకు ఉపయోగపడు తోంది. ఇందులో బారకాసులు, జైలు, న్యాయస్థానం ఉన్నాయి. మన ప్రయాణీకులు ద్వారం దాటి ఒక గదిలాంటి శాల లోకి ప్రవేశించారు. అది పైకప్పు వేసిన పెరడులా ఉంది. అక్కడ వేయిమందిదాకా సైనికులు నిద్రిస్తున్నారు. వారికి ముందు సూటిగా ఒక చిన్న ద్వారం కనిపించింది దానిముందు కూర్చుని ఇద్దరు కాపలా మనుషులు రెండు వేళ్ళతో అవతల వాడి అరచేతిమీద కొట్టే ఒక విధమయిన ఆట ఆడుతున్నారు. ఈ నూతనాగంతకుల విషయమయి వాళ్లు పట్టించుకోలేదుగాని యాంకెల్, "మేమే! వినిపించిందాండి: మేమే!" అనేసరికి తలలు తిప్పి చూశారు.

"లోపలికి వెళ్ళండి" అన్నాడు వారిలో ఒకడు ఒక చేతితో తలుపుతోస్తూ, ఇంకో చేయి సహచరుడ్ని తట్టడానికి జాపుతూ.

వారు ఒక ఇరుకు నడవలో ప్రవేశించారు. అక్కడ చీకటిగా ఉంది. వెళ్ళగా వెళ్ళగా మొదటిగుర్రం శాలవంటి ఇంకో శాలకు చేరుకున్నారు. ఆ శాలపైన చిన్న చిన్న కిటికీలు ఉన్నాయి.

"యెవరా వెళ్లేది?" అని పలు గొంతులు అరిచాయి. కిందనుంచి పైదాకా ఆయుధాలు ధరించిన సైనికులు చాలా మంది తారాస్‌కు కనిపించారు. "యెవర్నీ లోపలికి వెళ్ళనీయ వద్దని మాకు ఆజ్ఞలు వచ్చాయి."

"మేమే!" అని అరిచాడు యాంకెల్. "మేమే స్వామీ మేమే!"

కాని ఒక్కడూ అతని మాట వినిపించుకోలేదు. అదృష్ట వశాత్తూ సరిగ్గా ఆ సమయానికి ఒక లావుపాటి వ్యక్తివచ్చాడు. అతని వాలకాన్ని బట్టీ, అక్కడివారందరికంటె ఎక్కువగా బూతులు తిడుతూండడం బట్టీ అక్కడ అతనొక ముఖ్యుడని తోచింది.

"దొరా ? మేమే ! మమ్మల్ని మీరు యిదివరకునుంచీ యెరుగున్నారుగా ! మా జమీందారుగారు మీకు యింకోమారు కృతజ్ఞత చూపుతారు."

"సరే, వీళ్ళని వెళ్లనీండి, వెధవ గాడిద కొడుకుల్లారా ! యింకెవరినీ రానీకండి. కత్తులు కిందపెట్టి కుక్కల్లా పడుకో కండి..."

దడదడా జారీచేసిన ఈ ఆజ్ఞల చివరిభాగం మన ప్రయా ణీకులకు వినిపించలేదు.

"మేమే.... మేమే.... స్నేహితులం ! అని కనిపించిన ప్రతీ వాడితోనూ యాంకెల్ అనసాగాడు.

"యిక లోపలికి వెళ్ళచ్చా !" అని నడవ చివరకు చేరుకో గానే ఒక కాపలావాడిని అడిగాడు.

"ఆం - వెళ్ళచ్చు. కాని జైలులోకి మిమ్మల్ని రానిస్తారో లేదో నాకు తెలీదు. జాన్ యిపు దక్కడ లేడు. అతని బదులు యింకోఅతను పని చేస్తున్నాడు."

"ఓహో !" అని మెల్లగా ఆ యూదు గొణిగాడు

"వ్యవహారమేమీ బావుండలేదు దొరా !"

"పద" అన్నాడు బుల్బా మొండిగా.

ఆ యూదు సరేఅని బయలుదేరాడు కోణం లేచిన కమానుమధ్య కట్టిన చీకటికొట్టు గుమ్మంలో ఒక సైనికుడు నిలబడి ఉన్నాడు. వాడి మీసం మూడు పాయలుగా ఉంది. పై పాయ వెనకకు తిరిగి ఉంది. రెండోది సూటిగా ముందుకు, మూడోది కిందికి వంగి ఉంది. ఇలాంటి మీసాలతో వాడు అచ్చంగా గండుపిల్లిలా ఉన్నాడు.

ఆ యూదు సాధ్యమైనంతగా వంగి చల్లగా వాడి దగ్గరికి వెళ్ళి "ప్రభూ ! మహాప్రభూ!" అంటూ ప్రారంభించాడు.

"నన్నేనా?"

"అవును ప్రభూ ! మిమ్మల్నే!"

"ఊం - నేను మామూలు సిపాయిని." అన్నాడు ఆ మూడు పాయల మీసాల సైనికుడు. వాడి కళ్ళల్లో సంతోషం తళుక్కుమంది.

"దేవుడి తోడు ? పట్టణాధికారే అనుకున్నానుసుమా ? ఒహో!" అని ఆ యూదు తల ఆడించి, చేతివేళ్ళు జాపాడు. "యెంత ఠీవి, యెంత ఠీవి ! సేనానిలాగానే వున్నాడు ఒక్క వెంట్రుకవాసి తక్కువగాని లేకపోతే అచ్చంగా సేనానే! తూనీగలాగా యెగిరే గుర్రంమీద కూర్చోపెట్టి పటాలాన్ని నడపమనవలసింది!"

ఆ సైనికుడు మీసం కిందపాయ దువ్వుకున్నాడు. సంతోషంతో అతని కళ్ళు ఇంకా మెరిసిపోయాయి.

"సిపాయిలంటె యెంత చక్కని వాళ్ళని!" అంటూ కొనసాగించాడు ఆయూదు. "బలే! బలేవాళ్ళు! ఆజుట్టు, ఆ అలంకారాలు సూర్యుడిలా వెలిగిపోతూంటాయి, యిక కన్నె కలు, సిపాయిలు కనిపించితే ఒహో!"

ఆ సైనికుడు మీసంపై పాయ మెలివేసుకుని గుర్రంలా సకిలించాడు.

"ఒక్క ప్రుపకారం చేసిపెట్టమని వేడుకుంటున్నా," అన్నాడు యూదు. "వీరు విదేశాలనుంచి వచ్చిన జమిందారులు. కోసక్‌లు యెలావుంటారో చూడాలని వీరికి కోరిక కలిగింది. వీరు జీవితంలో యెన్నడూ కోసక్‌ల మోసంచూసి యెరగరు."

విదేశాలనుంచి జమీందారులు, ప్రభువులు పోలండు రావడం సర్వసామాన్యమే. యూరపులోని ఈఅర్ధ ఆసియా ఖండం చూడాలనే కుతూహలంతో రావడం కద్దు. మాస్కో, యుక్రెయిన్‌లను ఆసియా ఖండంలోవిగానే పరిగణించేవారు. అందుకని ఆ సైనికుడు వంగివంగి నమస్కరించి తానూ నాలుగు ముక్కలు చెప్పాలనుకున్నాడు.

"వాళ్ళని చూడాలని దొరవారికి యెందుకు కోరిక కలిగిందో నాకు తెలీదుగాని వాళ్ళు మనుషులు గాదు కుక్కలు! వాళ్ళ మతంకూడా అర్ధాన్న మయిందే!"

"అబద్ధం! లంజకొడకా!" అన్నాడు బుల్బా.

"నువ్వే కుక్కవి, మామతం అర్ధాన్న మయిందనడానికి నీకు యెన్ని గుండెలున్నాయిరా ? మీ పాషండ మతమే అర్ధాన్న మయింది !"

"అహః ! నువెవరివో తెలిసిపోయిందిలే. నే నిక్కడ కాపలా కాస్తున్న వాళ్ళల్లో వాడివే నువ్వ్వానూ, మావాళ్ళని పిలుస్తానుండు."

పొరపాటు చేశానని తారాస్ గ్రహించాడు. కాని మొండితనం, విసుగు ఆ పొరపాటును సర్దుకోకుండా చేశాయి. అదృష్టవశాత్తూ యాంకెల్ తారాస్‌ను కాపాడడానికి అన్నాడు.

"ప్రభూ ! జమీందారు కోసక్ అవడం యెలా సంభవిస్తుంది ? కోసక్ అయితే యీ దిరీసు యెక్కడినుంచి వస్తుంది ? యీ ఠీవి యెలా అలవడుతుంది ?

"ఝూ అబద్ధాలు కట్టిపెట్టు!" అని ఆ సైనికుడు కేక పెట్టడానికి నోరు తెరిచాడు.

"ప్రభూ ! శాంతించండి ! శాంతించండి!" అని అరిచాడు యాంకెల్." యింతవరకు యెవరికీ ముట్టనంతగా మీకు ముట్ట చెపుతాం. రెండు బంగారు డకెట్లు యిచ్చుకుంటాం"

"ఊఁ- రెండు డకెట్లా? రెండు డకెట్లు నాకో లెక్కా జమా? నా గడ్డం సగంగొరిగినందుకే మంగలకి రెండుడకెట్లు యిస్తూంటాను. వందడకెట్లు యిచ్చుకో!" ఇలా అని ఆ సైనికుడు మీసంపై పాయ మెలిపెట్టాడు. "వందడకెట్లు యిచ్చుకోకపోతే కేక పెట్టేస్తాను."

"అంత మొత్తం యిచ్చుకోవలసిందేనా?" అన్నాడు యూదు విచారంతో తెల్లమొగం వేస్తూ. తోలుసంచి ఊడదీసి

చూసి అంతమొత్తం లేకపోవడానికి, ఆ సైనికుడు వందకిపైన లెక్కపెట్టలేకపోవడానికి సంతోషించాడు.

"దొరా! ఒక్కనిమిషంకూడా ఆగద్దు. వెళ్ళిపోదాం పదండి. యిక్కడివాళ్ళంతా యెంతచెడ్డవాళ్ళో చూస్తున్నారుగా." అన్నాడు యాంకెల్. ఇంకా ఎక్కువ అడగకపోతినే అని సైనికుడు పస్తాయించడం కనిపెట్టి,

"యేవిఁటీ! దెయ్యపువెధవ! డబ్బుతీసుకుని కోసక్ల్ని చూపెట్టనంటావా? ఉహుఁ- చూపించితీరాలి. డబ్బుపుచ్చుకున్నాక చూపెట్టననడానికి వీల్లేదు."

"పో, పో, నీతాతతో చెప్పుకో. పోకపోతివా యీ నిమిషంలోనే కేకపెడతాను. నిన్ను — యెందుకొచ్చింది వెళ్ళిపో."

"దొరా! దొరా! పోదాంపదండి. వాళ్ళని మరిడమ్మ యెత్తుకుపోను!" అని అరిచాడు పాపఁ! యాంకెల్.

బుల్బా నింపాదిగా వెనకకుతిరిగి తలవంచుకుని తిరుగుమొగం పట్టాడు. యాంకెల్ అతనివెనకాలే నడుస్తూ డబ్బు అనవసరంగా వదిలినందుకు తిట్టిపోయసాగాడు.

"వాడిమీద విరుచుకుపడకపోతే యేంపోయింది? ఆకుక్కవెధవ తిడితేతిట్టాడని వూరుకుంటే సరిపోయేది. వాళ్ళస్వభావమే అంత అబ్బ! అదృష్టమంటే అలావుండాలి. మనలను తరిమేయడానికి వందడకెట్లు? యిక మనగతి—మనజులపాలు గొరిగించి, మొహానికి మసిపూస్తారు. మొహంచూపడానికే సిగ్గేస్తుంది. అయితేనేం ఒకడూ మనకి వందడకెట్లు యిచ్చిచావడు! ఆరిభగవంతుడా! దయామయా!"

కాని వారిఎత్తుపారకపోవడం బుల్బామీద బాగా పని చేసింది. కళ్ళల్లో అగ్నిజ్వాలలు రేగాయి.

"పోదాంపద!" అన్నాడు తారాస్ హఠాత్తుగా ఉద్రేకంతో. "చౌకులోకి వెడదాంపద. వాడిని యెలా చిత్రహింస చేస్తారో చూడాలనివుంది!"

"అదేవిఁటి దొరా! వెళ్ళి ప్రయోజనమేమిఁటి? చేయగలిగిందేమీ లేదు."

"వెళ్లవలసిందే!" అన్నాడు బుల్బా మొండిగా.

దాదిలాగా ఆయూదునిట్టూర్చి అతని వెనకాలే కాళ్ళీడ్చుకుంటూ బయలుదేరాడు.

వధ్యస్థానం చేరుకోవడం ఏమంత కష్టంకాదు. నాలుగు వైపులనుంచీ జనం గుంపులు గుంపులుగా వచ్చి అక్కడ చేరుతున్నారు. ఆ అనాగరికపు రోజులలో అటువంటి దృశ్యం అలాగా జనానికేగాక కులీనులకుకూడా ఆకర్షణీయంగా ఉండేది. నిష్టాపరులయిన ముసలమ్మలు, పిరికిగుండె కన్యలు, యువతులు కుతూహలం తీర్చుకోవడానికి ఇటువంటి అవకాశం జారవిడిచేవారు గాదు. వీరికి రాత్రంతా రక్తసిక్తమయిన శవాలు కలలోకి వచ్చేవి. తాగినవాడిలాగా కలలో వెర్రికేకలు వేసేవారు.

"అబ్బ! యేమిఁ హింసాకాండ!" అని అరిచేవారు వారు కళ్ళుమూసుకుని, తలతిప్పేసుకుని మూర్ఛరోగిలా. అయితేనేం చివరిదాకా కూర్చుని చూసేవారు. కొంతమంది నోళ్ళు తెరుచుకుని, చేతులుచాపి ముందున్నవారి తలలమీదుగా దుమకాలని కాంక్షించేవారు. ఈ చిన్నతలకాయల మధ్య కటికవాని బండ మొహం కనిపిస్తోంది. రసజ్ఞునిలాగా అక్కడ జరిగేదంతా తిల

కిస్తూ, ఏ కాతుర పదప్రయోగంతో కత్తులవాడితో మాట్లాడుతు న్నాడు. కెలవురోజుల్లో ఆ కత్తులవాడితో కలిసి ఒకే సారా దుకాణంలో తాగేవాడేమో 'తమ్ముడూ' అని పిలిచేవాడు. కొందరు ఆ దృశ్యాన్ని తీవ్రంగా సమీక్షిస్తున్నారు. కొందరు పందాలు ఒడ్డుతున్నారు. కాని ఆ జన సందోహంలో ఎక్కువ మంది సాక్షీభూతులుగా ప్రపంచాన్నీ ప్రపంచంలో జరిగేవీ ముక్కుమూసుకుని చూస్తూ ఉన్నారు.

ముందుభాగంలో, బుగ్గమీసాల నగర రక్షణ సైనికుని దగ్గరగా ఒక యువకుడు నిలబడి ఉన్నాడు. పెద్దమనిషిగా చెలామణి గావాలని యత్నిస్తున్నాడు. సైనికదుస్తులు ధరించాడు. చినిగిపోయిన చొక్కా, పాతబూట్లు ఇంట్లో వదిలేసి ఉన్న దుస్తులన్నీ వేసుకున్నాడు. మెడలో ఒకదానిమీద ఒకటి రెండు గొలుసులు వేలాడుతూ డకెట్టులాంటి వస్తువుకు ఊతగా ఉన్నట్టున్నాయి. అతని ప్రియురాలు ఇజెఫా పక్క నిలబడి ఎవరూ ఆమె పట్టుదుస్తులు పాడుచేయకుండా దృష్టి చుట్టూ ఉన్నవారిపై కేంద్రీకరించాడు. అక్కడ జరిగేదంతా ఆమెకు పూసగుచ్చినట్టు చెపుతున్నాడు. ఎవరూ అంతకంటె ఎక్కువ వివరంగా చెప్పలేరు.

"యీజనమంతా నేరస్తులను వురితీస్తూంటే చూడడానికి వచ్చారు. ప్రియా, ఇజెఫా!" అన్నాడు. "అదిగో, చేతిలో గొడ్డలి, యితరసాధనలూ పట్టుకుని నిలుచున్నవాడే తలవరి. వాళ్ళని చిత్రహింసపెట్టి చంపేస్తాడు. చక్రంమీద వాళ్ళని విరిచేసి యితరవిధాల చిత్రహింసపెట్టినా నేరస్తుడు చావకపోవచ్చు. కాని తలనరికేస్తేమాత్రం తక్షణమే చచ్చూరుకుంటాడు.

ప్రాణంపోయేముందు గిలగిలా తన్నుకుంటాడు. కేకలు పెడ తాడు. కాని తలకాస్తా కొట్టేసిన తరవాత కేకలువేయడు, తినడు, తాగడు. అసలు తలవుంటేగా!"

ఇజెఫా ఇదంతా భయంతో కుతూహలంతో విన్నది.

ఇళ్ళపైకప్పులమీదకూడా జనం గుమిగూడారు. గూడు కిటికీలలోనుంచి తలలమీద కుళ్ళాయినిపెట్టుకుని చిత్రమయిన మీసాలవారు తొంగిచూస్తున్నారు. చాందిని కట్టిన వసారాలలో గొప్పవంశీకులు కూర్చున్నారు. పంచదారతెలుపు చేతిని పిట్ట గోడమీద ఆనించి ఒకయువతి నవ్వుతోంది, బొద్దుపాటి ప్రఖ్యాత ప్రభువులు ఠీవితో చూస్తున్నారు. చేతులువేలాడే విలువ దుస్తులు ధరించి ఒక నౌకరు రకరకాల ఫలహారాలు అందిస్తున్నాడు. మధ్యమధ్య నల్లకళ్ళ చిలిపిపడుచులు తామరతూడులాంటి చేతితో రొట్టో పండో తీసుకుని కిందమూగిన జనంలోకి విసిరి వేస్తున్నారు. ఆకలితో అలమటించే రౌతులు ఆ రొట్టెనో పండునోపట్టుకోవడానికి టోపీలుచూపట్టేవారు. కాని పొడుగాటి ఏ నౌకరో పొడుగాటి చేతులతో దానిని పట్టుకుని ముద్దిడుకొని గుండెకు ఆనించుకుని నోట్లో కుక్కుకునేవాడు. వసారాలో వేలాడే బంగారు పంజరంలోని డేగకూడా ప్రేక్షకలోకం కిందే లెక్క. ఒకవైపుకు తలవంచుకుని ఒకకాలు పైకెత్తి అదీ శ్రద్ధగా కిందిజనంకేసి చూస్తోంది హఠాత్తుగా జనంలో సందడి బయలుదేరింది. నలువైపులనుంచీ మాటలువినిపించసాగాయి. "తీసుకువస్తున్నారు! కోసక్‌లను తీసుకువస్తున్నారు!"

ఆ కోసక్‌ల తలలమీద ఏమీలేదు పొడుగాటి పిలకలు కని పిస్తున్నాయి. గడ్డాలు మాసిపోయినాయి. వారు భయపడుతూ

గాని వ్యాకులపడుతూగాని రాలేదు. ప్రశాంతంగా సగర్వంగా చక్కా వచ్చారు. విలువయిన గుడ్డతో కుట్టించిన దుస్తులు మాసిపేలికలు పేలికలుగా వేలాడుతున్నాయి. జనంవంక వారు చూడడంలేదు. వంగినమస్కరించడంలేదు. అందరికన్నా ముందు ఒస్టాప్ చక్కా వచ్చాడు.

ఒస్టాప్ కంటపడేసరికి బుల్బా హృదయంలో ఎటువంటి భావాలు చెలరేగాయో! అతని మనసులో ఏముంది? జనంలో నుంచి అతనికేసి తేరి పారజూశాడు. కను మరగలేదు. ఒస్టాప్ వచ్చి ఆగాడు, అందరికంటెముందు అతను మృత్యువాతపడాలి! సహచరులకేసి చూసి చేయెత్తి బిగ్గరగా అన్నాడు: "యిక్కడ నిలబడ్డ పాషండుల చెవుల క్రైస్తవుని అరుపులు పడకుండుగాక! మనలో ఒక్కరూ నోరెత్తగూడదు!"

ఇలా చెప్పి పరవంజామీదికి ఎక్కాడు

'బలేబాగా చెప్పావ్! బలేబాగా చెప్పావ్!' అని మెల్లగా అని బుల్బా నెరిసిన తల వంచుకున్నాడు.

ఆ తలవరి ఒస్టాప్ ఒంటిమీది పీలికను చింపి పారేశాడు. ప్రత్యేకంగా తయారుచేసిన బండకొయ్యకు కాళ్లూచేతులూ కట్టివేశారు.... కానీ చదువరులను భయకంపితులను చేసే ఆ దారుణ హింసాకాండ వర్ణించి చెప్పి ప్రయాసపెట్టదలచుకో లేదు. అదంతా ఆ మోటు, అనాగరికయుగ ఫలితమే. ఆనాడు మానవులు హింసా ప్రధానమయిన కూరకృత్యాలతో జీవితం గడిపేవారు. అది మానవత్వానికే పూర్తిగా విరుద్ధమయినది, వారి ఆత్మలను బండబార చేసింది. ఆయుగంలో కొద్దిమంది మాత్రమే ఈ దారుణ హింసాకాండను వ్యతిరేకించారు. కాని

లాభం లేకపోయింది. విజ్ఞానవంతులయిన కొంతమంది రాజులు, యోధులు ఈ దారుణ హింసాకాండ కోసక్ జాతిలో పగరేకె త్తిస్తుందని చెప్పిచూశారు. కాని ప్రయోజనం కలగలేదు. దేశంలోని గొప్పగొప్పవారి మొండిపట్టుదల, అరాచకత్వం ముందు ప్రభుత్వాధికారం, వివేకవంతులసలహాలు కొరగాకుండా పోయాయి. ఈ గొప్పవారు డయట్ (పార్లమెంటు)ను ఆలోచన లేకుండా, దూరదృష్టి ఏమాత్రం లేకుండా, దురహంకారంతో, పొగరుబోతుతనంతో వట్టి ప్రహసనంకింద తయారు చేశారు.

ఒస్టాప్ చిత్రహింసను, నరక యాతనలను రాక్షసుడులా భరించాడు. చేతి ఎముకలు కాలి ఎముకలు విరగగొడుతున్నా కిక్కురుమనలేదు, మూలగలేదు, కేకలుపెట్టలేదు. దూరాన ఎక్కడో ఉన్న ప్రేక్షకులకుకూడా ఆ మృత నిశ్శబ్దంలో ఎముకలు విరిగినశబ్దం వినిపించింది. స్త్రీలు దృష్టి మరలించుకున్నారు ఒక్కసారయినా మూలగలేదు. ముఖకండరం ఒక్కటీ ముడుచుకోలేదు. తారాస్ ఆ జనసందోహంలో తలవంచుకుని నిలబడ్డాడేగాని దృష్టిమాత్రం పైనే ఉంది. సగర్వంగా 'బలే! బలే!' అని మాటిమాటికీ అనుకోజొచ్చాడు.

కాని చిత్రవధ చేయడానికి లాగుకుని వెళుతూంటే ఒస్టాప్ శక్తి ఉడికిపోతున్నట్లు అనిపించింది. చుట్టూ దృష్టి సారించాడు. భగవంతుడా! అన్నీ కొత్త మొహాలే! అపరిచితమైన మొహాలే! అతనిని ప్రేమించే వ్యక్తి ఒకడయినా ఉండి చనిపోవడం కళ్లారాచూస్తే ఎంత బాగుండును! గుండెనిబ్బరంలేని తల్లి గొల్లున ఏడ్వడం వినాలనే కాంక్ష లేదు. జుట్టుపీక్కుంటూ

తెల్లటి వక్షస్థలంమీద బాదుకుంటూ వెర్రికేకలుపెట్టే భార్య తన చావు చూడాలని అతనికిలేదు. గుండెనిబ్బరంగల మనిషి కనిపిస్తే మృత్యు ముఖంలో అతనిమాటలవల్ల కొత్త బలం, దుఃఖోప శమనంకలుగుతుందని ఆశ. బలం ఉడిగిపోయింది. ఆత్మవేదనతో 'బాటో్క! యెక్కడవున్నావ్? నామాట వినిపిస్తోందా!' అని కేక పెట్టాడు.

"వినిపించింది!" అనేముక్క ఆ ప్రదేశమంతటా అలము కున్న నిశ్శబ్దంలో ఖంగున మోగింది అక్కడఉన్న లక్షలాది జనం ఒక్కమారుగా వణకిపోయారు.

గుర్రాలమీద రక్షణసైనికబృందం జనసమూహాన్ని సర్ద డానికి ముందుకు ఉరికారు. యాంకెల్ మొహంలో నెత్తురు చుక్కలేదు రౌతులు అతని పక్కగా వెళ్ళిపోయిన తరవాత భయంతో వణుకుతూ తారాస్‌కోసం చుట్టూ చూశాడు. కాని తారాస్ అతనివెనక కనపడలేదు, అచూకీకూడా ఏమాత్రం తెలియలేదు.

# 12

కాని తారాస్ బుల్బా ఆచూకీ తెలియకపోలేదు. పన్నెండువేల కోసక్ సేన యుక్రెయిన్ సరిహద్దులలో ప్రత్యక్షమయింది. దేశం కొల్లగొట్టడానికిగాని తాతార్లను తరిమికొట్టడానికిగాని బయలుదేరిన చిన్నదండుగాదు. ఉహుఁ- ప్రజలు ఇక ఓర్చుకోలేకపోయారు. జాతిజాతే లేచింది. తమ హక్కులను భంగపరిచినందుకు, తమ ఆచారాలను సిగ్గులేక అవమానపరచినందుకు, తాత తండ్రులనుంచీ వస్తున్న మతాన్ని, పవిత్రకర్మలను దూషించినందుకు, చర్చిలను మైలపరచినందుకు, విదేశీ ప్రభువులు దౌర్జన్యం చేసినందుకు, అణగద్రొక్కినందుకు, మత సమాఖ్య నెలకొల్పి క్రైస్తవ భూమిమీద యూదులు పెత్తనం సాగించినందుకు, ఇంతకాలం కోసక్‌ల విద్వేషాన్ని పోషించి రెచ్చగొట్టిన సర్వవిషయాలకు పగదీర్చుకోవడానికి లేచింది.

ఈ అసంఖ్యాక కోసక్ సేనకు హెట్మన్ ఒస్త్రానిట్సా నాయకత్వం వహించాడు. యువకుడు. మంచి ధైర్యస్థుడు. అతని పక్కన గున్యా నిలచాడు. ఇతను పూర్వంనుంచి అతనికి సహచరుడు, సలహాదారు. పన్నెండువేల బలగంగల ఎనిమిది పటాలాలను ఎనమండుగురు సేనానులు నడుపుతున్నారు. హెట్మన్ వెనక ఇద్దరు ఈసాలులు, ఒక పతాకధారి గుర్రాల మీద స్వారి చేస్తున్నారు. ఈ పతాకధారి చేతిలో ప్రధాన

పతాకం ఉంది. వెనక దూరాన అనేక పతాకాలు, ధ్వజాలు, కర్రలకు మేకులతో కొట్టిన గుర్రపుతోకలు రెపరెపలాడుతున్నాయి. ఆశ్విక పదాతి పటాలాలలో చాలామంది ఇతర అధికారులు- సామాన్య అధికారులు, సేనానులు పటాల లేఖకులు ఉన్నారు. పేర్లు నమోదు చేయించుకున్న కోసక్‌లే గాక స్వచ్ఛందంగా అంతమందీ వచ్చి చేరారు. అన్నిచోట్లా కోసక్‌లు ఉవ్వెత్తున లేచారు. చిగ్రిరిన్, పెరతుస్లావ్, బటూరిన్, గ్లుఖోవ్ నీపర్ నది ఎగువ దిగువప్రదేశాలనుంచి దానిలోని దీవులనుంచి వచ్చారు. అసంఖ్యాకమయిన గుర్రాలు శకటాలు ఆ భూముల మీద విస్తరించుకున్నాయి. ఈ కోసక్ లందరిలోను, ఈ ఎనిమిది పటాలాలలోను తారాస్ బుల్బా నాయకత్వం వహించిన పటాలం ప్రముఖమయినది. బుల్బా వయోవృద్ధుడు, అనుభవశాలి, సేనలను నడపడంలో ప్రవీణుడు, శత్రువును ద్వేషించడంలో అసమానుడు. ఏకోశానా దాక్షిణ్యంలేని అరి భయంకరుడు, క్రూరుడు. ఈ రెండు లక్షణాలు అతనిలో శృతిమించిపోయాయని కోసక్‌లు తలచేవారు. అతని తల వధ్యస్థలానికో, ఉరికంబానికో అర్పితమయిపోవాలని విధి శాసనం. యుద్ధసమాలోచనా సమావేశాలలో విధ్వంసకాండ జరిగించాలనే అతని సలహా.

కోసక్‌లు తమ బలపరాక్రమాలను ప్రదర్శించిన యుద్ధాలనుగాని, దండయాత్రలనుగాని వర్ణించడం అప్రస్తుతం.అదంతా చరిత్రలో లిఖితమయింది. మతంకోసం జరిగేయుద్ధం రష్యాలో ఎలా ఉంటుందో అందరికీ తెలిసిందే. మతంకంటె బలవత్తరమయిన శక్తి లేదు. సముద్రమధ్యంలో తుపానువేళకూడా మానవ హస్త నిర్మితంకాని కొండలాగా ఈ శక్తి అజేయ

మయింది, భయంకరమయింది. సముద్రగర్భంలోనుంచి ఈ కొండ
పగులని, విరగని గోడగా పైకిలేచి కెరటాలను ఎదిరిస్తుంది.
దీనికి కొట్టుకున్న నావగతి ఇక వేరే చెప్పాలా! స్తంభాలు
ముక్కలు ముక్కలయి ఎగిరిపోతాయి. సమస్తమూ ధ్వంస
మయి మునిగిపోతుంది. హతమారిపోతున్న ప్రయాణీకుల
హాహాకారాలు గాలిలో మారుమోగుతాయి.

కోసక్‌లచేత విముక్తమయిన పట్టణాలనుంచి పోలిష్
రక్షణదళాలు ఎలాపారిపోయిందీ చరిత్ర పుటలలో వివరంగా
ఉల్లేఖింపబడింది. క్రూరయూదు వడ్డీ వ్యాపారస్తులను ఎలా ఉరి
తీసిందీ, ఈ అజేయసేనముందు రాయల్ హెట్మన్ మినొటాజ్
పోటోనే అసంఖ్యాక సేనతో ఎలాకొరగాకపోయాడో, శత్రు
వులు తరుముకురాగా చిన్న కాలవలో అతని సేనలో అత్యుత్త
మమయినవారు ఎలానశించిపోయారో. పొలొనొయే పట్టణంలో
కోసక్ పటాలాలు అతనిని ఎలాచుట్టుముట్టారయో, గత్యంతరం
లేక ఈ పోలిష్ హెట్మన్ వారి కోరికను తీర్చి పూర్వపు
హక్కులు, సదుపాయాలు పునరుద్ధరించడానికి ప్రమాణం చే
యడం అందులో వర్ణింపబడింది. కాని ఈ విధంగా కోసక్‌లను
మోసగించడం ఎవరితరమూకాదు. పోలిష్ వారి ప్రమాణాల
విలువవారికి తెలుసు. ఆ పట్టణంలోని రష్యన్ ఫాదరీలు అతని
ప్రాణాలు రక్షించకపోయి ఉన్నట్లయితే గొప్పఇంటి స్త్రీల
క్రీగంటిచూపులను ఆకర్షించుతూ, అశ్విక దళాలకు కన్నెర్రగా
ఆరువేల డకెట్లు ఖరీదుచేసే గుర్రంమీద విహరించేవాడుకాడు.
పార్లమెంటుకు హాజరయి సభ్యులకు విందు చేయగలిగేవాడు
గాడు. ఫాదరీలందరూ, ధగధగా మెరిసే బంగారపు అంగ

రఖాలు ధరించి దేవతా విగ్రహాలు, శిలువలు చేతిలో పుచ్చు
కుని బిషప్పు నాయకత్వాన ఎదురేగేసరికి కోసక్‌లు అందరూ
టోపీలు తీసివేసుకొని తలవంచి నమస్కరించారు. ఆసమ
యంలో రాజుకు సహితం అటువంటి గౌరవం ఇచ్చేవారుగాదు.
తమ చర్చిమీద తిరుగుబాటు చేయడానికి ధైర్యంచేసే ఫాదరీల
ఆజ్ఞలను శిరసావహించారు. చర్చిలను అపవిత్రంగాచేయకుండా
వదలివేసి, గతంమరచి, కోసక్‌లకు హానికలగజేయనని ప్రమా
ణంచేయించి పోటక్‌ని వదలివేయడానికి హెట్మన్, అతని సేనా
నులు అంగీకరించారు. కాని ఒక్క సేనానిమాత్రం ఈ విధ
మయిన శాంతిసంధికి అంగీకరించలేదు. ఆ అంగీకరించనిది మరె
వరోకాదు తారాస్. తలవెంట్రుకలు నాలుగు పెరికి "గే"
హెట్మన్, సేనానులు! అటువంటి ఆడంగిపనిచేయకండి! పోలండు
వారిని నమ్మకండి! కుక్కలు, చివరికి ద్రోహం తలపెడతారు."
అని అరిచాడు.

పటాలంలేఖకుడు వ్రాసితే హెట్మన్ సంతకంపెట్టాడు
ఉక్కు పట్టా కత్తిని రెండుగా విరిచి ఇరువైపులా రెండు
ముక్కలు విసిరి వేసాడు తారాస్.

"శెలవు! యీ రెండు కత్తిముక్కలు యెన్నటికీ తిరిగి
కలుసుకోనట్లే యీ ప్రపంచంలో మనము తిరిగి కలుసుకోము.
నా యీ వీడ్కోలు మాటలు మరిచేపోకండి!" ఈ మాటలు
చెపుతూంటే అతని గొంతు ఉబికి హెచ్చుస్థాయికి చేరుకుంది.
అపూర్వమయిన శక్తితో మారుమోగింది. "మీ మరణ సమ
యంలో నేను జ్ఞాపకం వస్తాను. శాంతి, సముపార్జించామని
మీరు భావించవచ్చు, ఆధిపత్యం వహించగలమని భావించవచ్చు

ఉహుఁ - యితరులే మీ మీద ఆధిపత్యం వహిస్తారు. హెట్మన్, నీ తలకొట్టి చర్మం వొలిచి, తవుడులోనింపి సంతలలో తిప్పి చూపుతారు. తక్కినవారి తలలు కూడ నిలవవు. గొర్రెలను వండినట్టు మిమ్మల్ని బానలలో వేసి వండుతారు, లేదా జైలు చీకటి తడి కొట్లలో నశించిపోతారు." ఇలా చెప్పేసరికి అందరూ గడగడా వణికిపోయారు. తన సహచరులకేసి తిరిగి, "వధూవరుల లాగా వొకే పాన్పుమీద సహజంగా మృతి చెందాలని యెవరు కాంక్షిస్తున్నారు? అటకమీద, స్త్రీలపక్కలా దొర్లకుండా కల్లుదుకాణం పక్కన కంచెకింద తాగి పడుండకుండా, కోసక్ చావు చావదలచిందెవరు? యింటికి తిరిగి వెళ్ళి పాషండులుగా మారి పోలిష్ ఫాదరీలను బుజాలమీద మోయాలని వాంఛించే దెవరు?" అని అడిగాడు.

"నీ వెంట వస్తాం! వస్తాం!" అని బుల్బా పటాలంలోని వారందరూ కేకపెట్టారు. ఇతరులు చాలా మందికూడా వారి పక్షంవచ్చి చేరారు"

"అలా అయితే సరే. నా వెంటరండి!" అన్నాడు తారాస్ టోపీ కనుబొమ్మలమీదికి దింపుకుని, వెనక దిగబడి పోయిన వారివంక తేరి పారజూస్తూ. జీనుమీద కూర్చుని, "అప్రదిష్టపాలు కావద్దు, పదండి కాథలిక్కులకు దర్శనమిద్దాం" అన్నాడు.

ఇలా అని గుర్రాన్ని కొరడాతో కొట్టాడు. అతని వెంట నూరుశకటాలు, అశ్విక పదాతులు బయలుదేరారు. వెన కకు తిరిగి దిగబడిపోయిన వారివంక తేరిపార జూశాడు. కళ్ళు నిప్పులు గక్కుతున్నాయి ఎవరూఅతనిని ఆప సాహసించలేదు.

తారాస్ పటాలం సేన అంతా చూస్తూండగా పయనమయింది. తారాస్ వెనుదిరిగి చాలాసేపు తేరిపార జూస్తూనే ఉన్నాడు.

హెట్మన్, అతని సేనానులు కిందిచూపులు బరపుతూ విచారంతో నిలబడ్డారు. ముందు రాబోయే ఆపదలను తల చుకుని కుంగిపోయిన వారిలా చాలాసేపు మాట్లాడనేలేదు. తారాస్ చెప్పినంతా జరిగింది. పొల్లుపోలేదు. కనీవ్ దగ్గర ద్రోహం జరగగానే హెట్మన్ తల, చాలామంది ఇతర అధికారుల తలలూ వాసాలకు తగిలించారు

ఇక తారాస్, తన పటాలంతో పోలండులోనికి బాగా చొచ్చుకుపోయాడు. పద్ధెనిమిది పట్టణాలు, నలభయి కాథలిక్ చర్చిలు తగలబెట్టాడు. క్రాకా చేరుకున్నాడు. అనేక మంది ప్రభువులను చంపాడు. అనేక కోటలను దోచుకున్నాడు. పెద్ద పెద్ద నేలమాళిగాలలో జాగ్రత్తగా నిలవచేసిన పాత ద్రాక్షసారా పీపాలు బద్దలుకొట్టి సారా నేలపాలు చేశారు. విలువగల సామాను, దుస్తులు ముక్కలు ముక్కలు చేశారు. "వొకటీ అట్టేపెట్టకండి!" ఇది తారాస్ ఆజ్ఞ. నల్లటి కనుబొమల స్త్రీల ఎడగాని, తెల్లటి వక్షస్థలాలు, ముత్యపురంగు ముఖము గల కన్యల ఎడగానివారు దయచూపలేదు. పూజాస్థలంలో దాక్కున్నా వారికి చావుతప్పలేదు. భయంకరమయిన అగ్నిజ్వాలలమధ్య హాహాకారాలు చేస్తూ ఆకాశంకేసి మంచి తెలుపు చేతులు ఎత్తి అనేకమంది ప్రార్థించారు. వారి హాహాకారాలకు భూదేవత కూడా కరిగిపోతుంది. మైదానంలోని గడ్డికూడా తలవంచుకుంటుంది. కాని కోసక్ క్రూరులు వారి హాహాకారాలు లక్ష్యపెట్టలేదు. వీధులలో తిరిగే పసిపిల్లలను బల్లాలతో గుచ్చి ఎత్తి మంటలలో పారవేసారు.

"యిది ఒస్టాప్ శ్రాద్ధపువిందు" అన్నాడు తారాస్. ఒస్టాప్ స్మారకార్థం ప్రతిపట్టణంలో ప్రతి పల్లెలో ఇటువంటి 'విందులు' తారాస్ చేయసాగాడు ఇవి మామూలు దాడులను మించిపోయాయని గ్రహించి పోలిష్ ప్రభుత్వం తారాస్‌ను ఎలాగయినా సరే పట్టుకోవలసిందిగా పొటోనేని ఆదేశించింది.

కోసక్‌లు ఆరురోజులు తప్పించుకుని తిరగగలిగారు, పొలాలవెంట దౌడుతీశారు. గుర్రాలు ఈ శ్రమకు తట్టుకోలేక పోయినా ఎలాగో అలాగ వారి ప్రాణాలు రక్షించాయి. అప్పగించిన కార్యం నెరవేర్చగల సమర్థుడు పట్టుదలతో వెంబడించి నీస్టర్ నది ఒడ్డుమీది ఒకకోటలో తారాస్ విశ్రాంతి తీసుకుంటూంటే చుట్టుముట్టాడు.

నీస్టర్ నదిపైన నిటారుగా ఉన్న కొండఅంచున చిందర వందరయిన ప్రాకారాలు, కూలిపోతున్న గోడలుగోచరిస్తున్నాయి కొండపై భాగమంతా రాళ్ళముక్కలతో, ఇటుకలతో నిండి ఏ నిమిషానయినా కూలిపోవడానికి సిద్ధంగా ఉంది. మైదానానికి ఎదురుగా కొండ కిరువైపులా బుల్బాను పోటేనే చుట్టుముట్టాడు. రాళ్ళతో రప్పలతో తిప్పికొడుతూ కోసక్‌లు నాలుగురోజులు పోరాడారు. కాని చివరికి వారి శక్తి ఉడిగి పోయింది. ఆహారపదార్థాలు తరిగి పోయాయి. శత్రుశ్రేణులను చీల్చుకుంటూ దోవ చేసుకుపోవాలని తారాస్ నిశ్చయించాడు. కోసక్‌లు దోవచేసుకుని వెళ్ళగలిగేవారే, గుర్రాలు విశ్వాసం చూపేవేగాని యుద్ధం జోరుగా సాగుతూంటే తారాస్ హఠాత్తుగా ఆగి, "ఆగండి! నా పైపు కిందపడింది ఆ పాషండులకు నా పైపు, పుగాకు అయినా సరే చిక్కకూడదు!" అని కేక

పెట్టాడు. ఆ ముదుసలి కిందకు వంగి గడ్డిలో పైపుకో సం వెదకసాగాడు. ఈ పైపు విడిచి అతను ఎన్నడూ ఉండలేదు. ఇంటిదగ్గర ఉన్నా, దాడికి బయలుదేరినా సతతమూ అతనిదగ్గరే ఉండేది. ఇంతలో ఒక సైనికదళం పరుగెత్తుకుంటూ వచ్చి అతని బుజాలు పట్టుకున్నారు. విడిపించుకోవాలని యత్నించాడు కాని పూర్వంలా శత్రువులను నేల కూల్చలేకపోయాడు.

"అబ్బ; వృద్ధాప్యం!" అంటూ బావురమని ఏడ్చాడు. కాని ఇది వృద్ధాప్యఫలితం కాదు. పదిమంది బలంముందు ఒకని బలం సాగలేదు. ముప్ఫయిమంది అతని కాళ్లూ చేతులూ పట్టే శారు. "పిట్ట పట్టుబడింది" అని పోలండు సైనికులు కేకలు పెట్టారు" వీడికి తగినశాస్తి చేయడం యెలానో ఆలో చించాలి! నలుగురూ చూస్తూండగా అతనిని ప్రాణాలతో దహ నం చేయాలని నిశ్చయించారు. హెట్మన్ అందుకు అంగీక రించాడు. పిడుగుపాటుకు కొమ్మలు రాలిపోయిన చెట్టుబోదె కనిపించింది. ఇనప గొలుసులతో ఆ బోదెకు తారాస్‌ను కట్టి వేసి చేతులకు మేకులు కొట్టారు. దూరానికి కూడా కనిపించ డానికి వీలుగా అతనిని పైకి ఎత్తారు. కింద కట్టెమోపులు పేర్చారు. కాని తారాస్ వాటివంక చూడలేదు. తనను దగ్ధం చేసే అగ్నిని గురించి ఆలోచించలేదు. కోసక్‌లు వెనుదిరిగి కాల్పులు సాగిస్తున్నదిక్కే తేరిపార జూశాడు. పైకి లేపి కట్టా రేమో అరచేతిలోని అద్దంలాగా వారు స్పష్టంగా తారాస్‌కి కనిపించారు.

"తొందరగా, తొందరగా ఆ కొండ చేరుకోండి" అని కేక పెట్టాడు. "అడివి అవతల కొండకు చేరుకోండ! అక్కడికి చేరితే మిమ్మల్ని పట్టుకోలేరు"

కాని అతని మాటలు వారికి వినిపించలేదు.

"లాభంలేదు! లాభంలేదు! కాస్తదానికోసం యెంత పని జరిగింది! నిరాశతో తళతళలాడే నీస్టరునదిని చూసాడు.

కళ్ళల్లో సంతోషం తాండవించింది. పొదలమధ్యనుంచి ముందుకు పొడుచుకువస్తున్న నాలుగు పడవల ముఖభాగాలు గోచరించాయి· ఊపిరితిత్తుల బలం అంతటినీ కూడగట్టి ఎలుగెత్తి అరిచాడు! "వొడ్డుకు చేరుకోండి! వొడ్డుకుచేరుకోండి! యెడమ పక్కన కొండదిగువ బాటపట్టండి! ఆ వొడ్డునే పడవలు వున్నాయి. వాటినన్నిటినీ తీసేసుకోండి. లేకపోతే శత్రువులు వెంబడిస్తారు"

కాని ఈ తడవమట్టుకు అతని మాటలు కోసక్‌లకు వినిపించాయి. కాని ఇలా సలహా చెప్పినందుకు తలమీద గొడ్డలి తిప్పి వేటువేసారు. కళ్ళల్లో సమస్తమూ తిరిగిపోయింది.

కోసక్‌లు కొండతోవంటే నిండువేగంతో దౌడుతీసారు. కాని శత్రువునుసమీపించేసారు. దోవ వంకరటింకరగా వుండిపారి పోవడానికి అవరోధం కలిగిస్తోంది. "పదండి, కామ్రేడ్స్! అని ఒకనిమిషం కళ్ళాలు బిగబట్టి, కొరడాలు ఎత్తి ఈలలు వేసారు. ఆ తాతారు గుర్రాలు నేలమీదనుంచి ఎగిరి ఆఘమేఘాల పరుగెత్తుతూ కొండగట్టుమీదుగా ఎగిరి నీ స్ట ర్ న ది లో కి దూకాయి. ఇద్దరు రౌతులుమాత్రం నదిని చేరుకోలేకపోయారు. కిక్కురుమనకుండా గుర్రాలతోపుకు ఆ ఇద్దరూ కిందపడి హాత మారిపోయారు. కాని తక్కిన కోసక్‌లు అంతా గుర్రాలతో ఈదుకుంటూ వెళ్ళి పడవలను ఊడదీశారు. పోలండుసేన కొండ అంచున నిలబడి కనీవినీ ఎరగని ఈ సాహస కృత్యానికి అబ్బుర

పోతూ కిందకు ఉరుకుదామా వద్దా అని ఆలోచిస్తూ నిలబడి పోయారు. అంద్రీని మంత్రముగ్ధుడిని చేసిన ఆ పోలండుసుందరి సోదరుడు, ఆలోచించడానికి ఆగకుండా కోసక్‌ల వెనకే యావచ్ఛక్తినీ ఉపయోగించి దూకాడేగాని కొండమీద కూలి ముక్కలు ముక్కలయిపోయాడు. వాడిగల రాళ్ళమూలంగా ముక్కలు ముక్కలయి ఆ అగాధంలో మరణించాడు. కాని నెత్తురుతో కలిసి మెదడు చిందరవందరయై అగాధపు కొండ గోడలో పెరిగిన పొదలను కొట్టుకుంది.

తారాస్ బుల్బా గొడ్డలి పెట్టునుంచి కోలుకొని నీస్టర్ నదికేసి చూసేసరికి కోసక్‌లు పడవలలో ఎక్కి తోసుకుపోతున్నారు. పైనుంచి తుపాకిగుళ్ళ వర్షం కురుస్తోంది. కాని వారికి మాత్రం తగలడంలేదు. ముసలి ఆటామన్ కళ్ళు సంతోషంతో ధగధగా మెరిసిపోయాయి.

"శుభమగుగాక! కామ్రేడ్స్!" పైనుంచి తారాస్ కేక పెట్టాడు. "నన్ను జ్ఞాపకం వుంచుకోండి. వచ్చే వసంతకాలం తిరిగి దాడి చేయడానికి యిక్కడికి రండి! పాషండపు వెధవల్లారా! కోసక్‌లను బెదరించగల శక్తి యీ భూ ప్రపంచంలో లేదు! ఆగండి! సనాతన రష్యన్లు యెటువంటివారో తెలిసివచ్చే రోజు వస్తుంది. దగ్గిరా, దూరానా వున్నవారంతా వూహించి చెపుతూనే వున్నారు. రష్యన్ గడ్డమీద వొక పాలకుడు ఆవిర్భవిస్తాడు. అతనికి లొంగనిదంటూ యీ భూమ్మీద వుండదు!"

కట్టెల మోపులనుంచి మంటలు పైకిలేచి అతని పాదాలను కాలుస్తూ పాకి చెట్లువెంబడే ప్రజ్వరిల్లాయి.... కాని ఏ

మంటలూ, ఏ చిత్రహింసా, ఏ శక్తీ ఈ భూమిమీద రష్యన్ శక్తిని వంచలేదు.

సీస్టర్ చిన్ననది ఏమీకాదు. దానికి కయ్యలు, దట్టమయిన తుంగ, మిట్టలు, లోతు బిలాలు చాలా ఉన్నాయి. అద్దంలాంటి నదీ ఉపరితలం తళతళా మెరుస్తోంది. హంసధ్వనులు ప్రతిధ్వనిస్తున్నాయి. బాతులు తొందర తొందరగా నీటిలో ఈదుతున్నాయి. ఉల్లానిపిట్టలు, ఎర్రగొంతుకలబోయపిట్టలు ఆ నదిలోని తుంగలో, ఒడ్డువెంటా దాగుకుని ఉన్నాయి. కోసక్‌లు అతివేగంతో, సన్నని రెండు చుక్కానుల పడవలలో మిట్టలను సరిచేసుకుంటూ పక్షులను అదరిస్తూ సాగిపోయారు. అలా పయనిస్తూ తమ ఆటామన్ గురించిముచ్చటించుకున్నారు.



........గొగోల్ ఎంతటి ప్రతిభావంతుడు! ఎంతటి కళా కారుడు! రచన ఎంతటి శక్తివంతమయినది....ఉత్తమ రష్యన్ రచయితలలో గొగోల్ ఒకడు.

—ఎ. సి చెకోవ్.



........గొగోల్ అంతటి ప్రముఖ రచయిత ప్రపంచంలో ఆవిర్భవించి చాలాకాలమయింది.

—యస్. జి. చెర్నిషెవిస్కీ.



........రష్యన్ సాహిత్యంలో వచ్చిన నవ్యవాస్తవికతా ధోరణికి గొగోల్ ఆదిపురుషుడని గుర్తించక తప్పదు. ఇష్టమున్నా లేకపోయినా, వన్నె చిన్నెలు ఎటులున్నా, తరవాత వచ్చిన రచయిత లందరూ గొగోల్‌ను అనుసరించారు.

—యం. వై. సాల్ట్వోవ్-షెడ్రిన్.

